1993-2013 నడుస్తున్న చరిత్ర

సంపుటి : 2
సంచిక : 5
రు. 20/-లు
తెనాలి

తెలుగుజాతి పత్రిక

# అమ్మనుడి

నుడి నాడు నెనరు
జులై 2016

అన్నివిధాల పెత్తందారీతనాన్ని
అచ్చమైన తెలుగు పాటలతో ప్రశ్నించి
విప్లవ జ్వాలల్ని రగిలించిన
అసలు సిసలైన ప్రజాకవి...
గూడ అంజయ్య






ద్రావిడ భాషా సిద్ధాంతానికి 200 ఏళ్లు...
అంతర్జాతీయ సదస్సు

పాఠశాల విద్యారంగం నుండి ప్రభుత్వాన్ని పూర్తిగా తప్పించే ఎత్తుగడలు?!

# "మనిషికి ఎన్ని ఉన్నా, ఆరోగ్యం లేకుంటే - జీవితంలో ఆనందం లేనట్టే"

## హోమియో వైద్యంలో నివారింపబడు వ్యాధులు



**మానసిక వ్యాధులు :** జ్ఞాపకశక్తి తగ్గుట, ఆందోళన, అస్థిమితము, డిప్రెషన్స్, ప్రేమభంగము వలన కలిగే మానసిక అస్వస్థతలు, నిద్రలేమి, నిద్రలో గురక మొ॥నవి.

**శారీరకమైనవి :** చర్మవ్యాధులు, బొల్లి, పులిపిర్లు, నల్లమచ్చలు, సొరియాసిస్ (పొరలు ఊడు చర్మవ్యాధి) బోద, ఉబ్బసము, ఎలర్జీ (అన్ని రకములు) పోలియో, కోరింతదగ్గు, జీర్ణాశయ వ్యాధులు, వెంట్రుకలు ఊడుట, చిన్నతనములోనే నెరయుట, కండ్లకలక, న్యుమోనియా (ఊపిరితిత్తులలో నెమ్ము), పక్షవాతము, నరముల బలహీనత, దీర్ఘకాల తలనొప్పి, లివర్లు, పసికర్లు, గ్యాస్ట్రబుల్, సయాటికా, నడుమునొప్పి, హెపటైటిస్(బి), లుంబర్, సర్వికల్ నొప్పి.

**జననేంద్రియ వ్యాధులు :** వీర్యశక్తికి, నపుంసకత్వం నివారణకు, సంతానం కలుగుటకు, గర్భిణీ స్త్రీ సుఖప్రసవమునకు, ఎరుపుగాని, తెలుపుగాని అవుచున్న చికిత్స చేయబడును. సకాలములో రజస్వల కాకపోవుట, ఋతుశూల, గనేరియా "సిఫిలిస్ (సుఖవ్యాధులు)" మొ॥ వాటికి నిపుణతతో చికిత్స చేయబడును. ఎయిడ్స్ (హెచ్.ఐ.వి.)కి ప్రత్యేక నిరోధక, నివారణ చికిత్స చేయబడును.

### నా ప్రముఖ వైద్య, ఆరోగ్య గ్రంథములు

- హోమియో వైద్యం (1 & 2 భాగములు)
- ఇంగ్లీషు - తెలుగు మెడికల్ డిక్షనరీ
- యోగశాస్త్రం - ప్రథమ చికిత్స
- భారతీయ వైద్య విధానాలు
- హోమియో వస్తు గుణదీపిక
- సెక్స్ అండ్ హోమియో
- హోమియో దర్శిని
- ప్రకృతి వైద్యం
- మెడికల్ గైడ్
- హెల్త్ అండ్ బ్యూటీ
- వైద్య రత్నాలు
- సంపూర్ణ హోమియో వైద్యం

మరియు అనేక ఇతర గ్రంథములు

యునెస్కో అవార్డు గ్రహీత, మిలీనియం సోషల్ సర్వీస్ మెడల్ గ్రహీత,
"ప్రజావైద్య సేవక్", "భిషక్ రాజా", "ఆరోగ్య రక్షక్", "దక్ష వైద్యశ్రీ" బిరుదాంకితులు.
అనేక వైద్య, ఆరోగ్య గ్రంథముల రచయిత సి.వి. రామన్ అకాడమి,
హైదరాబాద్ వారిచే "హోమియో విశారద" బిరుదాంకితులు

**Ln. డా॥ కె.వి.యన్.డి. ప్రసాద్ DHMS, M.H.S. (London)**

పాత గవర్నమెంట్ ఆసుపత్రి వెనుక, శ్రీ రాధాకృష్ణ కళ్యాణమండపం వద్ద, కొత్తపేట, తెనాలి.

☎ 08644 - 220832, Cell : 98484 09749



"విద్య వ్యక్తికి జీవిత సూత్రాలను నేర్పేదిగా ఉండాలి. అందుకు ప్రాథమిక విద్య పునాది వేసేదిగా ఉండాలి. బిడ్డ శరీర పోషణకు తల్లి పాలు ఎంత అవసరమో, మన వికాసానికి మాతృభాష కూడా అంత అవసరం. శిశువు తన తొలి పాఠాన్ని తల్లి దగ్గరే నేర్చుకుంటుంది. కాబట్టి బిడ్డలపై విదేశీ భాషను రుద్దటం మాతృదేశానికి ద్రోహం చేయటమే అని నా అభిప్రాయం".

**-మహాత్మాగాంధీ**



"ఆంగ్లాన్ని ప్రత్యేక మెలకువలతో, జాగ్రత్తలతో రెండవ భాషగా నేర్పాలి. కానీ బోధన మాత్రం మాతృభాషలోనే జరగాలి. యూనివర్సిటీ స్థాయి వరకూ మాతృభాషలో చదివే అవకాశాలు కలిగించాలి. ఇందుకు నాలుగు ప్రధాన కారణాలు ఉన్నాయి. 1. మాతృభాషలో మాత్రమే జీవితానికి సంబంధించిన లోతుల్ని స్పృశించగలరు. 2. ఏ విషయంలోనైనా ప్రత్యేక నైపుణ్యాన్ని సాధించాలంటే అందుకు భాష అడ్డంకిగా ఉండకూడదు. 3. వ్యక్తి సామర్థ్యం కొత్త భాష నేర్చుకొనేందుకు సరిపోతుంది తప్ప, అవసరం అయిన పరిజ్ఞానాన్ని నేర్చుకోవటంలో వెనుకపడుతారు. 4. మాతృభాషలో విద్యాబోధన వల్ల బాలికల చదువు మెరుగవుతుంది. భారతీయ సమాజంలో మహిళా విద్యకు తక్కువ ప్రాధాన్యత ఉంది కాబట్టి మాతృభాషలో విద్య వల్ల బాలికల్లో విద్యకు సంబంధించిన అదనపు భారం లేకుండా ఉంటే వారి విద్యావకాశాలు మెరుగవుతాయి".

**-రవీంద్రనాథ్ ఠాగూర్**



"నేను తమిళంలో చదివాను. మనం అమ్మభాషను నేర్చుకోవాలి. బాగా పుస్తకాలు చదవాలి. స్థానిక భాషల్లో చదువును బోధించడానికి ఉపాధ్యాయులకిచ్చే శిక్షణమీద మనం దృష్టిని సారించాలి".

**-ఏ.పి.జె.అబ్దుల్ కలాం**

అన్నివిధాల పెత్తందారీతనాన్ని అచ్చమైన తెలుగు పాటలతో ప్రశ్నించి విప్లవజ్వాలల్ని రగిలించిన అసలు సిసలైన ప్రజాకవి...గూడ అంజయ్య.
కుల మత వర్గ ఆధిపత్యాలను తొలగించే నూతన ప్రజాస్వామిక విప్లవంలో కొనసాగడమే ఆయన నుంచి మనం పొందవలసిన స్ఫూర్తి. **అమరుడు, యుగకవి గూడ అంజయ్యకి లాల్ నీల్ సలాం..** 12వ పుటలో...



## లోపలి పుటలలో....




కైసేత, ముఖచిత్ర అలంకరణ : **కలిమిశ్రీ**
ఫొటోలు : **తమ్మా శ్రీనివాసరెడ్డి, అనుమల్ల గంగాధర్**
రేఖాచిత్రాలు : **చిదంబరం** పకపకలు : **సరసి**



రచనలు, ఉత్తరాలు పంపుటకు చిరునామా
**డాక్టర్ సామల రమేష్‌బాబు,** సంపాదకుడు, **అమ్మనుడి,**
జి-2, శ్రీ వాయుపుత్ర రెసిడెన్సీ, హిందీ కళాశాల వీధి, మాచవరం, విజయవాడ-520004.
దూరవాణి: కార్యాలయం : *0866-2439466* సంపాదకుడు : *9848016136*
e-mail : editorammanudi@gmail.com

తెలుగుజాతి పత్రిక

# అమ్మనుడి

మాసపత్రిక

• నుడి • నాడు • నెనరు

సంపాదకుడు డా॥ సామల రమేష్‌బాబు

శాలివాహన శకం 1938 : దుర్ముఖినామ సంవత్సర జ్యేష్ఠ *(ఒల్లాపి) బహుళ ద్వాదశి శుక్రవారం మొదలు ఆషాఢ *(కట్లాపి) బహుళ త్రయోదశి ఆదివారం వరకు

* ఒల్లాపి * కట్లాపి : తెలుగు నెలలు

## చందా వివరాలు

| | | వ్యక్తులకు | సంస్థలకు | విదేశీయులకు |
|---|---|---|---|---|
| శాశ్వత చందా | : | రూ.5000 | రూ.7500 | -- |
| 5 సం॥ | : | రూ.1000 | రూ.1500 | 150 డాలర్లు |
| 3 సం॥ | : | రూ. 700 | రూ.1000 | 75 డాలర్లు |
| 1 సం॥ | : | రూ. 240 | రూ. 400 | 25 డాలర్లు |

ఎం.ఓ. లేదా తెనాలిలో చెల్లునట్లు బ్యాంకు డి.డి.ని **'అమ్మనుడి'** పేర పంపాలి. చెక్కు పంపేట్లయితే దయచేసి అదనంగా రు.30 లు చేర్చి పంపండి.

ఆన్‌లైన్ ద్వారా చందాను పంపేవారు NEFT / RTGS ద్వారా **'అమ్మనుడి'**-యాక్సిస్ బ్యాంకు, తెనాలి శాఖకు పంపాలి.

**AMMA NUDI - AXIS BANK, TENALI**

అక్కౌంట్ నెం. **915020010550189**

**IFSC Code : UTIB0000556**

ఆన్‌లైన్‌లో చందాను పంపినవారు, ఆ వెంటనే దయతో - చిరునామా, ఫోన్ నెం. తదితర వివరాలను జాబుద్వారాగాని, ఫోన్ మెసేజి ద్వారాగాని తెలుపగలరు.

చందాలు పంపడం, దానికి సంబంధించిన ఉత్తర ప్రత్యుత్తరాలకు చిరునామా

**డా॥ సామల లక్ష్మణబాబు,** ప్రచురణకర్త, 'అమ్మనుడి'
8-386, జీవక భవనం, అంగలకుదురు పోస్టు, **తెనాలి**
గుంటూరు జిల్లా - 522 211. ఫోన్ : 9440448244
ఇ-మెయిల్ : ammanudi@gmail.com

**చందాదారులు కోరినట్లయితే ఆన్‌లైన్‌లో కూడా పత్రికను పంప గలము. ఇందుకోసం మీ ఇ-మెయిల్ ఐడిని తప్పక తెలుపగలరు.**

### చందాదారులకు సూచనలు

1. చందా కాలం ముగింపు తేదీ - పత్రిక కవరుమీద మీ చిరునామా పై భాగంలోనే ఉంటుంది. గమనించండి.
2. చందా పూర్తయ్యేందుకు ఒక నెల ముందే దయచేసి మీ చందాను పంపించండి.
3. మీ ఇంటి నెంబరుతో పూర్తి చిరునామాను, పిన్‌కోడ్ నెంబరుతో సహా తెలియపరచాలి. మీ ఫోన్ నెంబరును, వుంటే మీ మెయిల్ ఐడి ని తెలపాలి.
4. మీ చిరునామా మారినట్లయితే దయచేసి వెంటనే తెలియజేయండి.

## రచయితలకు సూచనలు

1. విభిన్న అంశాలపై వ్యాసాలను పంపవచ్చు. ముద్రణలో 1 నుండి 3 పుటలకు మించకుండా ఉండాలి. అన్నిరంగాలలో తెలుగు వారి శ్రేయస్సుకు సంబంధించిన రచనలను పంపండి. విమర్శలు విషయం పైనే ఉండాలి గాని వ్యక్తులపై గురిపెట్టి చేయరాదు. అప్రజాస్వామిక రచనలను తీసుకోలేము. సరళమైన తెలుగులో వ్రాయాలి. 2. రచనలను యూనికోడ్‌లో గాని, అనుఫాంట్స్‌లో గాని టైప్ చేసి లేదా ఎ4 సైజు కాగితంపై వ్రాసి, స్కాన్ చేసి editorammanudi@gmail.com కు పంపాలి. లేదా కొరియర్ / రిజిష్టర్డ్ / సాధారణ పోస్టులో పంపవచ్చు. **3. రచనతోపాటు రచన స్వంతమేనని, ఇతర పత్రికలకు గాని, ఇంటర్నెట్ పత్రికలకు గాని పంపలేదని, పరిశీలనలో లేదని, ఇంతవరకు ఎక్కడా ప్రచురణ కాలేదని హామీపత్రాన్ని స్పష్టంగా వ్రాసి పంపాలి. పోస్టల్ చిరునామా, ఫోన్ నెం., ఇ-మెయిల్ కూడా ఇవ్వాలి. ఈ వివరాలు లేని రచనల్ని తీసుకోలేము.** 4. మాకు పంపే రచన నకలును మీ వద్ద ఉంచుకోండి. ప్రచురణకు ఎంపిక చేయని రచనలను తిప్పి పంపడం వీలుకాదు.

## కథారచయితలకు, కవులకు విన్నపం

1. మాట్లాడుకొనే తెలుగులో వ్రాసిన కథల్ని **'నడుస్తున్న చరిత్ర'** ప్రచురించిన సంగతి చదువరులకు, రచయితలకు తెలిసిందే. ఈ సంప్రదాయాన్ని **'అమ్మనుడి'** పత్రిక కొనసాగిస్తున్నది. పాత్రల సంభాషణలు తప్పనిసరిగా మీ ప్రాంతంలో మాట్లాడుకొనే తెలుగు తీరులో ఉండాలి. కథాచిత్రణ కూడా మీ తెలుగు తీరులోనే ఉంటే మంచిది. కఠినమైన సమాసాలను ఉపయోగించవద్దు. తేలికైన తెలుగు మాటలు కుదరకపోతే జనం వాడుకలోని ఇతర ప్రాంతాల తెలుగు మాటల్ని వ్రాయవచ్చు. తప్పనిసరి అయితే తప్ప ఏ ఇతర భాషల మాటలను ఉపయోగించవద్దు. ఈ సూచనలే కవితలకూ వర్తిస్తాయి.

2. **'అమ్మనుడి'**లో ప్రచురణకు తీసుకొనే కథలు, కవితలు తెలుగు వారి సామాజిక, భాషాసంస్కృతుల వికాసానికి తోడ్పడేవిగా ఉండాలి. ప్రతినెలా ఒకటి లేక రెండు కథలను మాత్రమే ప్రచురించగలం. ముద్రణలో 2 లేక 3 పుటలకు మించకుండా ఉండేవాటినే తొలి ఎంపికకు తీసుకుంటాము. కవితలు 20 నుంచి 30 వరుస (లైను)లకు మించకూడదు.



**డా॥జి.వి.ఎస్.ఎస్. సీతారామస్వామి – డా॥జి.వి.ఎస్.ఎల్.అనూరాధ**

పిఠాపురం, తూ.గో.జిల్లా
ఫోను : 94484 19863

తూర్పుగోదావరి జిల్లా గొల్లప్రోలు మండలంలోని చేబ్రోలు వాస్తవ్యులు.. పిఠాపురంలో ప్రముఖ వైద్యులు. సాహిత్యం, సంగీతం వీరి అభిరుచులు. తెలుగునుడి పట్ల ఎంతో మక్కువ. ప్రఖ్యాత సాహితీవేత్త ఆవంత్స సోమసుందర్ గారి శిష్యులు. నాటి 'నడుస్తున్నచరిత్ర'కు నేటి 'అమ్మనుడి'కి అభిమాన పాఠకులు. ప్రోత్సాహకులుగా రు.10,000/ ట్రస్టుకు ఇచ్చిన వీరికి మప్పిదాలు.



**నన్నపనేని అయ్యన్‌రావు గారు,**

గుంటూరు, ఫోను: 94914 78884

1940 ఆగస్టు 6న గుంటూరుజిల్లా కొల్లూరులో జన్మించిన అయ్యన్‌రావు గారు ఉద్యోగ, వ్యాపారాల అనంతరం గుంటూరులో స్థిరపడ్డారు. తల్లిదండ్రుల పేరున ఒక ట్రస్టును స్థాపించి కొల్లూరు, తెనాలి, గుంటూరులలో విద్యార్థులకు స్కాలర్‌షిప్ ఇస్తున్నారు. అన్నమయ్య కళావేదిక ద్వారా సాంస్కృతిక కార్యక్రమాలను ప్రోత్సహిస్తున్నారు. సేవా కార్యక్రమాల్లో పాల్గొంటున్నారు. అమ్మనుడి అభిమాన పాఠకులు. ప్రోత్సాహకులుగా రు.10,000/ ట్రస్టుకు ఇచ్చిన వీరికి మప్పిదాలు.



**డా॥ఈమని శివనాగిరెడ్డి గారు,**

విజయవాడ, ఫోను: 98485 98446

చరిత్ర, పురావస్తుశాఖలో డాక్టరేట్ చేసి, రాష్ట్ర పురావస్తుశాఖలో స్థపతిగా పని చేసిన డా॥ఈమని శివనాగిరెడ్డి, తెనాలి దగ్గర వలివేరులో 1955లో పుట్టారు. చరిత్ర, శాసనాలు, పురావస్తు శాస్త్రం, పర్యాటకం, బౌద్ధంలపై అనేక పుస్తకాలు వ్రాశారు. శ్రీశైలం జలాశయం ముంపుకు గురైన క్రీ.శ.7–11 శతాబ్దాల నాటి 100కు పైగా గుడులను తొలగించి, ఎగువన తిరిగి నిర్మించారు. నడుస్తున్న చరిత్రకు, అమ్మనుడికి పెద్దఅండ.

ప్రోత్సాహకులుగా రు.10,000/ ట్రస్టుకు ఇచ్చిన వీరికి మప్పిదాలు.

## తెలుగుజాతి (ట్రస్టు) విన్నపం

'నడుస్తున్న చరిత్ర' ప్రోత్సాహంతో ఆంధ్రప్రదేశ్‌లోనే కాక, పొరుగు రాష్ట్రాల్లోనూ నివసిస్తున్న తెలుగువారి శ్రేయస్సుకు, తెలుగు భాషోద్యమ నిర్మాణానికి కృషి జరిగింది. దక్షిణ భారతదేశమంతటా చిక్కగా అల్లుకొని, మొత్తం దేశంలోనేకాక, అనేక ఇతర దేశాల్లో కూడా భాషా సాంస్కృతిక మూలాలను విస్తరించుకొనివున్న తెలుగుజాతిలో చైతన్యాన్ని పెంపొందించి, వారిలో సంఘీభావాన్ని, భావసమైక్యతను బలపరచవలసిన అక్కరను గుర్తించిన కొందరు కార్యకర్తలు అందుకోసం పనిచేస్తున్నారు. అయితే, అనివార్య కారణాల వల్ల నడుస్తున్న చరిత్ర పత్రికను 2013 నవంబరు నుంచి నిలిపి వేయవలసి వచ్చింది. మళ్ళీ పత్రికను ప్రచురించడంతోపాటు తెలుగు నుడి, చరిత్ర, జాతి ముందడుగుకు అవసరమైన పుస్తకాల ప్రచురణను, ప్రచార కార్యక్రమాలను చేపట్టాలని తలపెట్టాము. ఇందుకోసం 'తెలుగుజాతి' పేరిట ఒక ట్రస్టును నమోదు చేయించాము. (92/ 2014). తెలుగు 'అమ్మనుడి"గా కలిగినవారు ఎక్కడ నివసిస్తున్నా, వారి శ్రేయస్సు కోసం ఈ సంస్థ పనిచేస్తుంది.

2015 మార్చి నుంచి **అమ్మనుడి** పత్రికను ప్రచురిస్తున్నాము. పుస్తకాల ప్రచురణ కార్యక్రమంలో భాగంగా తొలుత స.వెం.రమేశ్ వ్యాసాల సంకలనం **'ఎల్లలు లేని తెలుగు'**ను విడుదల చేశాము. త్వరలోనే మరికొన్ని ప్రత్యేకమైన పుస్తకాలను వెలువరించ బోతున్నాము. ఈ ట్రస్టును బలమైన పునాదులపై, తగినన్ని వనరులతో బలపరచటానికి మీ అందరి చేయూత కావాలి. ట్రస్టు నిర్మాణంలో తోడ్పడాలని విన్నవిస్తున్నాము.

**ట్రస్టుకు విరాళాలనిచ్చి తోడ్పడ గోరుతున్నాము.**

| | |
|---|---|
| రాజ పోషకులురు. 1,00,000/–లు | పోషకులు రు. 25,000/–లు |
| విశిష్ట పోషకులు రు. 50,000/–లు | ప్రోత్సాహకులు రు. 10,000/–లు |

**దాత ఫొటోను, క్లుప్తంగా పరిచయాన్ని 'అమ్మనుడి' పత్రికలో ప్రచురిస్తాము.**
**దాతలందరినీ శాశ్వత చందాదారులుగా పరిగణించి పత్రికను ప్రతినెలా పంపిస్తాము. ట్రస్టు ప్రచురించే పుస్తకాలను కూడా ఉచితంగా పంపిస్తాము.**

సొమ్మును చెక్ / డ్రాఫ్టుగా / ఆన్‌లైన్‌లో 'TELUGUJAATHI' పేర పంపాలి. యాక్సిస్ బ్యాంక్, సికిందరాబాదు.
అక్కౌంట్ నెం. 914020020387880 I.F.S.C.Code : UTIB0000068

**డా॥ సామల రమేష్‌బాబు,** మేనేజింగ్ ట్రస్టీ, 9848016136 ట్రస్టీలు : **పారుపల్లి కోదండరామయ్య** 9505298565, **డా॥వెన్నిసెట్టి సింగారావు** 9393015584, **స.వెం.రమేశ్** 8500548142, **సామల లక్ష్మణబాబు** 9440448244

# భాషోద్యమానికి పనికొచ్చే కతలు కావాలి

## అమ్మనుడిలో ప్రచురించే ప్రతి కతకు రు.500/-లు నగదు కానుక

ప్రభుత్వాల పట్టనితనం వల్ల, విధ్వంసకర విధానాల వల్ల తెలుగుజాతి క్రమక్రమంగా తమ ఉనికి గుర్తింపునే కోల్పోయే ప్రమాదం పొంచి వుంది. విద్యారంగంలో పరిపాలనలో ఈ భాషా విధ్వంసానికి, తద్వారా జాతి విధ్వంసానికి ప్రభుత్వాల చర్యలు దారి తీస్తున్నాయి. వీటిని కతల రూపంలో ప్రచారం చెయ్యాలి; ప్రశ్నించాలి. ప్రజల్లో ఈ అంశంపై చైతన్యం తేవాలి.

ఇంతేకాదు, భాషా రాష్ట్రాలు ఏర్పడినా, తెలుగు ప్రభుత్వాలు తెలుగును పట్టించుకోకపోవడమే గాక, తెలుగు వ్యతిరేక చర్యలకు పాల్పడడం వల్ల ప్రజల్లో భాషా స్వాభిమానం దెబ్బతింటున్నది. అమ్మనుడిని అన్నిరంగాల్లో వినియోగపరచనందువల్ల సహజంగానే ప్రజల చూపులో పరాధీనత చోటుచేసుకొంటూ, భావదాస్యంలోకి జారిపోతూ సొంతదనాన్ని కోల్పోతున్నారు. ప్రజాజీవన రంగంలో, సాంస్కృతిక రంగంలో ప్రచార ప్రసార మాధ్యమాల్లో ఈ పతనం కళ్ళకు కట్టినట్లు కన్పడుతున్నది. ఈ అంశాలను కతల్లో, చెప్పే తీరులో, పాత్రల రూపకల్పనలో చూపిస్తున్న కతల్ని ప్రచురిస్తాము. అవి చదువరులను చదివింపజేయాలి. ఆనందింపజేస్తూనే ఆలోచింపజేయాలి. అటువంటి కతల్ని రచయితల్నుంచి మేము కోరుతున్నాం. ఒక్క అదనపు సూచన : పాత్రల సంభాషణల్లో వీలైనంతవరకు పాత్రోచితభాషనే వాడండి. కథనంలో ఇతర భాషల మాటల్ని కాకుండా వీలైనంత వరకు జన తెలుగునే వాడండి. అక్కర వుంటేనే, తప్పక పోతేనే ఇతర భాషల మాటలకు చోటు!

ఎంపికైన ప్రతి కత రచయితకూ రు.500/-ల నగదు కానుకగా పంపుతాము.

**ప్రతి ఏటా ప్రచురించిన అన్ని కతల్లోనూ ఉత్తమమైన కథా రచయితకు ప్రత్యేక పురస్కారాన్ని ఉగాదికి ప్రకటిస్తాము.**

ఇంకా వివరాలకు 'అమ్మనుడి' సంపాదకుడు,
డా॥సామల రమేష్‌బాబు, 98480 16136కు ఫోన్ చేసి మాట్లాడండి.

చిరునామా : సంపాదకుడు, 'అమ్మనుడి' నెల పత్రిక, జి-2, వాయుపుత్ర రెసిడెన్సీ,
హిందీ కళాశాలవీధి, మాచవరం, విజయవాడ-520004.
e-mail : editorammanudi@gmail.com

# తెలుగువారిగా మీ ఉనికిని చాటుకొనేందుకు ఈ పాటింపులు తప్పనిసరి

**ఆహ్వాన పత్రికలు** : మీ ఇంట్లో జరిగే పెళ్ళిళ్ళకు, పుట్టినరోజు, షష్టిపూర్తి మొ॥ ఏ వేడుకకైనా పిలుపు (ఆహ్వానం)లను తెలుగులో ముద్రించండి. తెలుగువారు కానివారిని కూడా మీరు పిలుస్తున్నట్లయితే వారి కోసం ఆ ఆహ్వాన పత్రిక మీదే వేరొకవైపు గాని, విడిగా గాని ఆంగ్లంలో లేదా అవసరమైన మరో భాషలో కూడా ముద్రించండి కానీ తెలుగులో ప్రముఖంగా ఉండాలి.

మన ఉనికికి గుర్తులు మన భాష, మన సంస్కృతి మాత్రమే. వాటిని వదలిపెట్టిన తర్వాత మనకు గుర్తింపు, మర్యాద ఉండవు. ఇతర భాషలను, సంస్కృతులను గౌరవిస్తూనే మన ప్రత్యేకతను మనం కాపాడుకొందాం.

మీరెక్కడ నివసిస్తున్నా- తెలుగు ప్రాంతం కానిచోట నివసిస్తున్నా- ఈ సంప్రదాయాన్ని పాటించండి. కంప్యూటర్లలో 'యూనికోడ్'లో ప్రపంచమంతటా తెలుగు అక్షరాలు అందుబాటులో ఉన్నప్పుడు మనకెందుకు చింత!

**విజిటింగ్ కార్డులు..అవి మన గుర్తింపు చీటీలు**

మనం గుర్తింపు చీటీలను -విజిటింగ్ కార్డులను- వేయించుకోవడం ఈ రోజుల్లో పరిపాటి అయింది. ఉద్యోగరీత్యా, వ్యాపార రీత్యా గాని అవి అవసరమవుతాయి. అటువంటి అవసరాలు లేకపోయినా, మన చిరునామా, ఫోన్, ఇ-మెయిల్ వివరాలను తెలుపడానికి గాని- అన్నిటికీ ఈ గుర్తింపు చీటీలు/విజిటింగ్ కార్డులు ఇప్పుడు మన జీవితంలో ఎంతో అక్కరపడుతున్నాయి. వాటిని ఇంగ్లీష్‌లోనే వేయించాలనే 'రూల్' ఏమీ లేదు. తెలుగులో వాటిని ఇవ్వడం మనకు ఆత్మగౌరవం. అవసరమైతే తెలుగు అక్షరాల క్రిందే ఇంగ్లీషులో కూడా ఇద్దాం..లేదా కార్డుకు మరోవైపున ఇద్దాం. ఏమంటారు?

సంపుటి : 2 సంచిక : 5
అమ్మనుడి
జులై 2016

సంపాదకీయం

# పాఠశాల విద్యారంగం నుంచి ప్రభుత్వాన్ని పూర్తిగా తప్పించే ఎత్తుగడలు?!

**జా**తీయ విద్యావిధానంపై కేంద్ర ప్రభుత్వం నియమించిన టి.ఎస్.ఆర్.సుబ్రమణియన్ కమిటీ కేంద్ర మానవ వనరులశాఖకు ఇచ్చిన నివేదికలోని ముఖ్యాంశాలు జూన్ 19న దినపత్రికల్లో వచ్చాయి. కేంద్రం, రాష్ట్రాలూ ఇంతకుముందు వేసిన నిపుణుల కమిటీల నివేదికలు పూర్తిగా అమలైన చరిత్ర మనకు లేదు. మొత్తం విద్యావ్యవస్థ లోటుపాట్లను సమీక్షించిన ఈ కమిటీ స్థూలంగానైనా సరైన చూపుతోనే పని చేసినట్టు ఇప్పటికి బయటకు వచ్చిన వివరాలను బట్టి తెలుస్తున్నది. అయితే మొత్తం విద్యకు పునాది అయిన పాఠశాల విద్య నిర్వహణకు సంబంధించిన కీలక అంశాల్లోకీ మాతృభాషల రక్షణకు, బలోపేతానికి సంబంధించిన ముఖ్యమైన అంశాల్లోకీ పోకుండా పొడి మాటలతోనే సరిపుచ్చినట్లు పత్రికల్లో వచ్చిన వివరాలను బట్టి తెలుస్తున్నది. రాజ్యాంగంలో కేంద్రం, రాష్ట్రాలు రెండింటికీ చెందిన ఉమ్మడి జాబితాలో 'విద్య' ఉన్నందునా, ఈ కేంద్రకమిటీకి నిర్దేశించిన అంశాలలో బహుశా ఈ రెండు కీలకమైన అంశాలు లేనందునా–వీటిపై సుబ్రమణియన్ కమిటీ మౌనం వహించిందేమో.

అయితే, ఈ కమిటీ ఇందుకు సంబంధించి చేసిన వ్యాఖ్యల్ని, సూచనల్ని మనం గమనించాలి. విద్యాబోధనను విద్యార్థుల అమ్మనుడిలో చేయడమే అత్యుత్తమమని నిర్మొహమాటంగా చెప్పింది. ఇప్పుడు విద్యాబోధననంతా రాష్ట్ర ప్రభుత్వాలు ఆంగ్లీకరిస్తున్న దశలో–అందుకు పూర్తి భిన్నంగా వున్న ఈ సిఫారసును ఎవరు పట్టించుకుంటారు? ఎలా అమలులోకి తెస్తారు? ఇదీ అసలు సంగతి.

'కాలేజీలు బోధన దుకాణాలు కాదు. అలాంటి కాలేజీలు విద్యావ్యవస్థను భ్రష్టుపట్టిస్తున్నాయి. వాటిని తక్షణం నిలువరించే చర్యల్ని చేపట్టాలి.' 'నిర్లక్ష్యపూరితమైన, అవినీతిమయమైన నియంత్రణా వ్యవస్థల కారణంగా విద్యానాణ్యత లేని ప్రయివేటు కాలేజీలు, యూనివర్శిటీలు పుట్టుకొస్తున్నాయి. విద్య పట్ల ఆసక్తిలేని, అర్థబలం, అధికారబలం ఉన్నవాళ్ళే వీటిని ఏర్పాటు చేస్తున్నారు. వాస్తవాలను అర్థం చేసుకొని, ఈ తరహా చర్యల్ని అడ్డుకోవాలి' అని కమిటీ వ్యాఖ్యానించింది. ప్రయివేటు విద్యారంగ వ్యాపారం పైనా, ఆ విద్యావ్యాపారస్తులకు పాలకవర్గాలపై వున్న పట్టుపైనా ఇంతకంటే వేరే ఏం వ్యాఖ్య కావాలి? ఇందుకు సాక్షాత్తు మన తెలుగురాష్ట్రాలే మచ్చుతునకలు. విద్యావ్యాపారంలో పేరుగాంచిన పెద్దలే మంత్రులుగా చట్టసభల సభ్యులుగా వెలిగిపోతున్నారు. వీళ్ళే రాష్ట్రప్రభుత్వాల విధానాన్ని నిర్దేశిస్తున్నారు.

కాలేజీల, యూనివర్శిటీల నిర్వహణపై కమిటీ ఆ వ్యాఖ్యానాలను చేసింది గానీ, అంతకంటే నీచంగా తయారయింది ప్రయివేటు రంగంలోని పాఠశాల విద్యావ్యవస్థ. ప్రాథమిక స్థాయినుంచే సాగుతున్న ఆర్థికదోపిడీపై ఇటీవల తల్లిదండ్రుల సంఘాల నిరసన ప్రదర్శనలే ఇందుకు అద్దం పడుతున్నాయి. ఇదంతా చూస్తుంటే – కనీసం పాఠశాలవిద్యను ప్రభుత్వాలు ఒక బాధ్యతగా తీసుకోనందున, విద్యావ్యాపారస్తుల రాజకీయ ఆర్థిక దోపిడీకి తలుపులు తీసినట్లయింది.

కళాశాల చదువులకు, వృత్తి విద్యలకు అన్నిటికీ పునాది– పాఠశాల విద్య. అందులో వున్న మూడు దశలూ– 5వ తరగతి వరకు ప్రాథమిక దశ, 6 నుండి 10 వరకు రెండవ దశ, ఇంటర్మీడియట్ దశ– ఇదంతా మూడంచెల పునాది విద్య. కనీసం దీన్ని పిల్లలందరికీ అందించటం ప్రభుత్వాల బాధ్యత. అందువల్ల ఈ పన్నెండేళ్ల చదువును ఉచితంగా అందరికీ అందించటానికి ప్రభుత్వాలు ముందుకు రావాలి. ఈ దశలో విద్యార్థుల్లో పేదవర్గాలకు, వెనుకబడిన వర్గాలకు కావలసిన మానవీయ అవసరాలను కూడా ప్రభుత్వాలు తీర్చాలి. అయినదానికి, కానిదానికి

అమెరికా వంక చూసే మన ప్రభుత్వ నేతలకు ఇలాంటి పద్ధతి ఆ దేశంలో వుందని తెలియదా? అక్కడ పాఠశాల విద్య ఉచితం, తప్పనిసరి. పౌరులుగా ఎదగటానికి ఈ మాత్రం విద్య అందరికీ అందాలి. అమెరికాను చూసి అయినా మన ప్రభుత్వాలు బుద్ధి తెచ్చుకుంటాయని అనుకోవడం అత్యాశే అవుతుంది. ఎందుకంటే – ప్రభుత్వాల్లో ప్రత్యక్షంగా, పరోక్షంగా పెత్తనం చేస్తున్న ఈ విద్యావ్యాపార శక్తులకు కావలసింది – ప్రభుత్వాన్ని విఫలం చేసి పూర్తిగా పాఠశాల రంగాన్ని తమ అధీనంలోకి తెచ్చుకోవడమే.

ఉన్నట్లుండి ఆంగ్ల మాధ్యమాన్ని ప్రాథమిక స్థాయినుండి ప్రవేశపెట్టడంతో పాటు విద్యార్థుల సంఖ్యకు ముడిపెట్టి పాఠశాలల క్రమబద్ధీకరణ పేరున మొత్తం నిర్వహణను నిర్వీర్యం చేయడం, మెల్లగా వాటిని వాటి ఆస్తుల్ని ప్రయివేటుపరం చేయడం– ఇదీ కనిపించకుండా సాగుతున్న కుట్ర. ఉన్నత విద్యావ్యవస్థలో అత్యధిక భాగం ఇప్పటికే విద్యావ్యాపారుల చేతుల్లోకి వెళ్ళిపోయింది. ఆ రంగం నుంచి ప్రభుత్వం ఇప్పటికే చాలామటుకు తప్పుకుంది. పైగా, ప్రోత్సాహకాల పేరిట పరోక్షంగా ఆ చేతులను ఇంకా బలపరుస్తున్నది. ఎంతో కొంత ఇంకా ఉత్తమ ఫలితాలతో నడుస్తున్న ప్రభుత్వపాఠశాల వ్యవస్థను కుళ్ళబొడవడమే ఇప్పుడు ప్రభుత్వాల, విద్యావ్యాపారస్తుల అప్రకటిత ఒప్పందమని తెలుస్తున్నది. కంపుకొడుతున్న ఈ విద్యారంగం ప్రజల్లో భవిష్యత్తుపట్ల భయాన్ని కలిగిస్తున్నది. అభ్యుదయ ఆలోచనలతో వున్నవారు ఆందోళన పడుతున్నారు. పాఠశాల విద్యారంగం నుండి ప్రభుత్వాన్ని పూర్తిగా తప్పించాలన్న ఎత్తుగడలు ఫలించకముందే విద్యార్థి, ఉపాధ్యాయ సంఘాలతోపాటు తల్లిదండ్రులు కూడా సంఘాలుగా ఏర్పడి పోరాటం చేయాలి.

ప్రవేశ పరీక్షల తమాషాను కూడా సుబ్రమణియన్ కమిటీ తీవ్రంగా విమర్శించింది. ప్రత్యామ్నాయాన్ని కూడా సూచించింది. మార్కుల శాతాన్ని కృత్రిమంగా పెంచేందుకు జరుగుతున్న అడ్డగోలు వ్యవహారాలపైన, అక్కరలేని వత్తిడిని పెంచుతున్న పాఠ్యాంశాలపైనా పరీక్షలకోసమే చేస్తున్న బట్టీ చదువులపైనా కమిటీ దృష్టి సారించింది. పాఠశాల చదువులతోనే ఆగిపోతున్న పేద, వెనుకబడిన వర్గాల పిల్లలే కార్పొరేటు వ్యవస్థకు కావలసిన సేవకులు. పైచదువుల్లోకి ఎదిగి, స్వదేశంలోనూ, విదేశాల్లోనూ ఉద్యోగులుగా తమ కంపెనీల్లో పనిచేసేవారు కూడా వారికి కావాలి. వాళ్ళకు సరిపోయేట్టు కోర్సులను, సిలబస్‌ను వారు నిర్దేశిస్తున్నారు. అంతేగాని, మేధోశక్తిని పెంచుకొని శాస్త్ర సాంకేతిక రంగాలతోపాటు అన్ని ప్రజాజీవన వ్యవస్థల్నీ ప్రభావితం చేయగల పరిశోధనలను చేయగలవారు, నాయకత్వాన్ని అందించగలవారు మన వ్యవస్థలో తయారు కాకూడదనేదే వారి లక్ష్యం. మేధోపరంగా, ఆర్థికంగా అన్నివిధాలా విదేశీయ, దేశీయ వ్యాపారవర్గాలకూ వారి కనుసన్నలలో మెలిగే పాలకవర్గాలకు కావలసింది ఇదే. ఇదంతా కుట్ర కాక మరేమిటి?

పాఠశాల విద్యాబోధనను మాతృభాషలో – కనీసం దశల వారీగా అమలు చేయడం తక్షణం విద్యావిధానంలో తేవలసిన మార్పు. ఇందుకు ప్రభుత్వాలను లొంగదీసే బాధ్యత, ప్రజలను చైతన్యవంతం చేసే బాధ్యతా మేధావి వర్గాలమీదే వుంది. ఇంగ్లీషును గాని, మరే ఇతర భాషను గాని నేర్చుకోవడానికి మాతృభాషే కీలకమని అన్ని నైపుణ్యాల సాధనకు అదే మూలమని గ్రహించకుండా, తెలియని భాషలో విజ్ఞానాన్ని సంపాదించాలని చెప్పడమంత అవివేకం, హింస మరొకటుండదు. తరగతులవారీగా ఇంగ్లీషుతోపాటు అవసరమైన మరి ఒకటి రెండు భాషల్ని నేర్చుకోవడానికి విద్యార్థులను సిద్ధం చేయాలి. ఇందుకు మాతృభాషే సాధనం.

ఈ ప్రాతిపదికన 1 నుండి 12 తరగతుల వరకు పాఠశాల విద్యను పిల్లలకు ఉచితంగా అందించడానికి ప్రభుత్వాలు పూచీపడాలి. పాఠశాల విద్యారంగాన్ని ఇంటర్మీడియట్‌తో సహా కేవలం ప్రభుత్వమే నిర్వహించాలి. విద్యావ్యాపారస్తులకు ఈ రంగాన్ని నిషిద్ధం చేయాలి. ఈ నిర్ణయాన్ని తీసుకున్న వెంటనే దాన్ని అమలు పరచడానికి అట్టే సమయం పట్టదు. కావలసిన బడ్జెట్టును సమకూర్చుకోవడం సమస్యే కాదు. అవసరమైతే ఉన్నత విద్యారంగానికి పెడుతున్న ఖర్చును కొంత ఇందుకు తరలించాలి. పాఠశాల విద్యారంగం నుండి ప్రభుత్వాన్ని పూర్తిగా తప్పించేందుకు విద్యావ్యాపారులు వేస్తున్న ఎత్తుగడలను విఫలం చేయాలి. మొత్తం పాఠశాల విద్యావ్యవస్థను రక్షించుకోవాలి. ఈ డిమాండుతో జాతీయ, ప్రాంతీయ నేతలపై తీవ్రమైన ఒత్తిడి తెచ్చేందుకు అందరూ ఉద్యమించాలి. అన్ని ఇతర ఉద్యమాలకంటే ఇప్పుడు మన సమాజానికి ఇది అత్యవసరం.

**1-7-2016**

సామల రమేష్‌బాబు

# ద్రావిడ భాషాశాస్త్రంపై అంతర్జాతీయ సదస్సు-2016 ద్రావిడ భాషాశాస్త్ర సంఘ జాతీయ సమావేశం




*ప్రారంభోత్సవ సభలో ఆచార్యులు రంగన్, మహంతి, బాలకృష్ణన్ ఐఏఎస్, ఉపకులపతి ఆచార్య పొదిలె అప్పారావు*

**జూ**న్ 16 నుంచి 18 వరకు మూడు రోజులపాటు 'ద్రావిడ భాషలపై అంతర్జాతీయ సదస్సు, 'ద్రావిడ భాషాశాస్త్రవేత్తల 44వ జాతీయ సదస్సు' హైదరాబాద్ విశ్వవిద్యాలయంలో జరిగాయి. భారతీయ భాషాకేంద్రీయ సంస్థ, మైసూరు, ఇంకా అంతర్జాతీయ ద్రావిడ భాషాశాస్త్ర అధ్యయన కేంద్రం తిరువనంతపురం, కేంద్ర సాహిత్య అకాడెమీ, కొత్త ఢిల్లీ, భారతీయ సాంస్కృతిక సంబంధాల పరిషత్తు, కొత్త ఢిల్లీ, హైదరాబాదు విశ్వవిద్యాలయానికి చెందిన అనువర్తిత భాషాశాస్త్ర అనువాద అధ్యయనాల కేంద్రం (కాల్ట్స్) వారి సంయుక్త నిర్వహణలో జరిగింది. మూడు రోజులపాటు నిరంతరంగా సాగిన ఈ సదస్సులో దేశ విదేశాలకు చెందిన అనేకమంది భాషా శాస్త్రవేత్తలూ, పరిశోధకులూ, విద్యార్థులూ ఉత్సాహంగా పాల్గొని అనేక అంశాలపై పత్ర సమర్పణ చేశారు. ఈ సదస్సులో భాషా శాస్త్రానికి సంబంధించిన అనేక రంగాలైన వ్యాకరణం, పదనిర్మాణం, సామాజిక భాషాశాస్త్రం, చారిత్రక భాషాశాస్త్రం, పురాతత్వ భాషాశాస్త్రం, బౌద్ధిక భాషాశాస్త్రం, సంగణక భాషాశాస్త్రం మొదలైన ఎన్నో రంగాలలో పరిశోధనా పత్రాలు సమర్పించడం జరిగింది. ప్రముఖ భాషాశాస్త్రవేత్తలైన ఆచార్యులు బి.రామకృష్ణారెడ్డి (పూర్వ రిజిస్ట్రార్, ద్రా.వి.వి.,) కే.వి.సుబ్బారావు (పూర్వ అధ్యక్షులు, భాషాశాస్త్ర విభాగం, ఢిల్లీ వి.వి.), పంచానన్ మహంతీ, (డీన్, మానవీయ శాస్త్ర అధ్యయన సంస్థ, హై.వి.వి.), కే. రంగన్ (పూర్వ అధ్యక్షులు, భాషాశాస్త్ర విభాగం, తమిళ వి.వి.తంజావూరు), ఎల్. రామమూర్తి (సంచాలకులు, భారతీయ భాషాదత్తాంశ సంఘం), ఆర్. బాలక్రిష్ణన్ (ఐఏఎస్, ఒడిస్సా ప్రభుత్వ అదనపు ప్రధాన కార్యదర్శి), గారపాటి ఉమామహేశ్వరరావు (సదస్సు నిర్వాహకులు, అధ్యక్షులు, అనువర్తిత భాషాశాస్త్ర అనువాద అధ్యయనాల కేంద్రం (కాల్ట్స్, హై.వి.వి.), డా॥సామల రమేష్‌బాబు (సంపాదకులు, అమ్మనుడి), డా॥కస్తూరి విశ్వనాథం, పూర్వ ఉపనిర్దేశకులు, కేం.భా.భా.సం), ఆచార్య సోనాల్ కుల్కర్ణి (పూణే వి.వి.) మొదలైన ప్రముఖులు ఈ సదస్సుల్లో పాల్గొని ప్రధాన ప్రసంగాలు చేశారు. ప్రసిద్ధ పురాతత్వశాస్త్రవేత్త ఐరావతం మహాదేవన్ (ఐఏఎస్), స్వయంగా రాలేక తన ప్రసంగాన్ని ప్రతినిధి ద్వారా పంపించారు. సదస్సు ప్రారంభ సమావేశానికి డా॥రాజ్యరమ (సహ ఆచార్యులు), అతిథులందరినీ ఉద్దేశిస్తూ ఆహ్వాన ప్రసంగం చేశారు. ఆచార్య పంచానన్ మహంతీ సభాధ్యక్షత వహించారు. భాషావేత్త కీ.శే.భద్రిరాజు కృష్ణమూర్తి గారికి శ్రద్ధాంజలితో కార్యక్రమం మొదలైంది. ఆచార్య పొదిలె అప్పారావు (ఉపకులపతి, హై.వి.వి.) ముఖ్య అతిథిగా వచ్చి భాష-వికాసంలో జన్యువుల పాత్రపై ప్రసంగించారు.

సదస్సు సమన్వయకర్త ఆచార్య గారపాటి ఉమామహేశ్వరరావు ద్రావిడ భాషాశాస్త్రం అంతర్జాతీయ సదస్సు-2016 ముఖ్యోద్దేశ్యాన్ని వివరించారు. 1816లో మొదలైన ద్రావిడ భాషలపై పరిశోధన ఈ యేదు అంటే 2016 నాటికి 200 ఏండ్లు పూర్తి చేసుకున్న సందర్భాన్ని పురస్కరించుకొని ఈ సదస్సును నిర్వహిస్తున్నాం అని ఆయన తెలిపారు. ఈ ఆవిష్కరణ భాషాశాస్త్ర పరంగానే గాక, మానవ సముదాయాల వికాసం, మనుగడ, స్థాన ప్రస్థానాలూ, నాగరికతా వికాసం ఇట్లా ఎన్నింటిలోనో కొత్త మార్పులకు దారితీసి భారత ఉపఖండంలో సామాజిక-సాంస్కృతిక పునరుజ్జీవనానికి నాంది పలికింది. భారతదేశ రాజకీయ సామాజిక, సాంస్కృతిక రంగాలపై కనీ వినీ ఎరుగనంతటి ప్రభావాన్ని చూపింది అని ఆయన అన్నారు. డా॥అరుల్ మోళీ వందన సమర్పణతో ప్రారంభ సమావేశం ముగిసింది. ఆర్.బాలకృష్ణన్ ఐఏఎస్ తమ ప్రత్యేక ఉపన్యాసంలో సింధు నాగరికత కాలంనాటి వాస్తు చిత్రణలో దిగ్వాచకాలనూ ఊరి పేర్లకూ ద్రావిడ భాషల్లో లభించే ఊరి పేర్లకీ సారూప్యతని వివరించారు. ఆచార్య వెన్నెలకంటి ప్రకాశం- ఐ.వి.సుబ్రమణియం స్మారకోపన్యాసాన్ని చేశారు. రెండవ రోజు ఆచార్య సోనాల్ కుల్కర్ణిగారు మరాఠీ భాషపై ద్రావిడ భాషా ప్రభావాన్ని సమగ్రంగా చర్చించారు.

సదస్సు మూడు రోజులూ జరిగిన సమావేశాల్లో అన్ని ద్రావిడ భాషల్లోనూ పత్ర సమర్పణ జరిగింది. ఆచార్య గారపాటి ఉమా మహేశ్వరరావు ద్రావిడ మంగోలు భాషల జన్య సంబంధాన్ని సాధికారిక ఆధారాలతో నిరూపించే ప్రయత్నం చేశారు. దీనితో ద్రావిడ భాషలకూ వాటి వ్యవహర్తలకు అనువంశిక బాంధవ్యం ఉందనీ ఇది భవిష్యత్తులో అనేక రంగాలపై ప్రత్యేకంగా ప్రాక్చారిత్రక నాగరికతలూ, మానవ సముదాయాల ప్రస్థానాలపై ఇప్పటివరకూ చేసిన సిద్ధాంతాలపై ప్రభావం చూపుతుందన్నారు. ఆచార్య బి.రామకృష్ణా రెడ్డి మధ్యభారతదేశంలోని ఆపన్న భాషలపై విపులమైన చర్చ చేస్తూ

# ద్రావిడ భాషాకుటుంబం, ద్రావిడ భాషలు, ద్రావిడులు

ఆధునిక యుగంలో ద్రావిడ పదాన్ని విననివారు ఉండరు. దీనికి ఇంత ప్రాముఖ్యత రావడానికి కారణాలలో ఒకటి నాటి మదరాసు రాష్ట్రంలో నడిచిన ద్రావిడ ఉద్యమాలు, వాటి వలన కలిగిన సాంస్కృతిక రాజకీయ పరిణామాలు. రెండవది ద్రావిడ భాషలే...భారత ఉపఖండంలో అంటే ముఖ్యంగా దక్షిణ భారతదేశంలోనూ (తెలుగు, కన్నడం, తమిళం, మలయాళం మొదలైనవీ), మధ్యభారతదేశంలోనూ (గోండీ, కొండ, కువి, మొదలైనవీ), తూర్పు భారతంలోనూ (కోలామీ, పర్జీ, గదబ మొదలైనవీ), ఈశాన్య భారతం, నేపాలులో (కురుఖ్, మాల్తో), శ్రీలంక (తమిళం, తెలుగు), పాకిస్తానులోని బేలూచిస్తాను ప్రాంతంలోనూ మాట్లాడే బ్రాహుయి మొదలైనవాటిని ద్రావిడభాషలు అంటారు. షుమారు 25 భాషలకు పైగా ఉన్న ఈ భాషాకుటుంబం ద్రావిడ భాషాకుటుంబంగా ప్రసిద్ధి చెందింది. ఇక ద్రావిడులు అనే పదాన్ని కొంతవరకూ తమిళులకు ప్రత్యేకంగానూ, ద్రావిడ భాషలు మాట్లాడే దక్షిణ భారతీయులందరికీ సాధారణంగా వాడే ప్రయోగమే.

'ద్రావిడ' శబ్దం ఆధునిక ప్రయోగంలో రెండువందల ఏండ్లు గడిచిన సందర్భాన్ని గుర్తు చేసుకొనే సమయం ఇది. ఎన్నో జాతులూ, తెగలూ, కులాలూ, వర్ణాలూ, మతాలూ, భాషలూ, సంస్కృతులూ అన్నీ కలిసి పెనవేసుకొనగా ఏర్పడినదే మన సమాజం. ఐతే ప్రతి సముదాయమూ తన వ్యక్తిత్వాన్నీ ప్రత్యేకతనూ నిలుపుకుంటూనే ఏకత్వంలో భిన్నత్వం అనే మన సాంప్రదాయానికి నిలువెత్తు నిదర్శనాలుగా నిలిచాయి. మన భాషలు వేల ఏండ్లుగా బతికి బట్టకడుతున్నాయంటే ఈ సాంప్రదాయ వరవడే కారణం. ఆధునిక భాషాశాస్త్రం అభివృద్ధి చెందేంతవరకూ మన దేశంలోని భాషలన్నీ సంస్కృత జన్యాలనే అనుకొనేవారు. ఆంధ్రభాషాభూషణ కర్త అయిన మూలఘటిక కేతన పేర్కొన్న "తల్లి సంస్కృతంబె ఎల్ల భాషలకును" అనే నానుడే రూఢి అయింది. సరిగ్గా 230 ఏండ్ల కిందట అంటే 1786లో కోల్కతాలో విలియం జోన్స్ అనే బ్రిటీషు న్యాయమూర్తి ఓ గొప్ప ఆవిష్కరణకు తెరదీశాడు. అదేమంటే, సంస్కృతం, అవెస్తా (ప్రాచీన పారశీకం) గ్రీకు, లాటిను గోథిక్ (ప్రా.జర్మన్), కెల్టిక్ (ఐరిష్, వెల్ష్ మొదలైనవాటి (ప్రా.భాష) మొదలైనవన్నీ ఒకే మాతృక నుండి పుట్టివుంటాయని కొన్ని ఆధారాలు చూపించాడు. తర్వాత దానికే ప్రాచీన-ఇండో-యూరోపియన్‌గా పేరు వచ్చింది. ఆ తరువాత వచ్చిన పరిశోధనలు వివిధ ప్రాకృతాలనూ వాటి నుండి పుట్టిన అపభ్రంశాలనూ మళ్ళీ వీటి నుండి పుట్టిన నేటి హిందీ, మరాఠీ, పంజాబీ, బాంగ్లా, ఒడియా మొదలైనవన్నీ సంస్కృత జన్యాలనీ నిరూపించారు. ఇవన్నీ సంస్కృతానికి పుట్టిన కొమ్మలూ రెమ్మలూ. ఇప్పటికి 200 ఏండ్ల కిందట, 1816లో ఫ్రాన్సిస్ ఎలిస్ వైట్ అనే ఆంగ్లేయ అధికారి మచిలీపట్నంలో తెలుగు నేర్చుకొని ఆ పైన తమిళం, కన్నడం, మలయాళంలో ప్రావీణ్యాన్ని సంపాదించాడు. ఈయన ఈ భాషల విలక్షణతను పరిశీలించి వీటికీ సంస్కృతానికీ ఎలాంటి సంబంధం లేదనీ, ఇవన్నీ సంస్కృత జన్యం కాదనీ నిరూపించాడు. ఆ తరువాత 1856లో కాల్డ్వెల్ రచించిన "ద్రావిడ భాషల తులనాత్మక వ్యాకరణం" దక్షిణాది భాషలూ లేక ద్రావిడ భాషలు అని పేర్కొంది. ఇక ద్రావిడ పేర్లు, సాధారణంగా తమిళానికి, తమిళనాడుకూ వాడే పేర్లే అయినా, దక్షిణ భారతదేశ వాసులందరికీ వాడిన సందర్భాలు ఉన్నాయి. ఉదాహరణకు కల్హణుని రాజతరంగిణిలో పంచద్రావిడులను పేర్కొంటూ, వీరు గుజరాతు, మహారాష్ట్రం, తెలుగు, కర్నాట, తమిళ, మలయాళ దేశాలలో నివసించేవారుగా చెబుతాడు. ఐతే 6వ శతాబ్దానికి చెందిన కుమారిల భట్టు ద్రావిడ పదాలు అని పేర్కొన్నవి తమిళ పదాలే. అంటే ప్రాచీన కాలం నుండి ద్రావిడ పదం తమిళానికి పర్యాయపదంగా వాడుకలో ఉండేది. పన్నెండో శతాబ్దానికి విస్తృతార్థాన్ని సంతరించుకుంది అనుకోవచ్చు. భద్రిరాజు కృష్ణమూర్తి గారు ద్రావిడ పద వ్యుత్పత్తిని గురించి చెబుతూ ద్రావిడ, ద్రవిడ, దమిళ, దమిద, దవిడ పదాలు మొట్టమొదట పాళీ భాషలోనూ, ప్రాకృతాలలోనూ వాడినట్లు ఆధారాలు చూపిస్తారు. కామిల్ జ్వెలెబిల్ అనే ప్రముఖ ద్రావిడ భాషాశాస్త్రజ్ఞుడు ద్రావిడ పదం సంస్కృతీకరించిన తమిఴ (ఆధునికభాషలో తమిళ) శబ్దమని అంటారు. తమిఴ శబ్దం తెలుగువారి నోళ్ళలోబడి కొన్ని మార్పులు చెంది ఆ పైన సంస్కృతీకరించబడింది అని చెప్పాలి. తమిళులకు పొరుగున ఉన్న తెలుగువారికి తమిఴ పద ఉచ్చారణలో మార్పులు 6-7 శతాబ్దాలలో వచ్చిన వర్ణ పరిణామాలకు అనుగుణంగా సాగినవే. తెలుగుభాషలో పదాది పరుషాలు (క,చ,ట,త,ప,లు) సరళాలుగా (గ,జ,డ,ద,బ,లు) మారడం జరిగింది. తరువాత అచ్చులమధ్య 'మ' 'వ'గా మారడం (ఉదా : చమురు = సవురు, చలిమిడి (చలిమిడి=చలిపిండి), అచ్చుల మధ్య 'ఴ' 'డ'గా మారడం జరిగింది. ఈ మార్పులు 'తమిఴ' శబ్దాన్ని 'దవిడ'గా మార్చాయి. ఆ తర్వాత సంస్కృతీకరించబడి ద్రవిడ శబ్దంగా అవతరించింది.

**-గారపాటి ఉమామహేశ్వరరావు**

ఆధునిక యుగంలో అంతరించనున్న అల్పసంఖ్యాక భాషల పరిరక్షణపై ఉపన్యసించారు.

ఇక తెలుగు విషయానికొస్తే సదస్సులో మొత్తం 20 పత్రాలలో తెలుగుపై ప్రత్యక్ష చర్చలు జరిగాయి. అనేక ఇతర పత్రాలలో తెలుగుని పరోక్షంగా ప్రస్తావించారు.

మూడవరోజు ముగింపు సమావేశంలో భాగంగా 'మాతృభాషలో విద్యాబోధన' అనే విషయంపై ఆచార్య ఎం.ఎస్.హయత్ అధ్యక్షతన గోష్ఠి నిర్వహించారు. గోష్ఠిలో ఆచార్యులు గారపాటి ఉమామహేశ్వర రావు, బి.రామకృష్ణారెడ్డిగారు, మహంతీ, జీ.కే పణిక్కర్, డా|| ఖైరే, డా|| వారిజా, తెలుగు భాషోద్యమ సమాఖ్య అధ్యక్షులు డా||సామల రమేష్‌బాబు పాల్గొన్నారు. వక్తలు తమిళ, తెలుగు, కన్నడ, పంజాబీ, మలయాళ, తుళు భాషలలో విద్యాబోధనపై తమ రాష్ట్రాలలో ఉన్న ప్రస్తుత పరిస్థితులను సమీక్షించారు. వీరంతా విద్యారంగంపై ఇంగ్లీషు భాషా ప్రభావం, ప్రస్తుతం నెలకొన్న అభద్రత మొదలైన అంశాలపై చర్చించారు. డా||సామల రమేష్‌బాబు మాట్లాడుతూ తెలుగు మాధ్య మంలో విద్యాబోధన, పరిపాలనా రంగంలో ముందుకు తేవడంలో తెలుగు భాషోద్యమ సమాఖ్య చేస్తున్న కృషిని, ప్రభుత్వంపై తేవలసిన ఒత్తిడినీ తెలియ చేశారు. తెలుగుభాషా వినియోగం వివిధ రంగాలలో అంతరించిపోకుండా కాపాడుకోవడానికి ప్రభుత్వం తమ భాషావిధా నాన్ని ప్రకటించడం, ప్రణాళికలు రూపొందించడం తక్షణ కర్తవ్యమని వివరించారు. ఆచార్య ఉమామహేశ్వరరావు మాట్లాడుతూ కేజీ టూ పీజీ ఇంగ్లీషు మాధ్యమ విద్యవల్ల రాబోయే అనర్థాలూ, చిన్నవయ




ముగింపు సభలో (ఎడమనుండి) శ్రీయుతులు గారపాటి ఉమామహేశ్వరరావు, ఖైరాసింగ్, సామల రమేష్‌బాబు, ఆఎం.యస్.హయాత్, కె.ఎం.పణిక్కర్, రామనాథన్, శ్రీమతి వారిజ.



ఈ సభల నిర్వహణలో పాలుపంచుకున్న పెద్దలు, సహచరులు

సులో తెలుగు సాహిత్యం చదవని పిల్లల మానసిక అపరిపక్వత, మానవీయ విలువలపట్ల వారి చిన్నచూపూ, పెరుగుతున్న సహన హననం, సమాజం కోల్పోతున్న ఓర్పు హింసకు ప్రేరేపణలు అన్నారు. తెలుగు భాషా సంరక్షణా భాధ్యతను ప్రతి ఒక్కరూ చేపట్టాలన్నారు. మనకున్న అరకొర వనరులతో ఇంగ్లీషు మాధ్యమం సామాజిక అశాంతికి కారణమవుతుందని అభిప్రాయ పడ్డారు. ఉన్నత విద్యలకోసం విదేశాలకు తరలిపోయే మన వలస విధానంతో ఏడాదికి లక్షకోట్ల రూపాయల భారతీయ నిధులు ఆవిరైపోతున్నాయనీ ఈ నిధుల వినియోగంతో మనదేశంలోనే వేల ఉద్యోగాలను సృష్టించవచ్చనీ సూచించారు. దానికి తగిన వనరులనూ సంపదనూ సృష్టించుకొనే శక్తి మాతృభాషా మాధ్యమం ద్వారానే సమకూరుతుందనీ స్పష్టం చేశారు. మాతృభాషా పునరుద్ధరణని ఒక ఉద్యమంగా చేపట్టాలని పిలుపునిచ్చారు. గోష్ఠిలో పాల్గొన్న వక్తలందరూ వారి అభిప్రాయంతో ఏకీభవించారు. ప్రాథమిక విద్య, ఉన్నత విద్య కూడా మాతృభాషా మాధ్యమంలోనే సాధ్యమయ్యేలా కృషి జరగాలని అభిప్రాయపడ్డారు. దీనికై మేధావులూ, విద్యావేత్తలూ యువతా ప్రతి ఒక్కరూ నడుం బిగించాలనే దృఢసంకల్పానికి నాంది పలకాలన్నారు. చివరకు డా॥ కృ.పరమేశ్వరి వందన సమర్పణతో సదస్సు ముగిసింది.

**–డా కె.రాజ్యరమ,** 9849490086
సహ ఆచార్యులు, అనువర్తిత భాషాశాస్త్ర అనువాద అధ్యయనాల కేంద్రం (కాల్ట్స్), హైదరాబాదు విశ్వవిద్యాలయం

–ఎ.కె.ప్రభాకర్
040-27761510

# ఊరూ వాడా ఏకం చేసిన ప్రజాకవి



**గూడ అంజయ్య**
(నవంబర్1,1954–జూన్ 21, 2016)

**'సుకవి జీవించె(చు) ప్రజల నాలుకలయందు'**

అన్న మహాకవి జాషువా వాక్యం ప్రజా వాగ్గేయ కారుడు గూడ అంజయ్య విషయంలో అక్షరాలా నిజం.

'ఊరు మనదిరా –ఈ వాడ మనదిరా
పల్లె మనదిరా – ప్రతి పనికి మనమురా
సుత్తె మనది –కత్తి మనది
పలుగు మనది –పార మనది
బండీమనదిరా – బండెడ్లుమనవిరా
నడుమ దొర ఏందిరో – వాని
దోపిడేందిరో'

నలభై యేళ్ళుగా తెలుగు నేలనే కాదు దేశవిదేశాల్లో పదహారు భాషల్లో వూళ్ళనీ వాడల్నీ సబ్బండ వర్ణాల ప్రజానీకాన్నీ వుర్రూతలూగించిన / వూగిస్తున్న యీ పాటని కయిగట్టింది– గూడ అంజయ్య అని తొలిరోజుల్లో చాలామందికి తెలియదు. ఆ రోజుల్లో జనం పాటలన్నీ సామూహిక కర్తృత్వంలోనే ప్రచారం అయ్యేవి. అరుణోదయ, జననాట్య మండలి, ప్రజానాట్యమండలి, ప్రజాకళామండలి పార్టీల/ గ్రూపుల తేడాల్లేకుండా గొంతులో గానధుని వున్న కళాకారులంతా యీ పాటని పుక్కిట బట్టి గుడిసె గుడిసెకూ చేరవేశారు (అందులో గద్దర్ పాత్ర గణనీయమైనది). దోపిడీకి గురైనా అభాగ్యులంతా – పీడనకి లోనైనా అనాథులంతా పాటని గుండెకు హత్తుకున్నారు. పలుకు వచ్చిన పసిపిల్లల దగ్గర్నుంచి మూడుకాళ్ల ముసలవ్వ వరకూ 'దొర పీకుడేందిరో' అని పల్లెల్లో దొరతనాన్ని ధిక్కరించారు. దిక్కులు పిక్కటిల్లాయి. గడీల గోడలు బీటలు వారాయి. దొరలు పట్టణాలకూ నగరాలకూ తోకముడిచారు.

అలా వొక్క పాట ఊరినీ వాడనీ కలిపింది. దళిత బహుజన ఐక్యతకి కారణమై దాని అక్కరను తెలిపింది. అంతేకాదు; ఊరూ వాడల నుంచి దొరని వేరు చేసింది. ఉత్పత్తికీ ఉత్పత్తికారుడికీ ఉత్పత్తి సాధనాలకీ "నడుమ" దొర పెత్తనాన్ని ప్రశ్నించింది. కత్తీసుత్తీ పలుగూ పారా బండీ బండెడ్లూ అరకసారె ...వుత్పత్తి సాధనాలన్నీ సమస్త సంపదనీ సృష్టించే శ్రమజీవుల అదుపులో వుండాలని నిర్దేశించింది. విలాసంగా గట్టుమీద నించొని ఆలినుంచి అమ్మదాక విచక్షణ లేకుండా తిడుతూ కొడుతూ యే శ్రమా చేయని విరామ వర్గాల దొరల దొరతనాల ప్రమేయాన్ని ఖండించింది. రైతాంగంలో రైతుకూలీల్లో వర్గ స్పృహని రగిల్చింది. అంతిమంగా శ్రామిక వర్గ రాజ్యాధికారాన్ని ప్రబోధించింది.పని–పనిముట్లు అందించే ఫలితం పనిచేసేవాడికే చెందాలని ప్రకటించే ఖరారునామా యీ పాట. అది పీడిత ప్రజల హక్కుల పత్రం. దొరల సామాజిక ఆర్థిక ఆధిపత్యాన్ని కూలదోస్తూ వూరి రచ్చబండ మీద వేసిన వొక శిలాశాసనం –వొక మాగ్నా కార్టా. గూడ అంజయ్య అనే మహా ప్రజావాగ్గేయకారుడి నోటబుట్టి వూరూ వాడల్లో రేగిన సుడిగాలి దుమారం. ఊడలు దన్ని పాతుకు పోయిన భూస్వామ్య విలువల్ని వేర్లతో సహా కుళ్ళగించిన పెను ప్రభంజనం. బలహీనులపై బలవంతుల దాష్టీకం యింకానా యికపై చెల్లదు అని నినదించిన సామూహిక స్వరం. మట్టి కాడ వెట్టి కాడ కంచె కాడ మంచె కాడ చేని కాడ చెలక కాడ ప్రతి పనిలో చెమట చిందించిన వాళ్ళకే యీ రాజ్యం దక్కాలని శాసించిన అలిఖిత చట్టం యీ పాట.ఇంత గొప్ప ఆర్థిక సామాజిక రాజకీయ తత్త్వశాస్త్ర సారాన్ని ప్రజలనోళ్ళలో నానే అలతి అలతి పదాల్లో చొప్పించడంలోనే కవి అసామాన్యమైన ప్రతిభ దాగుంది.

ఈ పాట కయిగట్టేనాటికి అంజన్నకి మూతి మీద మీసం కూడా మొలవలేదేమో! ఇరవైయేళ్ళు కూడా నిండని యుక్త వయసులోనే యింటర్మీడియట్ చదువుకొనే రోజుల్లోనే పాటని ఆయుధం చేసే కళ అతనికి యెలా అబ్బింది అన్న ప్రశ్న వేసుకొంటే వొకటే సమాధానం : పనిపాటలకి సజీవ సంబంధం వున్న దళితసామాజిక నేపథ్యం నుంచి, అనునిత్యం జీవించడమే ఘర్షణయిన తండ్లాట నుంచి, పోరాటాల పురిటిగడ్డ తెలంగాణా పొత్తిళ్ళ నుంచి , సాహిత్యానికి జీవధాతువు లందించే మట్టిపొరల్ని తొల్చుకొని అతనొచ్చాడు. అందుకే అతని పాటల్లోని భాష తెలుగుదనంతో పరిమళిస్తుంది( కాగడా వేసుకు వెతికినా వొక్క సంస్కృతం ముక్క దొరకదు). పాట గతిలో, నడకలో పల్లెపదం గజ్జెకట్టి ఆడుతుంది. లక్ష్యంలో ప్రజావుద్యమ భావజాలం భాస్వరమై మండుతుంది.

గూడ అంజయ్యే కాదు, శివసాగర్ దగ్గర్నుంచీ గద్దర్– అందెశ్రీ– గోరటి వెంకన్న– జయరాజ్ వరకూ యెందరో ప్రజా కవులూ కళాకారులూ దళిత కుటుంబాల నుంచే రావడం ప్రజల వేదనకూ తిరుగుబాటుకూ సామూహిక స్వరం కావడం యీ నేలమీద అనివార్యమైన చారిత్రిక ఘటనలో భాగంగానే జరిగింది. ఆ చరిత్రలో అంజన్నది పురోగామి (vanguard) పాత్ర. అందుకే అతను ఆయా సందర్భాల్లో తెలంగాణా నేలమీద పురుడు పోసుకొన్న ప్రగతిశీల– విప్లవ –దళిత –ప్రత్యేక రాష్ట్రోద్యమాల్లో చారిత్రక కర్తవ్యాన్ని నిర్వహించిన సాంస్కృతిక సంస్థల నిర్మాణాల్లో ప్రధాన భూమికను నిర్వహించాడు. నవోదయ, అరుణోదయ , దళిత రచయితల కళాకారుల మేధావుల వేదిక, తెలంగాణా

ధూం ధాం ల వ్యవస్థాపకుల్లో వొకడై యాభై ఏళ్ల పాటు పాటై, నినాదమై, సమస్త ఆధి పత్యాలపై నిరసన స్వరమై జ్వలించాడు. ఎమర్జెన్సీలో జైలుకెళ్ళాడు.

'కొండలు పగలేసినం' పాటలో చెర బండరాజు 'శ్రమ ఎవడిదిరో – సిరి ఎవడి దిరో' అని ప్రశ్నించి అంతిమంగా 'చావు నీదిరో– గెలుపు మాదిరో' అని తీర్మానించి నట్టే గూడ అంజయ్య కూడా తొలినాళ్ళలో కట్టిన పాటలోనే

*'అసలేటి వానల్లో*
*ముసలెడ్లు గట్టుకొని*
*మోకాటి బురదలో*
*మడిగట్టు దున్నితె*
*గరిసె లెవరివి నిండెరా –గంగన్న*
*గుమ్ము లెవరివి నిండెరా – గంగన్న'*

అని ప్రశ్నించాడు. 'ఊరిడిసి నే బోదునా అయ్యో – ఉరిబోసుకుని సత్తునా?' పాటలో అప్పిచ్చి వెట్టిచాకిరీ చేయించుకొనే దొర పీడన భరించలేని రైతన్న ఆక్రోశం కంట నీరు పెట్టిస్తుంది. కానీ అది విషాద గీతం కాదు, పాట పూర్తయ్యేసరికి 'ఊరిడిసి నే బోనులె –దొరతోడి పోరాడి సాధిత్తులే' అని మట్టి సాక్షిగా చేసే బతుకుపోరు పాటగా పరిణమిస్తుంది (ఈ పాటను రాసేనాటికి తన వయస్సు పదహారేళ్ళు అనీ– తొలిసారి దాన్ని చెరబండరాజు సమక్షంలోనే పాడటం, దాన్ని అతను మెచ్చుకోవడం మరచిపోలేని అనుభవ మనీ అంజన్న చాలా సందర్భాల్లో ప్రస్తా వించాడు).

ఈ తొలిపాట దగ్గర్నుంచీ మలి దశ తెలంగాణా వుద్యమ గీతాల వరకూ ప్రశ్న తర్కం శోధన చైతన్యం తిరుగుబాటు మార్పు అనే గతితార్కికమైన తాత్త్వికత అంజయ్య రచనల్లో కనిపిస్తుంది. 'లచ్చులో –లచ్చన్నా! ఈ లుచ్చాగాల్ల రాజ్జెంలొ బిచ్చగాల్ల బతుకు లాయె' అన్న తిట్టులా తోచే క్రుద్ధస్వరంలో కూడా రాజ్య స్వభావాన్ని సైద్ధాంతికంగా అధిక్షేపించే రాజకీయ ప్రకటనే వినిపిస్తుంది.

'విప్లవం నాకు ఆదర్శం కాదు అవ సరం' అని వుద్ఘోషించిన అంజన్న విప్లవోద్య మంలో కుల సమస్య గురించి మాట్లాడాడు. దళితోద్యమానికి విప్లవ చైతన్యాన్ని జోడిం చాడు. అంబేద్కరిజం వెలుగులో వర్గంలో వున్న కులాన్ని, కులంలో వున్న వర్గాన్నీ చూడగలిగాడు. అంబేద్కర్ మీద బుర్రకథ




ఫోటో : గంగాధర్

ఆయన రచనలు.. విప్లవాగ్ని జ్వాలలు

రూపొందించాడు. కుల ప్రాంత అస్తిత్వ చైతన్యంలోంచి విప్లవచైతన్యం పెంచాలను కొన్నాడు. వాగ్గేయకారులు చాలామంది పాటలకి పరిమితమైతే అంజయ్య దళితో ద్యమంలో తనను తాను మరింత విస్తృత పరచుకొన్నాడు. వచన సాహిత్యంలో కూడా తనదైన సత్తా చూపించాడు. దళిత అస్తిత్వ స్పృహతో కథలు (దళిత కథలు), నవల (పొలిమేర) రాశాడు. వాటికి తెలుగు విశ్వ విద్యాలయం నుంచి పురస్కారాలు పొందాడు. ఫార్మసిస్టుగా యెన్నో రోగాలకు మందులు అందించాడు. సామాజిక శాస్త్రవేత్తగా సాహిత్య వైద్యం చేశాడు.

రంగులకల సినిమాలో 'భద్రం కొడుకో' పాట గద్దర్ పాడాడు. శ్రీ శ్రీ– కూటి కోసం, కూలి కోసం పట్టణంలో బతుకుదామని తల్లి మాటని చెవిని పెట్టక బయల్దేరిన బాటసారి కష్టం గురించి రాస్తే...అంజన్న పల్లె నుంచి పొట్టచేత బట్టుకొని నగరానికి వలస వచ్చి రిక్షా తొక్కే కష్టజీవి కొడుక్కు 'బద్రం కొడుకా పైలం కొడుకా' అని చెప్పే తల్లి మాటల్నే పాటగా కట్టాడు. గద్దర్ గొంతులో ఊరు మనదిరా పాట వురుములా గర్జనలు పోతే

పక్షవాతంతో బాధపడుతూ...



ఫోటో : గంగాధర్

భద్రం కొడుకో పాట ఆర్ద్రంగా అమ్మ లాలిం పులా వొళ్ళంతా పుణుకుతుంది. పాట యెత్తు కోవడంలోనే తెలంగాణ నుడికారం కట్టి పడే స్తుంది. 'రిక్షా యెక్కే కాడ దిగే కాడ తొక్కుడు కాడ మలుపుడు కాడ బద్రం కొడుకో జర పైలం కొడుకో' అన్న అమ్మ పేగుభాషని ఆర్తితో పలికిస్తూనే బడుగుజీవుల శ్రమని దోచుకోడానికి పల్లెకీ పట్నానికీ తేడా వుండదని హెచ్చరిస్తాడు. పల్లెలో దొరల బాధలు పడలేక పట్నమొస్తే పట్నంలో 'పెద్ద పెద్ద బంగ్లలల్ల పెద్దా పెంజరలుండు నల్లా బాజారు నిండ నల్లా నాగులుండు నలుగురు గూడిన కాడ నరలోకపు యముడుండు' అని మొత్తం దోపిడీ వ్యవస్థ వెయ్యికాళ్లజెర్రిలా యెలా వ్యాపించి వుందో కళ్ళకు కట్టించాడు అంజన్న. శ్రీశ్రీ 'బాటసారి' కవితనీ అంజయ్య 'బద్రం కొడుకో కొమురన్న' పాటనీ పక్క పక్కన పెట్టి చూసినపుడు అంజన్న పాటలోని బలమేంటో బోధపడుతుంది. వూరుగాని వూరిలో పల్లెగాని పల్లెలో కొత్త పరిసరాల్లో వలస కార్మికులకు సాంఘిక భద్రత కల్పిం చాల్సిన పాలకుల బాధ్యతని గుర్తు చేస్తూ సామాజిక రాజకీయ కోణాన్ని ఆవిష్కరిం చింది. పల్లెను విడిచి కొత్తగా పట్నానికి వచ్చిన ప్రతి శ్రామికుడూ ఆ పాటలో తనను చూసుకొన్నాడు. ఆ పాటలోని తొలిపదం (భద్రం కొడుకో)తో మరో సినిమా వచ్చింది.

సినిమాలకు తన పాటలనిచ్చినా సంపద పోగేసుకోలేదు. 'నేను రాను బిడ్డో సర్కారు దవాఖానకు' వంటి పాటలు సినిమా ప్రపం చంలో సంచలనం సృష్టించినా అక్కడి తళు కులూ బెళుకులూ అతణ్ణి ఆకర్షించలేదు. నిరాడంబర స్వభావంలో మార్పు తేలేదు. హంగులూ, ఆర్భాటాలకు ఆమడ దూరం వున్నాడు. నిజానికి వూరు మనది పాటను పీపుల్స్ ఎన్‌కౌంటర్ సినిమా నిర్మాతలు చౌర్యం చేసినప్పుడు ఇండస్ట్రీని యేలుతున్న దొరతనాన్ని యెదిరించడంలోనే అంజయ్య బాహాటమయ్యాడు. సినీ పరిశ్రమ పెద్దలకి అతని బలమేంటో తెలిసొచ్చింది. ఆర్.నారా యణమూర్తి ఆ బలాన్ని తన చిత్రాల్లో గొప్పగా ఆవిష్కరించాడు. 'నా కొడుకో బంగారు తండ్రి నిన్ను కలకటేరు అనుకొంటిరో' వంటి పాటలు గుండెల్ని పిండేస్తే, 'తెలంగాణ గట్టు మీద సందమామయ్యో... ఎర్ర మల్లెలు పూసె నంట సందమామయ్యో' లాంటి పాటలు

వుత్సాహాన్ని నింపిగుండె ధైర్యాన్నిచ్చాయి.

అంజన్న సాహిత్య జీవితంలో మూడు దశలున్నాయి. మొదటి దశలో తన పాటని సాయుధం చేసి విప్లవోద్యమానికి అంకిత మిచ్చాడు. రెండో దశలో దళిత రాజకీయా లతో మమేకమయ్యాడు. మూడో దశలో తెలంగాణా రాష్ట్ర సాధనలో భాగమయ్యాడు. కవిగా, గాయకుడిగా, రచయితగా యే దశ లోనూ ప్రజా సంబంధాలు కోల్పోలేదు. పాటని జీవితం నుంచీ విడదీసి చూడలేదు. ఎవరి ముందూ తల వంచలేదు. స్వీయ ప్రయోజనాలకోసం పాకులాడలేదు. అధి కారానికి దాసోహం అనకుండా ప్రజల పక్షం వహించాడు. ప్రజలనుంచి నేర్చుకున్న జ్ఞానాన్ని ప్రజలకే అంకితం చేశాడు. పెయి మీద



విప్లవ సహచరుల, కవుల, రచయితల మధ్య పాటతో వీడుకోలు పలుకుతున్న గద్దర్

అంగీ, కాళ్ళకి చెప్పులు లేని బడుగుజీవుల అనుభవాలు గుండె గోస బాస యాస కష్టాలూ కన్నీళ్ళే తన పాటకి ప్రాణం పోశా యని, ప్రజలే తనకు గురువులై పాటని మహాకావ్యంగా శిఖరంపై నిలిపారని అంజన్న చెప్పుకొనేవాడు. ప్రజలపట్ల వారి సంస్కృతి పట్ల భాషపట్ల రాజకీయాలపట్ల అతనికున్న ఆ వినమ్రత కారణంగానే అతను 'పాట కవులవేదిక' అయ్యాడు. మలి దశ తెలం గాణా వుద్యమంలో తొలిపొద్దయ్యాడు.

అంజయ్య పాట లేకుండా తెలంగాణా రాష్ట్రం సాధ్యమయ్యేది కాదు. ధూం ధాంలలో అంజన్న పాట పోరు హోరయ్యింది. 'నా తెలంగాణ–నిలువెల్ల గాయాల వీణ, నను గన్న నా తల్లి నా తెలంగాణ' పాట– తెలం గాణా ప్రజల దుఃఖాన్ని ఆర్తినీ ఆవిష్కరిస్తే, 'పుడితొక్కటి – సత్తె రెండు రాజిగ ఒరె రాజిగ, ఎత్తూర తెలంగాణ జెండ రాజిగ ఒరె రాజిగ' పాట వుద్యమ చైతన్యాన్ని నింపింది. 'అయ్యో నివా–అమ్మోనివా' సమైక్యవాదంలోని అశాస్త్రీ యతనీ తాత్త్విక గందరగోళాన్నీ బోలుతనాన్నీ యెండగట్టింది. తెలంగాణా రాష్ట్ర సాధనలో తన పాటని ఆయుధంగా అందించిన అంజన్న యాభైయేళ్ళ తెలంగాణా కల సాకారం కావడం కళ్ళారా చూసుకోగలిగాడు. ప్రజా స్వామ్య తెలంగాణ విషయంలో మారోజు వీరన్న, బెల్లి లలితల వారసత్వమే అంజన్నది.

తెలంగాణా టూ తెలంగాణా వయా నగ్జల్బరి ప్రస్థానంలో విస్ఫులింగాలు కురిసిన అంజన్న పాటలు కోస్తాలో కూడా విస్తృత ప్రచారం పొందాయి. కాకినాడలో జోరు వానని సైతం లెక్కజేయక ప్రజలు దొర ఏందిరో ఆని దోపిడేందిరో అని అంజన్నతో గొంతు కలిపారు. కాకినాడ నుంచి తిరుగు ప్రయాణంలోనే పాటగాణ్ణి పోలీసులు వేటాడి అరెస్టు చేశారు. జైల్లో వున్న సంవత్సరంపాటు రాసిన పాటల్లో శ్రీపాద శ్రీహరి మీద 'లక్ష లాది చుక్కల్లో ఏ చుక్కల్లో ఉన్నావో' అంటూ రాసిన స్మృతిగీతం చాలా ప్రచారం పొందింది.

పక్షవాతం వచ్చి మంచానబడ్డ చివరి రోజుల్లో సైతం యెడమ చేత్తో పలకమీద ప్రజల పాట రాయడానికి తపించాడని అతని భార్య హేమగారు చెప్పిన మాటలు అంజన్న చివరివరకూ శ్వాసించి ఆచరించిన నిబ ద్ధతకి నిలువెత్తు సాక్ష్యాలు. ఎడమ పిడికిలి బిగించే విశ్వవిద్యాలయాల వెలివాడలో వర్ణ వివక్షకి బలైన రోహిత్ వేములకి జై భీములు



చెప్పాడు. రచయిత రాజీ పడటమంటే ఆత్మని అమ్ముకోవడమే అని జీవితాంతం విశ్వసించి ఆచరించిన అంజన్న తెలంగాణా సొంత రాష్ట్రంలో దొరల గడీలు గులాబీ రంగేసుకోవ డాన్ని ప్రశ్నించాడు. ప్రజాస్వామ్యం ముసు గేసుకొన్న పాలకుల దొరతనపు పోకడల్ని అసహ్యించుకొని సామాజిక తెలంగాణా రాలేదని బాధపడ్డాడు.

కొత్త రాష్ట్రం యేర్పడి రెండేళ్ళయినా స్వపరిపాలనలో సైతం ప్రజా సమస్యలు యెందుకు పరిష్కారం కావడం లేదు – 'సేను వాయె–సెలుక వాయె, బతుకు వాయె– మెతుకు వాయె, గొడ్డు వాయె –గోద వాయె, వలస బోయి బతుకుడాయె' అని తాను యేళ్ళ తరబడి పాడిన పాత పరిస్థితులే ఎందు కున్నాయి అని పాలకుల్ని ప్రత్యక్షంగా కలిసి నిలదీయాలనుకొన్నాడు. అయితే రాజ్యాన్నేలే దొరని చూడటం ఆయన చివరికోరిక అని కొందరు అపార్థం చేసుకున్నారు.

ఊరున్నంత కాలం, వాడ వున్నంత కాలం, ఊరూవాడల్ని విడదీసే దొరలూ దొర తనాలూ వున్నంతకాలం అంజన్న పాటకి ప్రాసంగికత వుంటుంది. పాటతో దొరతనాల పీఠాలు కుదిపినందుకే యేలిన వారికి ప్రజా వాగ్గేయకారుడి మరణం అల్పవిషయంగా తోచింది. చివరి చూపులక్కూడా దొర రాక పోవడమే అంజన్న విజయం. అదే అతని గౌరవాన్ని ఇనుమడింప జేసింది. ఎత్తిన తల దించకుండా పోయేలా చేసింది. ఆధిపత్యా లకు వ్యతిరేకంగా అతను చేసిన పోరాటాలని పదికాలాల పాటు గుర్తుంచుకొనేలా చేసింది. కుల మత వర్గ ఆధిపత్యాలను తొలగించే నూతన ప్రజాస్వామిక విప్లవంలో కొనసాగ డమే అంజన్న నుంచి మనం పొందవలసిన స్ఫూర్తి.

**అమరుడు, యుగకవి**
**గూడ అంజయ్యకి లాల్ నీల్ సలాం.**

❋

-డా॥మధురాంతకం నరేంద్ర,
98662 43659

# తెలుగు భారతం

**అం**తర్జాలంలోని 'వికీపీడియా' అనే విజ్ఞాన సర్వస్వం మహాభారతపు తొలి రాతప్రతులు దాదాపు క్రీస్తుపూర్వం 400వ సంవత్సరపు ప్రాంతానివని నిర్ధారిస్తోంది. వాటి పుట్టుక క్రీస్తుపూర్వం 8 లేక 9 శతాబ్దాలలో జరిగి వుండవచ్చునని వూహిస్తోంది. మహాభారతంలో కౌరవ పాండవులు నివసించినట్టుగా చెప్పుకొనే హస్తినాపురం యిప్పుడు ఉత్తరప్రదేశ్ రాష్ట్రంలో మీరుట్‌కు దగ్గర్లో వుంది. అలాగే ఇంద్రప్రస్థం ఈనాటి ఢిల్లీ నగరపు ఉత్తర దిశలో వుండేది.

మహాభారతాన్ని రాసిన వేదవ్యాసుడు విష్ణువు అవతారమేననీ, అందుకే ఆయనను పేర్కొంటూ 'వ్యాసో నారాయణో హరి' అంటారనీ చాలామంది నమ్ముతారు. కానీ మహాభారతం రాసిన వ్యాసుడు సత్యవతికీ పరాశర మహర్షికీ పుట్టినవారనీ, కౌరవుల తండ్రి ధృతరాష్ట్రుడూ, పాండవుల తండ్రి పాండురాజూ నియోగపద్ధతిలో వ్యాసుడి సంతానమేననీ భారతం వివరిస్తుంది. కానీ ఆధునిక విమర్శకులు కొందరు వ్యాసుడు పశ్చిమ నేపాల్‌లోని తనహూన్ జిల్లాలోగానీ, ఉత్తరప్రదేశ్‌లోని కల్పి దగ్గరి యమునలోని ద్వీపంలో గానీ పుట్టి వుంటాడని అభిప్రాయపడుతున్నారు. ఈ సంగతులన్నీ మహాభారతం ఉత్తర భారతదేశపు కొసలో జరిగిన కథని నిరూపిస్తాయి. అయితే ఆ మహాభారతాన్ని మరే యితర భాషల వాళ్ళకంటే ఎక్కువగా తెలుగువాళ్ళే స్వంతం చేసుకోవడం విలక్షణమైన చారిత్రక సత్యం.

అసలు తెలుగు సాహిత్యం మహాభారత అనువాదంతోనే ప్రారంభమయ్యింది. మూడు వేర్వేరు శతాబ్దాలకు చెందిన కవిత్రయం నన్నయ, తిక్కన, ఎర్రాప్రెగడ మహాభారతాన్ని అద్భుతంగా అనుసృజన చేయడం ప్రపంచ సాహిత్యంలోనే అరుదైన సంఘటనగా రూపొందింది. మహాభారతాన్ని తొలి నుంచీ చివరి వరకూ సమగ్రంగా నేనెప్పుడూ చదవలేదు. కానీ మహాభారత కథ, అందులోని అనేకానేక ఉపకథలూ నాకు దాదాపుగా తెలుసు. నాకే కాదు, తెలుగువాడైన ప్రతివాడికీ ఆ మాత్రం జ్ఞానం తప్పకుండా వుండే వుంటుంది. నిజానికి మహాభారతం తెలుగువాళ్ళ రక్తంలోనే భాగమైపోయి శతాబ్దాలు గడిచిపోయాయి.

మహాభారత వారసత్వం నాకు నా అమ్మానాన్నల రెండు వైపుల నుంచీ సంక్రమించింది. మా నాన్న తాతగారు పాత ఉత్తర ఆర్కాడు జిల్లా అటు చివరిలోని చెంజి వెంకటాపురం అనే గ్రామం నుంచీ, యిటు చివరిలోని రవణయ్య గారి పల్లె అనే గ్రామానికి అక్కడి పల్లె ప్రజలకు పాఠాలు చెప్పడం కోసం, నాటకాలు నేర్పించడం కోసం వలస వచ్చాడు. అప్పటి పాఠాల్లో భారతంలోని సభాపర్వమూ, విరాటపర్వమూ తప్పనిసరిగా వుండేవి. అలాగే ఆ రోజుల్లో 'ఆట' అని పిలిచే వీధి నాటకాల కథాంశాలు భారత ఉపాఖ్యానాల నుంచే తీసుకోబడేవి. మా అమ్మ తాతగారు ఆ రోజుల్లో మా జిల్లాలో ప్రసిద్ధి చెందిన భారత హరికథకుడు. అయితే నాకు భారతాన్ని గురించిన జ్ఞానం వాళ్ళిద్దరి నుంచీ గాకుండా రెండు ఆధునిక మార్గాల్లో సంక్రమించింది. అవి- సినిమాలు, మహాభారత యజ్ఞాలు.

మహాభారతంతోనూ, దాని ఉపాఖ్యానాలతోనూ తెలుగుభాషలో వచ్చినన్ని సినిమాలు మరే యితర భాషలోనూ వచ్చి వుండవు. నర్తనశాల, శ్రీకృష్ణరాయబారం వంటివయితే రెండుమూడుసార్లు నిర్మించారు. భారతంలో చాలా చిన్నపాత్రను పోషించిన ఉపాఖ్యానాలు గూడా సమగ్రమైన చిత్రాలుగా మారిపోయాయి. భారత కథ ఆధారంగా కొన్ని కొత్త కల్పనలు కూడా చేయబడ్డాయి. ఈ సినిమాలన్నీ ప్రజారంజకంగా తయారయ్యాయి. ఈ సినిమాలన్నీ చూసిన మా తరం ప్రేక్షకులకు భారతం కరతలామలకమై పోయింది.

**మహాభారత యజ్ఞాలు తొండనాడులో బాగా ప్రసిద్ధమైన వినోద కాలక్షేపాలు.** పాత ఆర్కాడు జిల్లాకు చెందిన తమిళనాడులోని వేలూరు, తిరువణ్ణామలై, తిరువల్లూర్, కంచి, విల్లుపురం, కడలూరు, పాండిచ్చేరి జిల్లాలతోబాటూ ఆంధ్రప్రదేశ్ లోని చిత్తూరు, నెల్లూరు జిల్లాల్లోని దక్షిణ ప్రాంతాలను కలిపి 'తొండనాడు' అని పిలుస్తారు. ఈ ప్రాంతంలో తెలుగూ తమిళమూ కలగాపులగంగా వుండేవి. **భాషా ప్రయుక్త రాష్ట్రాలు ఏర్పడక పూర్వం ఈ ప్రాంతమంతా తెలుగుభారత యజ్ఞాలు విరివిగా సాగేవి.** వీటిని పగటి కథ, రాత్రి ఆట అని రెండు రకాలుగా విభజించవచ్చు. పగటిపూట, మధ్యాహ్నం భోజనా నంతర కాలం నుంచి సాయంత్రం వరకూ, ఊరిబయట, భారతం మిట్ట అని నేటికీ పిలవబడుతున్న ఆరుబయటి ప్రాంతంలో చలువ పందిళ్ళ కింద, భారతాన్ని హరికథగా ప్రదర్శించేవాళ్ళు. హరిదాసు దాదాపు 3 గంటల సేపు ప్రేక్షకులకు ఉత్కంఠ గలిగేలా భారతకథను హరికథగా గానం చేసేవారు. భీష్మ ప్రతిజ్ఞ, పాండవ జననం, లక్క యిల్లు, బకాసురవధ, ద్రౌపదీ స్వయంవరం, మాయాద్యూతం, విష నీళ్ళు, ఘోషయాత్ర, గోగ్రహణం, రాయబారం, భీష్మమరణం, అభి మన్యుడి చావు, కర్ణవధ, దుర్యోధన సంహారం- ఇలా రోజుకొక ముఖ్య ఘట్టం ఆధారంగా 18 రోజుల కథ అద్భుతంగా సాగేది. బకాసుర వధ రోజున ఊరంతా బండిలో అన్నం వేసేది. తపసుమాను రోజున అర్జునుడు తపసు మానెక్కితే పిల్లలులేని స్త్రీలంతా వరపడే వాళ్ళు. దుర్యోధన వధ రోజున మట్టితో తీర్చిన దుర్యోధనుడి విగ్రహం దగ్గర రాత్రి ఆటలోని నటులు పద్యాలు పాడుతూ నటించేవాళ్ళు. ఆట ముగిశాక దుర్యోధనుడి బొమ్మలోని కుడిచేతి మట్టికోసం ప్రజలు పోటీపడేవాళ్ళు. అతడి కుడిచేతిలో ధనరేఖ జెర్రిపోతులాగుండేదని, ఆ మట్టి యింట్లో వుంటే సంపద వచ్చి చేరుతుందనీ గ్రామీణుల నమ్మకం.



తపసుమాను

పగటిపూట భారత హరికథకు సమాంతరంగా రాత్రిపూట 'ఆట' సాగేది. కంగుంది కుప్పం ఆ వీధినాటకాల వాళ్ళకు ప్రసిద్ధి. అక్కడి నుండి వచ్చిన జానపద కళాకారులు

రాత్రి భోజనాల సమయం తరువాత ప్రారంభించి తెల్లవారే వరకూ భారత ఘట్టాలను ప్రదర్శించే వాళ్ళు. ఒకోసారి నల్లకళ్లజోడు తొడుక్కొని, సోవుదారుడు రుమాలునో, సవకాన్నో(తుండుగుడ్డ) చేతబట్టుకుని "ఇదిగో వచ్చెను దుర్యోధన మహారాజు" అని రంగస్థల మంతా కదనుదొక్కేవాడు.

పగటిపూట హరికథ జరిగే వేదిక వెనకుండే చిన్న కొట్టంలో పంచపాండవులు, ద్రౌపది, శ్రీకృష్ణుల చెక్క బొమ్మలుండేవి. వాటికి ఆ ఎనిమిది రోజులూ పూజలు జరిగేవి. భారత యజ్ఞం ప్రారంభించ బోయే ముందు పోతురాజు విగ్రహాన్ని మెరవణి చేసేవారు. **పోతురాజు పాండవులకు బావమరిది అవుతాడనీ, కురుక్షేత్ర యుద్ధానికి ముందు అతడ్ని బలిచ్చారనీ ఒక జానపద భారతగాథ ప్రచారంలో వుంది.** రాత్రి ఆట జరిగే రంగస్థలం కొట్టానికి ఎదురుగా పెద్ద మైదానంలో వుండేది. ప్రేక్షకులందరూ రాత్రంతా నేలపైన చాపలూ, బొంతలూ పరుచుకొని కూచుని, పడుకునీ, ఎలా కావాలంటే అలా నాటకాల్ని చూసేవాళ్ళు. భారతం మిట్టచుట్టూ రాత్రంతా రకరకాల జూదాల్ని ఆడే గుడారాలూ, తినుబండారాల అంగళ్ళూ వుండేవనుకోండి. అది వేరే సంగతి.



తొండనాడులో జరిగే ఈ భారత యజ్ఞాలు లేని మిగిలిన తెలుగు ప్రాంతాల్లో (యిప్పటి రెండు రాష్ట్రాల్లో) భారతానికి సంబంధించిన పద్య నాటకాలు బాగా ప్రాచుర్యంలో వున్నాయి. యిప్పటికి గూడా తిరుపతి వేంకట కవుల 'కృష్ణరాయబారం' నాటకం నుంచి ఏ రెండు మూడు పద్యాలనైనా (చెలియ చెల్లకో, జెండాపై కపిరాజు, అలుగుటయే ఎరుంగని మొదలైనవి) రాగయుక్తంగా పాడే గ్రామీణుడు (నిరక్షరాస్యుడైనా) లేని పల్లెలు తెలుగు ప్రాంతాల్లో వుండవు.

'తింటే గారెలే తినాలి, వింటే భారతమే వినాలి' లాంటి సామెత మరే యితర భారతీయ భాషల్లో గూడా వున్నట్టు లేదు. భారతానికున్న ప్రాచుర్యం క్రమంగా పెరుగుతూనే వుంది. పునర్మూల్యాంకనాలకు భారతం గురయినంత ఎక్కువగా మరే యితర గ్రంథమూ గురయి వుండదు. స్వాతంత్ర్యానంతరం వచ్చిన పునర్మూల్యాంకనాల్లో ప్రసిద్ధ మరాఠీ రచయిత్రి ఐరావతీ కార్వే రాసిన యుగాంతం(1960) ప్రసిద్ధ మైంది. చారిత్రక, మానవ పరిణామ (Anthropological) లౌకిక (Secular) దృష్టితో కార్వే భారతంలోని ప్రసిద్ధ పాత్రల వ్యక్తిత్వాల నంతా విశ్లేషించింది. అలా మనుషుల జీవితాన్ని ప్రభావితం చేసే చలన సూత్రాలనంతా ఆవిష్కరించి ఆమె పాఠకులను ముగ్ధుల్ని చేసింది. ప్రముఖ కన్నడ రచయిత భైరప్ప భారతాన్ని నవలగా రూపొందించిన 'పర్వ' ఆధునిక సాహిత్యంలోని అనర్ఘరత్నంగా అభివర్ణించబడిన రచన. భారతం జరిగిన ప్రదేశాలకంతా వెళ్ళి అక్కడి భౌగోళిక పరిస్థితుల్ని గమనించి, భారతకాలపు సాంఘిక జీవనాన్ని పరిశోధించి, అప్పటి పరిస్థితుల్లో భారతమెలా జరిగి వుంటుందో గొప్పసాంఘిక నవలగా రూపొందించిన విశిష్టమైన నవల 'పర్వ'(1979). ఒరియా రచయిత్రి ప్రతిభారాయ్‌కి జ్ఞానపీఠ బహుమానాన్ని తెచ్చిపెట్టిన 'యాజ్ఞసేని' ద్రౌపది దృక్కోణం నుంచి భారతాన్నంతా స్త్రీవాద దృక్పథంతో పునర్మూల్యాంకన గావించిన నవల. చిత్రా బెనర్జీ దివాకరుని అనే భారతీయ-అమెరికా నవలారచయిత్రి మరింత తీవ్రమైన తీవ్ర స్త్రీవాద దృక్పథంతో ద్రౌపది జీవితాన్ని 'ది ప్యాలెస్ ఆఫ్ యిల్యూజన్స్' అనే నవల (2003) రాశారు. వివాదాస్పదులైన రచయిత, రాజకీయవేత్త శశితరూర్ 1989లో రాసిన 'దిగ్రేట్ ఇండియన్ నావెల్' సాతంత్ర్య సమయంలోనూ, స్వాతంత్ర్యం తరువాతి మూడు దశాబ్దాల్లోనూ జరిగిన విషయాలనూ, అప్పటి ప్రముఖ రాజకీయ నాయకులనూ భారతంలోని ముఖ్యపాత్రలుగా అభివర్ణిస్తూ రాసిన వ్యంగ్య నవల. వీటిలో భైరప్ప 'పర్వ' ప్రతిభారాయ్ 'యాజ్ఞసేని' తెలుగు అనువాదాలు బాగా ప్రాచుర్యంలోకి వచ్చి రెండు మూడు ముద్రణలు పొందాయి.

మహాభారతానికి చెందిన స్త్రీ పాత్రలనాధారంగా చేసుకుని స్త్రీవాద దృక్పథంతో రాసిన కథలు గూడా వున్నాయి. ఇటీవలి కాలంలో నవలలూ, వ్యాఖ్యానాలూ వచ్చాయి. అయిదారేళ్ళ క్రితం యార్లగడ్డ లక్ష్మీప్రసాద్ గారు రాసిన నవల 'ద్రౌపది' సంచలనాన్నే రేపింది. సంవత్సరం క్రితం రంగనాయకమ్మగారు తన 'రామాయణ










విషవృక్షం' ధోరణిలో మహాభారతాన్ని 'ఇదండీ మహాభారతం' అనే పేరుతో వ్యాఖ్యానించారు. డా॥ఎం.వి.రమణారెడ్డిగారు 'మహాభారత స్రవంతిలో తెలుగింటి కొచ్చిన ద్రౌపది' అనే పరిశోధనాత్మక గ్రంథంలో తిక్కన ద్రౌపదిని యెంత గొప్పగా తెలుగు స్త్రీగా మలిచారో వివరించారు. మహాభార తాన్ని తెలుగువారికి ఆత్మీయంగా మలచ డంలో కవిత్రయం పాత్ర గొప్పదీ, ముఖ్యమైనదీ అని ఈ పుస్తకం నిరూపిస్తుంది. ఇదే ధోరణిలో ఆ ముగ్గురు మహాకవులూ యితర ముఖ్యపాత్రల్ని గూడా తెలుగుపాత్రలుగా మలిచే వుంటారు. ఆ మార్గంలో పరిశోధన చేయడానికి యీ పుస్తకం దారి చూపెట్టింది.

వారం రోజుల క్రితం నాయుని కృష్ణమూర్తిగారు ప్రచురించిన 'జయం' ఆధునిక భారత రచనలకు అభినందనీయమైన చేర్పు. భారతానికి మూలరచనకు వ్యాసుడు 'జయం' అని పేరు పెట్టాడు. కృష్ణమూర్తి గారు జయం ఒక యితిహాసమనీ, చరిత్ర అనీ, నిజంగా జరిగిందనీ నమ్మి, దాన్ని యిలా జరిగి వుంటే వాస్తవికత వుంటుందని అనుకునే రీతిలో నవలగా రాయడానికి ప్రయత్నించారు.

జయాన్ని జనమేజయుడికి వినిపించిన వైశంపాయనుడు ఎన్నో వివరణలు, పూర్వకథలు, చరిత్రలు శాస్త్రాలు జోడించి 24 వేల శ్లోకాల భారతంగా మార్చాడనీ, సూత శౌనకాది మునులకు వినిపించినప్పుడు దాని విస్తృతి యింకా పెరిగిందనీ లక్ష శ్లోకాల మహాభారతంలో 8800 శ్లోకాల 'జయమ్'ను వెదుక్కోవలసిన పరిస్థితి ఏర్పడిందనీ కృష్ణమూర్తి గారు అంటారు. గుజరాత్ రీసెర్చి ఇన్‌స్టిట్యూట్









శాఖ గౌరవ సంచాలకుడు ఆచార్య కేశవరామ్ శాస్త్రి గారు పరిశోధన చేసి, 8801 శ్లోకాల అసలు 'జయమ్'నే వేరుచేసి ప్రచురించారనీ, దాని ఆధారంగా తాను 'జయమ్' రాశాననీ ఆయన చెప్పారు. వరాలూ, శాపాలూ, అద్భుతాలూ, పునర్జన్మలూ, మాయలూ లేని వాస్తవిక మానవ జీవన గాథగా 'జయమ్'ను వచనంలో రాశారు.

పంపకవి కన్నడంలో 'విక్రమార్జున విజయం' అనే పేరుతో రాసిన పంపభారతం గూడా వ్యాసుడి మహాభారతానికి సంక్షిప్త రూపమే. జైనమతానికి చెందిన పంపకవి దీన్నే పురాణంగా కాకుండా లౌకిక కావ్యంగా (Secular poem) మార్చారు. అర్జునుడ్ని కథా నాయకుడిగా మార్చి, అతడ్ని తన ప్రభువైన అరికేశరితో పోల్చి కథను నడపడం కోసం పంపకవి మూలభారతాన్ని రకరకాలుగా మార్చి పారేశారని విమర్శకులు భావిస్తారు. అయితే మూలభారతాన్ని సంక్షిప్తీకరించడంలోనూ, లౌకిక కావ్యంగా మార్చడంలోనూ పంపకవి గొప్పతనం కనబడుతుంది.

పంపకవి గురించిన ప్రసక్తి యెందుకు వస్తోందన్న ప్రశ్న రావచ్చు. కారణమేమిటంటే పంపకవి 10వ శతాబ్దంలో గుంటూరు ప్రాంతపు కమ్మనాడులో 'పుంగునూరు' అనే ఊరిలో పుట్టాడట. విచిత్రమేమిటంటే 'జయమ్'ను అదే ధోరణిలో నవలీకరించిన నాయుని కృష్ణమూర్తి గారు చిత్తూరుజిల్లాలోని 'పుంగునూరు'కు 10 కిలోమీటర్ల దూరంలో వుండే చౌడేపల్లిలో పుట్టారు.

**కురుక్షేత్ర యుద్ధంలో నాటి ఆంధ్రులు కౌరవపక్షంలో పోట్లాడారని చరిత్రకారులు చెప్తారు. ఆంధ్రుల్లో అందుకే కౌరవపక్షపాతం కొంత జన్మతః వచ్చి వుంటుందని అనిపిస్తుంది**. దుర్యోధనుడ్ని కథానాయకుడ్ని చేసిన సినిమాలూ, దుర్యోధనుడిదే ధర్మమని వాదించే వ్యక్తులూ ఈ విషయాన్ని రుజువు చేస్తాయి. భారతం ఒక ధర్మ సంకటమైన పరిస్థితి పైన ఆధారపడిన పురాణం. నాటి ధర్మం ప్రకారం అంధుడైన వ్యక్తి రాజుగావడానికి అనర్హుడు. అయితే చర్మ వ్యాధి వుండే వ్యక్తీ అనర్హుడే. అలా ధృతరాష్ట్రుడూ, పాండురాజూ యిద్దరికీ వున్నది ఒకే సమస్యే. అందువల్ల ఒకర్ని యువరాజు చేయడం, మరో వ్యక్తి పరిపాలనచూడడం అన్నది వాళ్ళకాలం నుంచే ప్రారంభమైంది. ఈ సమస్యకు నిర్దుష్టమైన పరిష్కారం లేదు. మానవజీవితంలోని చాలా సమస్యలకు అలాంటి సమాధానాలుండవు. అందువల్ల యిటువంటి సమస్యల్ని పరిష్కరించడంలో వివాదాలుంటాయి. పరస్పర విరుద్ధమైన అభిప్రాయాలుంటాయి.

**మహాభారత యజ్ఞాలు జరిగే తొండనాడు ప్రాంతం మిగిలిన ఆంధ్ర ప్రాంతాలకు పూర్తిగా విరుద్ధంగా వుంటుంది. తొండనాడులో పాండవులు దేవుళ్ళయిపోయారు. ప్రస్తుతం యేది తొండనాడు అని తేల్చుకోవాలంటే దానికొక సులువైన మార్గముంది. తొండనాడులోని ప్రతి వూర్లోనూ ధర్మరాజు గుడి వుండి తీరుతుంది. మదరాసు (నేటి చెన్నయ్)లో గూడా ధర్మరాజు గుడి వుంది. తొండనాడులోని గ్రామాల్లో పాండవుల పేర్లు, చివరకు ద్రౌపది, కుంతి పేర్లు గూడా గ్రామీణులు పెట్టుకుంటారు.**

'పర్వ'ను అద్భుతంగా తెలుగీకరించిన ఆచార్య గంగిశెట్టి లక్ష్మీ నారాయణ గారు తొండనాడును గురించి ఒక చిత్రమైన విశేషం చెప్పారు. కురుక్షేత్రయుద్ధం తర్వాత కొంతమంది పాండవపక్షపు సైనికులు దక్షిణ భారతదేశానికి వలస వచ్చారనీ, వాళ్లందరూ తొండనాడులో స్థిరపడ్డారనీ ఆయన అభిప్రాయం. తొండనాడు జన జీవితాన్నింత బలంగా ప్రభావితం చేసిన మహాభారత యజ్ఞాలను గమనించినప్పుడు ఆయన ప్రతిపాదన సహేతుకమేనన్న నమ్మకం కలుగుతుంది.

**నాయుని కృష్ణమూర్తి గారు తొండనాడు నానుకుని విస్తరించిన మొరసునాడుకు చెందిన వ్యక్తి. భైరప్ప గారు మొరసునాడుకు అటు చివరలో పుట్టారు. పంపకవి కమ్మనాడులో పుట్టినా జైనమతాన్ని అవలంబించాడు. అందుకే వీళ్ళు మాత్రం వీలయినంతవరకూ నిర్మోహతతో తటస్థధోరణిలో కథను నడిపారు. రచయిత వ్యక్తిత్వాన్ని అతడి ప్రాంతమూ, పరిస్థితులూ ప్రభావితం చేస్తాయనటానికి యింత కంటే బలమైన రుజువేముంది?** ❋

## వసంతాల మేనా

కవిత

**ఈతకోట సుబ్బారావు**
94405 29785

పలుకు తేనెల జడివాన
కురిపించి ఎద ఎదలోన
సాహితీ సుగంధాలు చిలికి చిలికి
మమతలు పంచు మధుర తరుణాన
తెలుగు మాతల్లికి వసంతాల మేనా.

నానుడుల ఇక్షురస ఝరి
తెలుగు తేటల అమృత మాధురి
జాను తెలుగు పలుకుబడిలో
నుడికారాల తడిరాగాల తరి
తెలుగు మాతల్లికి వసంతాల మేనా.

అష్టావధాన పద సమరోత్సవం
సావధాన ప్రక్రియా రసమాధుర్యం
అశుకవితా చమత్కారకేళిలో
వచన కవితా పరిమళం వీచు సమయం
తెలుగు మాతల్లికి వసంతాల మేనా
ఐతరేయ ఐతిహ్యాల నాటి పురాభాష
దేశభాషలకు రాష్ట్రాలు చూపిన యోష
తెలుగు మాతల్లికి వసంతాల మేనా!

అమ్మనుడిపై నెనరు లేనివాడు
కన్నతల్లినీ, పుట్టిన నేలనీ ప్రేమించలేడు..

తెలుగులో సంతకం..
తెలుగుదనానికి సంకేతం

–అడపాల సుబ్బారెడ్డి,
9346814601

# ఒడిశాలో తెలుగు రచయిత ఆనందరావు పట్నాయక్‌తో...

**మన పొరుగునే వున్న ఒడిశా రాష్ట్రంలోని రాయగడ తెలుగువారి నెలవుల్లో ప్రముఖమైనది. అక్కడ ప్రసిద్ధుడైన తెలుగు రచయిత ఆనందరావు పట్నాయక్ గారు. రెండు కథాసంపుటాలను, మూడు నవలలను ప్రచురించారు. 350కి పైగా కథలు, కవితలు, వ్యాసాలు, సాహితీ విమర్శలు, సమీక్షలు వ్రాశారు. జాతీయ అంతర్జాతీయ స్థాయిల్లో జరిగిన అనేక పోటీల్లో ఉత్తమ కథారచయితగా చాలాసార్లు ఎంపికయ్యారు. రాయగడ రచయితల సంఘానికి అధ్యక్షులు కూడా. అనేక పురస్కారాలను, సన్మానాలను పొందిన ఆనందరావుగారు గ్రిడ్ కార్పొరేషన్ ఆఫ్ ఒడిశాలో ఆర్థిక నిర్వహణాధికారిగా ఉద్యోగ విరమణ చేశారు. 1941 డిసెంబరు 30న పుట్టారు. ఆయనతో అమ్మనుడి ప్రతినిధి అడపాల సుబ్బారెడ్డి మాటా మంతీ ఇది...**

**సుబ్బారెడ్డి :** నమస్కారమండి. ముందుగా మీ పేరు గురించి చెప్పండి. పట్నాయక్ అనేది ఓఢ్రుల పేరు కదా, తెలుగువారైన మీకు ఆ పేరు ఎట్లా వచ్చింది?

**పట్నాయక్ :** పట్నాయక్ అనేది ఒక కులవాచకం. దీనిని తెలుగు వారు, ఓఢ్రులు ఇద్దరూ పెట్టుకొంటారు. మేము శిష్టకరణాలం. తరతరాలుగా గ్రామకరణీకం మా కులవృత్తి. రాయగా రాయగా కరణం అంటారు కదా! అలా సర్కారు లెక్కలూ, ఆస్తి పత్రాలూ, జనాభా సేకరణా వంటి పనులను చేసేవారే శిష్టకరణాలు. శిష్ట కరణాల మూలం గౌడదేశం. అంటే ఇప్పటి బెంగాల్ అని పరి శోధకుల మాట. ఈ కులం దేశంలోని చాలా రాష్ట్రాలలో ఉంది. చాలా భాషలవారిగా శిష్టకరణాలు ఉన్నారు. మేము తెలుగువాళ్లం. ఓఢ్రులు అడిగినప్పుడు మేము తెలుగు పట్నాయకులం అని చెప్పు కొంటాం. ఇప్పుడిప్పుడు ఓఢ్ర పట్నాయకులతో సంబంధాలు కలుపు కొంటూ ఉన్నాం. మావన్నీ ఋషిగోత్రాలు. మాది భరద్వాజ గోత్రం.

**సుబ్బా :** ప్రపంచంలో 'ఇంటిపేరు'ను కలిగిన కొద్ది భాషాజాతులలో తెలుగువారు ఒకరుకదా. మీకూ ఇంటిపేర్లు ఉన్నాయా?

**పట్నా :** ఎందుకు లేవు? మేమూ తెలుగువాళ్లమే కదా. మా ఇంటిపేరు 'బోగిల'. మా కరణాల లోనే ఇక్కడున్న కొన్ని ఇంటిపేర్లు: గొడబ, కరకవలస, బలివాడ, వాల్తేరు, నంది గామ, కుప్పిలి, ఉరిటి.

**సుబ్బా :** మిగిలిన తెలుగు కులాల వాళ్లందరికీ ఇక్కడ ఇంటిపేర్లు ఉన్నాయా? ఉన్నవాటిని వాడుతున్నారా?

**పట్నా :** తెలుగువాళ్లందరికీ ఇంటిపేర్లు ఉన్నాయి. ఇదివరకు అన్ని చోట్లా బాగా చెప్పుకొనేవారు, రాసుకొనేవారు. రాను రాను ఇంటిపేరు వాడకం తగ్గిపోతున్నది. కేవలం పెళ్లిపత్రికలలో మాత్రమే ఇంటిపేర్లు కనిపిస్తున్నాయి ఇప్పుడు.

**సుబ్బా :** మీరు పుట్టిపెరిగిందీ, మీ పూర్వీకులదీ రాయగడేనా?

**పట్నా :** మా నాన్నగారిది ఇప్పటి ఆంధ్రప్రాంతం. మా అమ్మగారిది ఇప్పటి ఒడిశా. పాత రోజుల్లో ఇద్దరి ఊర్లూ మద్రాసు రాష్ట్రంలోనే, విశాఖ జిల్లాలోనే ఉండేవి. మా నాన్నగారు 1936 ప్రాంతంలో రాయగడకు ఉద్యోగం కోసం వచ్చారు. ఇక్కడే పెళ్లిచేసుకొని ఇక్కడే కుదురుకొన్నారు.నేను 1947లో ఇక్కడే పుట్టాను. ఇక్కడే పెరిగాను. ఇక్కడే ఉంటున్నాను.



రాయగడలో తెలుగే పెద్ద భాష అయినా, ఇక్కడ ఓఢ్రులూ ఉన్నారు. మాది రెండునుడుల ప్రాంతం. అయినా నాకు ఎందుకనో తెలుగు మీద మక్కువ ఎక్కువ. చిన్నప్పటి నుంచీ అంతే. అందుకు కారణం, ఆ రోజుల్లో రాయగడ వాతా వరణమంతా తెలుగుమయంగా ఉండేది. ఎటు చూసినా తెలుగు సాహిత్యం, కళలు, సమావేశాలే. బడీ గుడీ అంతా తెలుగే. సినిమాలు కూడా తెలుగంటే మక్కువను పెంచాయి. శ్రీశ్రీ, దాశరథి, కొసరాజు వంటి మహామహుల పాటలు ఒక్క తెలుగువారినే కాదు, ఒడియావారిని కూడా మురి పించేవి. భాష అర్థంకాని వారుకూడా మన తెలుగు పాటల దరువుకు తలలనూపేవారు.

**సుబ్బా :** ఇదంతా ఇక్కడ ఎప్పటివరకూ కొనసాగింది?

**పట్నా :** 50వ దశకం చివరివరకూ బాగా కొనసాగింది. తరువాత 70 వ దశకం వరకూ కూడా కొంత కొనసాగింది. ఆ తరువాతనే కుంటుపడింది. అప్పుడయితే ఇక్కడ దొరకని

తెలుగు పత్రిక లేదు. హరికథలూ, బుర్రకథలూ నాటకాలూ జోరుగా సాగేవి. నాజర్, నాగభూషణం, కనకం, సూరి బాబు, సీత వంటి కళాకారులెందరో ఈగడ్డమీద ప్రదర్శనలు ఇచ్చారు. రక్తకన్నీరు నాటకానికి ఆ రోజుల్లోనే వెయ్యి రూపా యలకు పైగా వసూలు అయిందిక్కడ. జాతరలు తెలుగు దనంతో తొణికిసలాడు తుండేవి. ఆంధ్ర జాలరి సంపత్ కుమార్ గారి జాలరినృత్యాన్ని చూడడానికి జనం ఎగబడే వాళ్లు. తెలుగువారితో పాటు ఓఢ్రులు కూడా తెలుగుకళల తీపికోసం ఎగబడేవాళ్లు. అంతా అంగరంగ వైభవంగా ఉండేది. వానాకాలంలో పొంగిపొరలే ఏరులా ఉండేది ఒకప్పుడు ఇక్కడి తెలుగు. ఇప్పుడు ఆ ఏరు ఎండిపోయింది అని చెప్పలేను కానీ, ప్రవాహం బాగా బక్కచిక్కిపోయింది.

**సుబ్బా :** 1936లో ఒడిశా రాష్ట్ర ఏర్పాటప్పుడు మీ తావు, అంటే పాత గంజాం కోరాపుట్టి జిల్లాల్లో ఒక తత్తరపాటు కలిగింది కదా, దానిని వివరించగలరా?

**పట్నా :** అది వట్టి తత్తరపాటు కాదు, కొన్ని లక్షల తెలుగుగొంతులకు ఉరి బిగుసుకుపోయిన ఘోరఘటన. గుర్తుంచుకోండి, మన దేశంలో తొలి భాషారాష్ట్రం ఆంధ్రకాదు, ఒడిశా. పాత కలకత్తా, మద్రాసు రాష్ట్రాలలోని కొన్నిప్రాంతాలను విడదీసి, ఒకటిగా కలిపి ఏర్పరచినదే ఇప్పటి ఈ ఒడిశా. అప్పుడు 22 శాతం మంది తెలుగు ప్రజలు ఇక్కడ ఉండిపోయారు. వాళ్లు అందరూ ఎక్కడినుంచో వలసవచ్చినవారు కాదు. ఈ మట్టిమనుషులే, ఈ ప్రాంతాలన్నీ ఒడిశాలో కలిసిపోవ డానికి ప్రధానకారణం, అప్పటి పర్లాకిమిడి రాజైన కృష్ణ చంద్ర గజపతి రాజు. ఆయనే 1936లో ఒడిశాకి మొదటి ముఖ్యమంత్రి. ఆయన ఎంతటివారంటే, తన సొంత డబ్బును ఖర్చుచేసి లండన్ సభలకు వెళ్లేవాడు. తెల్లవాళ్ల ప్రాపుకోసం వెంపర్లాడేవాడు ఆయన. బ్రిటిష్ దొరతనం దగ్గర గట్టి పలుకుబడిని కలిగి ఉండేవాడు. అటువంటి వాడు, పాత గంజాం కోరాపుట్టి జిల్లాలను (ఇప్పటి గంజాం, గజపతి, కోరాపుట్టి, రాయగడ, మలకనగిరి, నవరంగపూరు జిల్లాలు) ఒడిశాలో కలుపుకొనడానికి పూనుకొన్నాడు. దానిని ఎదిరించి పోరాడినవాడు, సామాన్య బడిపంతులూ బడుగు బ్రాహ్మడు అయిన గిడుగు రామమూర్తిగారు. ఆయన బడిపంతులే కావచ్చు కానీ ఉక్కుపిండం. ఒకవైపు సామాన్యుడు, మరొకవైపు సామ్రాజ్యవాదుల తొత్తయిన రాజు. పొట్టేలు కొండను ఢీ కొన్నట్లు ఢీ కొన్నారు గిడుగు వారు. ఏమయింది? రాజే నెగ్గాడు. రెండు రాష్ట్రాల మేరల లోని మహేంద్రతనయ నదిలో జలధార విడిచి, 'తల్లీ నీకూ నాకూ చెల్లు' అని అవతలివేపుకు బండెడు దుఃఖంతో వెళ్లిపోయారు వారు. మేరలకు అటూ ఇటూ గా విడిపోయిన తెలుగుజాతికి ఇదో పెద్దదెబ్బ. మా పరిస్థితి మరీ ఘోరం, చెంపదెబ్బా గోడదెబ్బా అన్నట్లు అయింది.

**సుబ్బా :** ఇంత తెలుగుదనానికీ ఇందరూ తెలివిపరులకూ నెలవైన ఈ తావు, అంత సులువుగా పోరాటం లేకుండా లొంగి పోయిందా?

**పట్నా :** పోరాటం జరగలేదని ఎందుకు అనుకొంటున్నారు. ప్రజలు వీధులకెక్కారు. లాఠీచార్జీలు జరిగాయి. తెలుగు నాయకత్వం కూడా నడుము కట్టుకొని పోరాడింది. జయపురం రాజు విక్రమదేవ వర్మకు తెలుగంటే ప్రాణం. ఆయనా, గౌతు లచ్చన్నా, నీలం సంజీవరెడ్డి వంటి నాయకులు ఈప్రాంతాల కోసం గట్టిగానే గొంతులు విప్పారు. అయితే అవేవీ పర్లా కిమిడి రాజు వేసిన ఎత్తుగడల ముందు నిలువలేక పోయాయి. చతురుడైన గజపతి, మందస, సోంపేట రాజులని తన డబ్బుతో బుట్టలో వేసుకొన్నాడు. ఆ డబ్బుతోనే బ్రిటిష్ పార్లమెంటులో తన పంతాన్ని నెగ్గించుకొన్నాడు. ఆయన బ్రిటిష్‌వారికి చెప్పిన చివరి సాకును వింటే, ఆయనెంత క్రూరుడనేది మీకు తెలుస్తుంది. తెలుగువారికి రాజమండ్రి లోనూ, బెంగాలీలకు ఆలీపూర్‌లోనూ సెంట్రల్ జైళ్లు ఉన్నాయి. ఓఢ్రులకు బరంపురంలో మాత్రమే సెంట్రల్‌జైలు ఉంది. కాబట్టి బరంపురం ఒడిశాలో ఉండాలని ఆయన అభ్యర్థన. స్వతంత్రం కోసం పోరాడుతున్నవారిని నేను ఓ కంట కనిపెడతాను అనే ధ్వనిని బ్రిటిషువారికి అందించాడు ఆయన. తెలుగువాళ్లు అప్పటికే స్వతంత్ర పోరాటంలో ముమ్మరంగా ఉన్నారు. అందుకే బ్రిటిషువారికి ఈ ప్రతి పాదన అమోఘం అనిపించింది. కంచే చేనును మేసినట్లు, రక్షించాల్సిన రాజే, విద్యాలయాల కోసమో వైద్యాలయాల కోసమో కాకుండా చెరసాల కోసం ప్రాంతాన్ని అడిగినాడు. అధికసంఖ్యాకులైన తెలుగుప్రజల ముక్కుపిండి వసూలు చేసిన పన్ను డబ్బులతో ఖరీదైన రోల్స్ రాయిస్ కార్లను కొని, దిగుమతి చేయించి, తెల్లదొరలకు కానుకలు ఇచ్చే వాడు. మొత్తానికి సాధించుకొన్నాడు.

**సుబ్బా :** విడిపోయిన తరువాత ఇక్కడి తెలుగువారి పరిస్థితి?

**పట్నా :** ఇందాకే అన్నాను కదా, మాది చెంపదెబ్బా గోడదెబ్బా పరి స్థితి అని. అలాగే జరిగింది. ఆ దెబ్బ కాలంతోపాటు మాని పోయుండాలి. మానలేదు సరికదా రానురాను పెరిగింది. తెలుగు బడులలో ఒక మేస్టరు రిటైరయ్యాక కొత్తవారిని నియమించకపోవడం దగ్గరనుంచి, కరణీకం, న్యాయ వ్యవస్థ, పోలీసు ఉద్యోగాలు ఇలా అన్నింటిలోనూ చిన్నదో



రాయగడ రైల్వేస్టేషన్‌లో నేటికీ వున్న తెలుగు పేరు పలక

# 'కళింగనాడు ఏర్పాటుతోనే ఆ తావుకు వెలుగు'

**"విశాఖపట్నం, గంజాం జిల్లాలను కలిపి ఒక విడినాడుగా ఏరుపరచండి, అప్పుడది కళింగనాడు అవుతుంది. అక్కడి కొండలలో పుట్టిన ఏరులు, అక్కడి కడలిలోనే కలుస్తాయి. కళింగానికి విడినాడుగా ఉండడానికి కావలసిన వనరులు అన్నీ ఉన్నాయి"**

మదరాసు చట్టకొలువులో జయపురం రాజా విన్నవించుకొన్నది ఇది. ఆయన అడిగిన ఆ తావు ఇప్పుడు, ఆంధ్ర, ఒడిశా అనే రెండునాడులలో రెండుముక్కలయి చీలిపడి ఉంది. ఇటు శ్రీకాకుళం, విజయనగరం, విశాకలుగా, అటు మలకనగిరి, కోరాపుట్టి, రాయగడ, నవరంగపూరు, గజపతి, గంజాంలుగా ఇప్పుడున్న తావు అది. ఆ ఆరే కాదు, కందమల పెనువంటెం (జిల్లా) కూడా ఆంధ్రలో ఉండుండ వలసినదే. తెలుగుకు తోడబుట్టులు అయిన కుయి, కువి నుడులను మాటలాడేవారు నూటికి అరవయిమంది ఉన్నారు కందమలలో ఇప్పటికీ.

ఆంధ్రలో కలవకపోయినా, విడిగా కళింగనాడుగా అయినా ఏరుపడి ఉండవలసింది. కానీ అంత తెలుగునేల, ఇప్పటి ఒడిశాలో కలసిపోయింది. కలిసితే ఏమయింది అంటారా? వినండి.

గొప్పదయిన కళింగ తెలుగు మెలన (చరిత్ర) నంతా గుండుగుత్తగా ఒడియావారు సొంతం చేసేసుకొన్నారు. పెరతావుల వారికి కళింగమంటే ఇప్పటి ఒడిశానే, అదంతా ఓఢ్రుల నాగరికతే. ఆంధ్రులకు కొద్ది తావు మిగిలినా, కళింగం తెలుగుతావే అని తెలుగు తెలివిపరులు లోకానికి చాటలేదు.

అశోకుడిని ఎదిరించిన రాణిపేరు కారవాకి. నట్టుతనం (ఇంపీరియలిజం) కు ఎదురొడ్డి నిలిచిన ఆ తల్లి, 'కారమ్మ' అనే పల్లెవేలుపయి కళింగపు తెలుగు పల్లెలలో ఇంకా కొలువయి ఉంది. కారమ్మను ఓఢ్రులెవరూ కొలువరు. ఈ ఒక్క మచ్చు చాలదా, అశోకుడిని ఎదిరించినవారు తెలుగువారే అని చెప్పడానికి. కానీ ఇప్పుడా పెరిమ మనది కాదు, ఓఢ్రులది.

శ్రీలంక 'కండి'లో దరదమాళిగ అనే బుద్ధుని గుడి ఉన్నది. బుద్ధుని పల్లు (దంతం)ను దాచి ఉంచిన గుడి అది. ఆ పల్లు దంతపురం నుండి కండికి పోయింది. దంతపురం ఇంకా ఆంధ్రలోనే ఉంది. అయినా శ్రీలంక బుద్ధ తిరిపరుల (బిక్షువుల) నుండి అరయికరుల (పరిశోదకుల) వరకు, దరదమాళిగ గుడి మెలన అంతా ఇప్పటి ఒడిశాకు చెందినదే. కళింగం అంటే తెలుగుతావు అని వాళ్లకు చెప్పేవాళ్లే లేరు.

తెలుగు గంగదొరలు కట్టించిన పూరీ కోణార్క గుడులు లోకాన్ని నివ్వెర పరుస్తూనే ఉన్నాయి. ఆ కట్టుబడి గొప్పతనమంతా ఇప్పుడు ఓఢ్రులది. తెలుగుదొరలు కట్టించిన తెలుగుగుడులలో, తెలుగు ఆటవెలదులు ఆడిన ఆటలకు ఇప్పటిపేరు ఒడిస్సీ. ఈ తేతెయ్య (నాట్యం)కు అంటే ఒడిస్సీకి, రెండువేల ఏండ్ల మెలన ఉందని చాటుకొంటున్నారు వాళ్లు. మనకేమో పట్టదు. ఒడిస్సీ అనే పేరు వచ్చిందే నలబయి ఏబయి ఏండ్ల కిందట. కావేరి దరి తెలుగు దాసియాటం 'బరతనాట్యం' అయినట్లే, మహానది మాగాణపు తెలుగు వెలదియాట 'ఒడిస్సీ' అయిపోయింది.

ఒకటా రెండా, వేల ఏండ్ల తెలుగు మెలనను 1936లో మూటకట్టి ఓఢ్రులకు అప్పగించినాము. కోరాపుట్టి, గంజాములు ఇటు ఉండి ఉంటే, ఓఢ్రుల చొరబాటుకు సుంతయినా అడ్డుపడి ఉండేవి.

మెలనను పక్కనపెట్టి బతుకును చూద్దాం. మనదేశంలో ఎక్కువ వానపోత (వర్షపాతం) తావులలో కళింగం ఒకటి. వంశదార, నాగావళి, జంజావతి, మహేంద్రతనయ, రుషికుల్య, ఇంద్రావతి, కొలాబ, శబరి, సీలేరు వంటి ఎన్నో ఏరులకు పుట్టినిల్లు ఆంధ్రులు వదులుకొన్న కళింగం. వీటిలో చాలా ఏరులు ఇప్పటి ఒడిశాలో పుట్టి. ఇప్పటి ఆంధ్ర తావున కడలిలో కలుస్తాయి.

ఇంత వానపోత, ఇన్ని ఏరులు ఉండి కూడా కళింగం ఎందుకు వెనుకపడింది? కొంగొత్త తెలుగు నుడీనానుడు లకు పునాది వేసిన గిడుగూ గురజాడలు నడయాడిన తావు, ఏడాదికి ఏడెనిమిది నెలలు పొంగిపొరలే ఏరులతో నిండిన తావు, అశోకుడి తరి నుండీ సోంపేట బీలనేలల దాకా పెత్తనం చేయాలని వచ్చినవారిని ఎదిరించి నిలిచిన తావు, వేల ఏండ్ల నాగరికతలో మెలగిన నిండు గుండెల మంది ఉన్న తావు, ఇప్పుడు లేమితో ఎందుకు కునారిల్లుతున్నది? పిడికెడు కూటికోసం పొట్టచేతపట్టుకొని పల్లెలకు వలసపోతున్న తావుగా ఎందుకయింది? కళింగం అంటే 'గుడ్డ' అని ఒక తెల్లము. మానం మీదకు మూరెడు గుడ్డ కోసం తల్లులు అల్లాడుతున్న తావుగా కళింగం ఎందుకు మారిపోయింది?

ఒకే ఒక పెద్ద కారణం, ఆ తావు చీలి రెండు విడివిడి నాడులలో ఉండిపోవడం వలన. ఒకేనాడుగా ఉండుంటే ఏటినీటి గొడవలు వచ్చి ఉండేవి కాదు. వాళ్ల గొంతుల చేవ పెరిగి చట్టకొలువులలో వారి నిక్కచ్చు (డిమాండ్) లను నెరవేర్చుకొని ఉండేవారు. దీని గురించే జయపురం రాజాగారు గొంతెత్తి చెప్పింది, కళింగనాడు కావాలని.

**కళింగానికి తొలివెలుగులు దక్కాలంటే అటున్న ఆరూ ఇటు కలవాలి. లేదా అటున్న ఆ ఆరూ ఇటున్న ఈ మూడూ కలిసి కళింగనాడు ఏరు పడాలి. అందుకు అక్కడి తెలివిపరులే పూనుకోవాలి.**

**-స.వెం.రమేశ్**

పెద్దదో వివక్ష కొనసాగింది. పర్లాకిమిడి దగ్గర 'చీకటి' అనే ఊరుంది. ఆ వూర్లో ప్రత్యేకంగా 'తెలుగు టీచర్స్ ట్రైనింగ్ స్కూల్' ఉండేది. పోరాటమప్పుడు మూతపడిన ఆ స్కూల్ తిరిగి తెరుచుకోనేలేదు. నూతక్కి రామశేషయ్య గారిలాంటి వారు ప్రజాప్రతినిధులుగా ఉండి కూడా ఏమీ చేయలేకపోయారు. అన్నిటికన్నా పెద్ద బాధ ఏమిటంటే, 22 శాతం మంది తెలుగువారు, పుట్టినగడ్డమీదనే రాత్రికి రాత్రే పరాయివారయి పోయారు. రానురాను ఓఢ్ర నిబంధనలు పెరిగాయి. ఒక చిన్న ఉద్యోగం కావాలన్నా ఒడియాలో కనీసం మెట్రిక్యులేషన్ పాస్ అవ్వాలి. అప్పటికే ఉద్యోగా

లలో ఉన్నవాళ్లు కూడా ఇంక్రిమెంటు కోసమో ప్రమోషను కోసమో ఒడియా పరీక్షను రాయవలసి వచ్చింది.

తొండముదిరి ఊసరవెల్లి అవుతుందంటారే, అట్లా ఆ వివక్ష పెరిగి పెరిగి 'సన్ ఆఫ్ ద సాయిల్' అనే నినాదం వచ్చింది. ఈ ప్రాంతాలలోని తెలుగువారంతా వలసవచ్చిన వారేననీ, స్థానికులైన ఓఢ్రులకే ఉద్యోగావకాశాలు దక్కాలనీ ఆ నినాద లక్ష్యం. ఆ గొడవల్లో విలవిలలాడిన వారు ఈ వెంకట నర్సింగారావు గారు. అప్పటి అనుభవాన్ని వారే చెప్తారు వినండి. వారు మంచి రచయిత కూడా.

**వెంకట నర్సింగారావు** : ఏదైనా ఒక గుంపుకు చెందిన మనిషి ఒకడు తప్పు చేస్తే, దాని ప్రభావం ఆ గుంపుమీదంతా ఉంటుంది. కానీ ఏ వ్యక్తీ ఏ తప్పు చేయ కుండానే తెలుగు సమాజమంతా ఇబ్బంది పడిన రోజులవి. ఈ మట్టి బిడ్డలకే అన్ని హక్కులూ అంటూ ఓఢ్రులు తెగబడిన రోజు లవి. మేమూ ఈ మట్టి బిడ్డలమే మొర్రో అని మొరపెట్టుకొన్నా మాది అరణ్యరోదనే అయిన రోజులవి. ఎన్నో గొడవలు, ఎన్నో అల్లర్లు, ఎన్నెన్నో తగవులు. నా స్వానుభవాన్ని వినండి. నేనప్పుడు సునాబేడా అనే ఊరిలో ఉండేవాడిని. ఆ వూరి లోని సంస్థలో మొట్టమొదట దేశీయ విజ్ఞానంతో



**"ఏ నాగరిక భాషకైనా దాని వైభవమంతా అక్షరంతో ముడిపడి ఉంటుంది. అక్షరం లేని భాష నాగరిక భాష అనిపించుకోదు. పూర్వంలాగా తెలుగు బడులు పెరగాలి. మూయకుండా ఉన్న తెలుగు బడులలో పంతుళ్లను నియమించాలి. ఇక్కడ తెలుగును నేర్చు కోవాలనుకొంటున్న వారు ఉన్నారు. నేర్పేవారే లేరు. మాది ఒక్కటే కోరిక. మాకు తెలుగును నేర్పే పంతుళ్లను ఇవ్వండి, మా బడులను నిలబెట్టండి చాలు".**

విమానం ఇంజిన్ తయారయింది. దాని తయారీలో పాల్గొన్న సాంకే తిక నిపుణులలో తెలుగువారు ఎక్కువ. అందులో నేనూ ఒకడిని. పంజాబీలూ మలయాళీలూ ఓఢ్రులు కూడా ఉండే వారు. ఓఢ్రుల లెక్క తక్కువ. అయితే దానిని తయారు చేసిన గొప్పతనాన్నంతా ఒక ఒడియా వానికి కట్టబెట్టారు. అతనే దానిని స్టార్ట్ చేయాల అనేశారు. ఏళ్ల తరబడి ఉమ్మడి శ్రమ, ఒక్కరి గుత్తాధిపత్యం అయి పోతున్నదే అని మా ఆవేదన. అప్పుడు ఈ 'మట్టి బిడ్డల' ఉద్యమం సాగుతున్నది. నేను ఎదురుతిరిగి ప్రశ్నించాను. అంతే గొడవకు దిగారు, చిలికి చిలికి గాలివాన అయినట్లు కొట్లాటకు కూడా తెగ బడ్డారు. నేను ప్రాణాలను అరచేత పట్టుకొని విజయ నగరంకు రాత్రికి రాత్రే పారిపోయాను.

## కిళ్ళంశెట్టి వెంకటరమణ రచయిత, ఒడియా- తెలుగు నిఘంటు కర్త, జయపురం

ఒడిశా తెలుగువారి భాషాదుస్థితికి కారణం ఇప్పటిది కాదు. పర్లాకిమిడి రాజా ఎంతటి ఒడియా అభిమానో, జయపురం రాజా అంతటి తెలుగు అభిమాని. విశాఖపట్నంలోని ఆంధ్రాయూనివర్శిటీ భవనం వీరిదే కదా. జయపురం రాజూ గిడుగు రామమూర్తి గార్లు మంచి మిత్రులు. గిడుగువారు వ్యావహారిక భాషావాది అయితే, రాజావారు గ్రాంధిక భాషాభిమాని. ఆ మనస్తత్వం వల్లనేమో రాజావారు సామాన్య తెలుగుజనంతో మమేకం కాలేకపోయారు. పర్లాకిమిడి రాజుకు ఎదురు నిలిచి పోరాడడంలో రాజావారికి ఇదొక సమస్య అయింది. ఆయన ప్రయత్నం అరకొరగా మిగిలిపోయింది. ఇది ఒకవైపు అయితే, రాష్ట్రం విడిపోయాక ఆంధ్రుల పట్టనితనం మాకు పెద్ద చెంపపెట్టు అయింది. పట్టించుకోకపోగా కొందరు ఆంధ్రులు అయితే ఈ ప్రాంతాన్ని ఈసడించుకొన్నారు. ఒక్క ఉదాహరణ చెప్తాను. పెనుమత్స సత్యనారాయణ రాజు అని ఒకాయన ఆంధ్రదేశం నుంచి వచ్చి, ఇక్కడే రాజుగారి భూములను చూసుకొంటూ 20, 25 ఏళ్లపాటు ఉన్నారు. ఆ తరువాత తిరిగి ఆంధ్రదేశానికి వెళ్లిపోయారు. ఆయన ఒకరోజు ఆంధ్రప్రభ పత్రికలో 'ఓఢ్రులకు నాగరికత లేదు, అంతా గిరిజనులే, బట్టలు కట్టుకోవటం కూడా రాదు' అని రాశారు. ఆయన ఇక్కడ 20, 25 ఏళ్లు ఉన్నారు, తెలియక ఏమీ కాదు. ఆదివాసులైన ఆ గిరిజనులు ఒడియాకంటే తెలుగువైపే మొగ్గుచూపి, మన మాటలను నేర్చుకొంటారు. ఇదంతా తెలిసే రాశారు వారు. ఆ వ్యాసాన్ని చూసి, ఇక్కడి ఓఢ్రులు దొమ్మీచేసి, కొన్నాళ్లపాటు తెలుగు వ్యాపార సంస్థలనీ బడులనీ మూయించారు, తెలుగువాళ్లపైన రాళ్లు రువ్వేవారు. ఇటువంటి గొప్పపనులను చేయడంలో మనకు మించినవారు మరొకరు లేరు.

## మజ్జి ఈశ్వరరావు, రైతు, జానపద కళాకారుడు

వంగపండు ప్రసాద్, గద్దర్, శ్రీశ్రీ వీరందరినీ ఇష్టపడేవాడిని. ఏకపాత్రలు వేయడం, పాటలు పాడడం నాకు ఇష్టమైన పని. ఎన్నో ఏళ్లుగా ఈ ప్రవృత్తితో తెలుగు ప్రచారం చేస్తున్నాను. తెలుగువారి పట్ల చాలా వివక్ష ఉంది ఇక్కడ. తెలుగు కళలకూ కళాకారులకూ ఓఢ్రప్రభుత్వాల ఆదరణ లేదు. తెలుగు ప్రజల ఆదరణతోనే ఇన్నాళ్లూ ప్రదర్శనలను ఇచ్చాం. ఇప్పుడు వారి ఆదరణ కూడా తగ్గింది. అందుకు ఎన్నో కారణాలున్నా ప్రధానమైనది తెలుగు బడులు తగ్గడం. తెలుగువారంతా ఒడియా బడులవైపుకు పోలోమని మరలిపోతున్నారు. దాంతో ఈతరం తెలుగువారికి తెలుగు మాటా తెలుగు పాటలలోని తియ్యదనం తెలియడం లేదు. వారు చదువుతున్న పుస్తకాలలో ఒడియా భాషాసంస్కృతుల గొప్పతనం గురించే ఉంటుంది కానీ, తెలుగు గురించి ఉండదు కదా. అందుకే తెలుగు కళలకు ఆదరణ తగ్గిపోతున్నది. తెలుగు బడులు పెరిగితే కానీ ఈ చిక్కును తప్పించుకోలేము.

అప్పుడు ఎక్కడ ఏ గొడవ జరిగినా, అది తెలుగువాళ్లనే గురిగా చేసుకొని జరిగేది.

**సుబ్బా :** ఇదంతా. ఎప్పుడు సద్దుమణిగింది?

**పట్నా :** గత ఇరవై ఏళ్లుగా గొడవలు లేవు, అయితే సమస్య సద్దు మణిగింది అంతే, చల్లారిపోలేదు. నివురుగప్పిన నిప్పులా ఉంది. అది మళ్లీ ఎప్పుడైనా రాజుకోవచ్చు. గొడవలు సద్దు మణగడానికి కారణం కూడా తెలుగువాళ్లమే. మేమే ఒదిగి ఒదిగి ఉండిపోయాం. తరువాత తరువాత తెలుగువాళ్ల అవసరం ఓఢ్రులకు తెలిసివచ్చింది. ఉద్యోగ వ్యాపార రంగాలలో తెలుగువారి నేర్పరితనం వాళ్లకు కావలసి వచ్చింది. ఓఢ్ర మేధావులు కూడా సామరస్యానికి సహక రించారు. సాహితీ సమావేశాలూ సభలు వంటివి జరిపాం. వాటికి ఓఢ్రులను కూడా పిలిచాం, మేమూ మీలో భాగమే అని వివరించాం. దక్షిణ ఒడిశా ఎదుగుదలలో తెలుగు వారి పాత్ర చాలా పెద్దదని వాళ్లు గుర్తించారు. గుంభనంగా సాగిపోతూ ఉన్నాం.

**సుబ్బా :** మీ రా.ర.సం. (రాయగడ జిల్లా రచయితల సంఘం) కార్యక్రమాలను చెప్తారా?

**పట్నా :** వార్షికోత్సవాలు, సాంస్కృతిక కార్యక్రమాలు, గొప్పవారి జయంతులూ వర్ధంతులూ వంటి పనులను చేస్తున్నాం. ఆంధ్రప్రాంతం నుంచి గొప్పవారిని అతిథులుగా పిలిచి, వారిని గౌరవించుకొంటున్నాం. మా సంఘంలో ఇరవై మంది రచయితలు ఉన్నారు. అందులో పదిమంది కొత్త తరం వారు. కథలూ కవితలూ వ్యాసాలూ వంటి పలు ప్రక్రియలలో రా.ర.సం. నుంచి రచనలు వస్తున్నాయి. మన తెలుగువారిని చూసి, ఆ స్ఫూర్తితో ఇక్కడి ఒడియావారు కూడా 'అమక్కొటి' (కష్టజీవులు) అనే రచయితల సంఘాన్ని ఏర్పాటు చేసుకొన్నారు. ఇటీవల మేము చేసిన మరొకపని– తమిళనాడులోని తెలుగు బడులను మూసివేయద్దని కోరుతూ ఆ రాష్ట్ర ముఖ్యమంత్రి అయిన జయలలితగారికి విన్నపం పంపాము. తమిళనాడు తెలుగువారు అక్షరం కోసం ఎంతగా తపిస్తున్నారో చూస్తున్నాం. ఆ నొప్పిని మేము బాగా గ్రహించ గలం. మాకూ అలాంటి దెబ్బలు తగిలాయి కాబట్టి.

**సుబ్బా :** రాయగడలో తెలుగువాళ్లు ఎంతశాతం ఉండవచ్చు?

**పట్నా :** మొత్తం ఒడిశాలో తెలుగువారు 22% ఉన్నారని తెలుగు సంఘాలవారి అంచనా. అంటే దాదాపు కోటిమంది. వీరిలో ఎక్కువమంది దిగువ ఒడిశాలో ఉంటారు. తెలుగువారు కాకుండా తెలుగుకు దగ్గరగా ఉండే గదబ, కుయి, కువి వంటి ద్రావిడ భాషలను మాట్లాడుతున్న ఆదివాసుల సంఖ్య కూడా పెద్దదే. ఒక్క కందమల జిల్లాలో మాత్రమే 'కుయి' భాషను మాట్లాడుతున్నవారు 52% ఉన్నారు. రాయగడ పట్టణంలో అయితే మూడువంతులు తెలుగువారే.

సుబ్బా : తెలుగువాళ్లలో ఏఏ కులాలవారు ఉన్నారు?

పట్నా : శ్రీకాకుళం, విజయనగరం, విశాఖపట్నం జిల్లాలలో ఉండే తెలుగుకులాలన్నీ ఇక్కడా ఉన్నాయి. ఒక్కటి గుర్తించండి, శ్రీకాకుళంకీ గంజాంకీ విశాఖపట్నంకీ కోరాపుట్టికీ పెద్ద తేడా ఏమీ ఉండదు. అంతా ఒకనేలే. నిన్న మొన్న ఏర్పడిన మేరలే ఇవన్నీ.

**సుబ్బా :** మీ ప్రాంతపు మాండలికంలో రచనలు ఏవైనా వస్తు న్నాయా?

**పట్నా :** ఏవో కొద్ది తేడాలు తప్ప, మా పలుకుతీరు అంతా కళిం గాంధ్ర మాండలికమే. అయితే మీరన్నట్లు, మా దగ్గరనుంచి మాండలిక రచనలు రావడం లేదు. ఒకరిద్దరం అక్కడక్కడా ఒకటీ అరా పాత్రలకు వాడుతున్నాం కానీ, మొత్తం మా మాండలికంలో రాసిన రచనలు రాలేదు. మేము అటు తెలుగుకూ ఇటు ఓఢ్రానికీ కాకుండా పోయినవాళ్లం కదా. మా పలుకు తీరులో రాస్తే ఆంధ్రులు మా రచనలను పక్కన పెట్టేస్తారేమోననే భయం కూడా ఉండి వుండవచ్చు. మీ మాటల్లో – అంటే పత్రికల భాషలో రాస్తేనే మీ తలకు ఎక్కుతుందనీ, మా గురించి పట్టించుకొంటారనీ అలా రాస్తుండచ్చు. మాకు తెలుగు పత్రికలు కూడా బాగా అందు తాయి. వాటిని చదివి చదివి ఆ భాషే అలవాటు అయి ఉండవచ్చు.

**సుబ్బా :** కోరాపుట్టి, గంజాంలు ఒడిశా రాష్ట్రానికి చేరిపోవడం వలన మీరు నష్టపోయారు సరే, ఇప్పటి ఆంధ్రప్రాంతపు వారికి ఏమైనా నష్టం జరిగిందా?

**పట్నా :** జరిగింది. ఎన్నో ఉదాహరణలు ఉన్నాయి. చిన్నది ఒక్కటి చెప్తాను. రాయగడలో 'మజ్జి గౌరమ్మ' కొలువు ప్రతి ఆది వారం జరుగుతుంది. ఆంధ్రానుంచి చాలామంది రైళ్లలో ఇక్కడికి వస్తారు. జంక్షన్ అయిన రాయగడకు చాలా రైళ్లు వస్తాయి. ఏ రైలు ఎక్కాలో ఎక్కడ ఎక్కాలో తెలియక చాలా మంది ఆంధ్రులు చిక్కుకు పోతుంటారు. ఇక్కడి ప్రకటనలన్నీ ఒడియాలో, అర్థంకాని హిందీలో, అవసరంలేని ఆంగ్లంలో ఉంటాయికానీ, ఎంతో అవసరమైన తెలుగులో ఉండవు. ఇదివరకు లేదా అంటే ఉండేది, తెలుగులో కూడా ప్రకటించే వారు. ఇప్పుడు లేదు. అడిగితే ఇది ఒడిశా రాష్ట్రం అంటారు. ఇట్లాంటివి ఎన్నో ఉన్నాయి. అయినా మన చోటును ఇంకొ కడికి వదులుకొని అందులో లాభనష్టాలను లెక్కించుకోవడం ఏమిటండీ!

**సుబ్బా :** ఇక్కడి తెలుగుకు పూర్వవైభవం రావాలంటే?

**పట్నా :** ఏ నాగరిక భాషకైనా దాని వైభవమంతా అక్షరంతో ముడి పడి ఉంటుంది. అక్షరం లేని భాష నాగరిక భాష అనిపించు కోదు. పూర్వం లాగా తెలుగు బడులు పెరగాలి. మూయ కుండా ఉన్న తెలుగు బడులలో పంతుళ్లను నియమించాలి. అక్కడ తెలుగు నేలపైనున్న ఒడియా బడులలో ఖాళీలు ఏర్పడితే ఇక్కడి ప్రభుత్వం టంచనుగా భర్తీ చేస్తుంది. ఇక్కడ అలాంటి పని జరగడం లేదు. ఇక్కడ తెలుగును నేర్చు కోవాలనుకొంటున్న వారు ఉన్నారు. నేర్పేవారే లేరు.

సుబ్బా : చివరి ప్రశ్న. తెలంగాణాంధ్రల నుంచి మీరు ఎటువంటి సాయం కోరుతున్నారు?

పట్నా : కడుపు చించుకొంటే కాళ్లమీద పడుతుందన్నట్లు, ఈప్రశ్నకు

*(మిగతాది 30వ పుటలో)*

చర్చ

# ఇంగ్లిష్ మాధ్యమమా? తెలుగు మాధ్యమమా??

–చెన్నూరు ఆంజనేయరెడ్డి,
98667 06767

**ఇప్పుడు సామాజిక మాధ్యమాల్లో (సోషల్ మీడియా) గూగుల్ గ్రూపులుగా వ్యవహరించబడుతున్న బృందాలు జరుపుతున్న చర్చలు, మాటామంతీ ఆసక్తిగొలుపుతూ వుంటాయి. వీటిని కంప్యూటర్‌లో గాని సెల్‌ఫోన్‌లో గాని మనం గమనించవచ్చు. దేశంలోనూ బయటా వున్న అనేకమంది తెలుగు యువత, పెద్దలు కొందరు ప్రత్యేకంగా తెలుగు నుడి గురించి ఇలాంటివి నడుపుతున్నారు. వీటిలో 'తెలుగుమాట' అనే గ్రూప్ ఒకటి. దానిలో జూన్ 20, 21 తేదీల్లో ఆసక్తికరమైన చర్చ జరిగింది. ఈ చర్చకు కారణం –పెద్దలు చెన్నూరు ఆంజనేయరెడ్డి గారి వ్యాసం. దానినీ దానిపై ఆచార్య గారపాటి ఉమామహేశ్వరరావు, డా॥అద్దంకి శ్రీనివాస్ స్పందించిన తీరుతెన్నులను 'అమ్మనుడి' చదువరులందరికీ తెలియజేద్దామని అనిపించి వాటిని ఇక్కడ ఇస్తున్నాము.** సం.

**నే**ను భాషావేత్తను గాను. తెలుగు మాధ్యమంలో చదువుకొని ఇంగ్లిష్‌ను విరివిగా ఉపయోగిస్తున్న వాడిని. మనకు రెండు భాషలూ అవసరమని నమ్మేవాడిని. ఈ మధ్య అంతర్జాలం లో జరిగే చర్చలను బట్టి, తెలుగు నేర్చుకోవాలంటే, ఇంగ్లిష్ మాధ్యమాన్ని వదిలెయ్యాలని పలువురి అభిప్రాయంగా తెలుస్తుంది.

ఇంగ్లిష్ ఎంతో గొప్పగా అభివృద్ధయిన అంతర్జాతీయ భాష, వాణిజ్య మాధ్యమ భాష, ఉన్నతవిద్యామాధ్యమ భాష. ఒకప్పుడు ఎంతో ప్రాముఖ్యంలో ఉన్న French, German భాషలను అధిగ మించి ముందుకు వెళ్ళి వర్ధిల్లుతున్న భాష. దీని బారినుండి తెలుగుని ఎలా రక్షించుకోవాలి అని ఆలోచించే దానికన్నా దానితో ఎలా సహజీవనం చెయ్యాలి అని మనం ఆలోచించాలి. ఇంగ్లిష్ వస్తే గాని sales-person ఉద్యోగం కూడా రాని ఈ రోజుల్లో ఇంగ్లిష్ మాధ్యమాన్ని అందరూ కోరుకోవడంలో ఆశ్చర్యం లేదు. మనం వొక్కసారి గతాన్ని గూడా గమనించి చూడాలి. సంస్కృతం నేర్చుకుంటే రాజపోషణ లభించే రోజుల్లో అందరూ సంస్కృతాన్నే నేర్చుకున్నారు. ఆ తర్వాత పారశీకం నేర్చుకుంటే నవాబుల ఆదరణ లభించే రోజుల్లో అందరూ పారసీకమే నేర్చుకున్నారు. అదేవిధంగా ఉర్దూ నేర్చుకొన్న వారికే నిజాం లాంటి సుల్తానుల దగ్గర కొలువులు దొరికాయి. ఇంగ్లిష్ రాజ్యమేలే రోజుల్లో ఆ భాష తెలిసిన వారే ఉన్నతపదవుల్లో రాణించారు. ఇంగ్లిష్ యుగం ఇంకా జోరుగాసాగుతోంది. అందువలన



మనమెంత చెప్పినా పిల్లలు ఇంగ్లిష్ నేర్చుకోవాలనే ఆత్రుత తల్లి తండ్రుల్లో ఉంటుంది. మన సమాజంలో వెనుకబడినవారే సర్కారు బడులకు పిల్లలను పంపుతున్నారు కాబట్టి వారిమీద మనం తెలుగు మాధ్యమం రుద్దితే దాన్ని అగ్రకులాల కుట్రగా చూస్తారు, చూస్తున్నారు. అందువలన తెలుగును బతికించుకోవడానికి వేరే మార్గాలు వెతకాలి., పాత రోజుల్లో ఒక మధ్యమార్గం ఉండేది. అప్పుడు, అంటే వందేళ్ళ నాడు 11వ క్లాసు వరకు సైన్సు సబ్జక్ట్స్ ఇంగ్లిష్‌లోను, మిగతా సబ్జక్ట్స్– చరిత్ర, సాంఘిక శాస్త్రం లాంటివి. తెలుగు మాధ్యమంలో బోధించేవారు. ఈ పద్దతినో ఇలాంటి మరో పద్ధతినో ఆలోచించుకోవాలి. తెలుగు నేర్చుకోవడం కూడా సులభం చెయ్యాలి. నేర్పే మార్గాలను కూడా మనం మార్చుకోవాలి. ఈ కింది సూచనలు భాషా సంబంధితమైన విషయాలు. ఉపయోగకరమో కాదో ఆలోచించండి.

**తెలుగు లిపి ఇంకా కంప్యూటర్ నేస్తం (computer-friendly) కావాలి**

లిపి సంస్కరణలను గురించి మధురెడ్డి(అమెరికా)గారి సూచనలన్నింటిని మనం వొప్పుకోక పోయినా సంస్కరించాల్సిన అవసరాన్ని విస్మరించరాదు. మనం రాస్తున్న "జ్ఞానం" కొన్ని భాషల్లో "గ్యానం"గా రాస్తారు. అందువలన దాని అర్థం మారిపోలేదు. కృత్తికను క్రుత్తికగా రాయవచ్చు. ఇలాంటి మార్పులు ఎన్నో చేయవచ్చు. Key boardకు అవసరమైన మార్పులు చేసి తెలుగు టైపు చేయడం సులభం చెయ్యాలి. ఇప్పుడు వస్తున్న సెల్‌ఫోన్ లాంటి వాటిలో తెలుగు ఉపయోగించక పోతే భాషాభివృద్ధి జరగదు. ముఖ్యంగా ఇంగ్లిష్–తెలుగు, తెలుగు–తెలుగు శబ్దకోశాన్ని సెల్‌ఫోన్‌లోకి తీసుకురావాలి. సెల్‌ఫోన్ అరిచేతిలో ప్రపంచమని మనకందరికీ తెలుసు. ఈ డిజిటల్ ప్రపంచంలోకి తెలుగు రాకపోతే ఎలా?

తెలుగు పదాలు వున్నచోట సంస్కృతం గాని, ఆంగ్లం గాని వాడవలసిన అవసరం లేదు. విచ్చలవిడిగా సంస్కృత, ఆంగ్ల పదాల్ని తెలుగులో వాడటం వల్ల తెలుగు పదాలను మరిచిపోతున్నాం. "పొడుగరి" అనే పదాన్ని వదిలి ఆజానుబాహుడని రాయాల్సిన అవసరం లేదు! గొలుసుకథను ధారావాహికం అని మార్చవలసిన అవసరం లేదు. అదేవిధంగా వాడుకలో నున్న ఇతర భాషాపదాలను విస్మరించి మరిచిపోయిన అచ్చ తెలుగు పదాలను వెదికి తేవలసిన అవసరం లేదు. ఈ విషయంలో మన సంపాదకుల, విలేఖరుల 'సహ చరియం' ఎంతైనా అవసరం.

సంస్కృతం దేవభాష అని, తెలుగు కాదనే ఆత్మన్యూనతా భావాన్ని వదలగొట్టుకోవాలి. రెండూ మనుషుల భాషలే! నాలుగు ఆంగ్ల పదాలో లేక సంస్కృత శ్లోకమో ఉపయోగిస్తేనే చదువుకున్న వారని అనుకుంటారని పొరపడరాదు. ఏ భాషలో నైనా సంస్కారవంతంగా మాట్లాడడం ముఖ్యం. ముఖ్యంగా పిల్లలతో సరళమైన తెలుగు మాట్లాటడం ఈనాటి అవసరం.

సంస్కృత పదాలు తెలుగులో వాడితే వాటికి తెలుగులో వేరే అర్థాలు కల్పించి ప్రచారం చేయరాదు. Founder అనే పదానికి "వ్యవస్థాపకుడు" అని తెలుగులో పండితులమని చెప్పుకునేవారు గూడా రాస్తున్నారు. Founder అంటే "సంస్థాపకుడు" కానీ వ్యవస్థాపకుడు కాదని తెలుసుకోవాలి. ఇలాంటివి ఎన్నో వున్నాయి. అన్నిటినీ వెదికి సవరించాలి. అర్థం లేని తెలుగు పదాలను అర్థవంతంగా మార్చాలి. ఎడిటర్‌ను సంపాదకుడనడం అర్థరహితం.

**దుష్ట సమాసమనే వ్యాకరణ నియమాన్ని వదలుగొట్టుకోవాలి**

తెలుగు పదానికి సంస్కృతం కలిపితే మహాపరాధం అనుకోవడం మానెయ్యాలి. ఇతర దక్షిణాది భాషల్లో ఉన్న మణిప్రవాళ సంప్రదాయాన్ని మనం తీసుకుని, ఇంకా సరళం చేసుకొని ఉపయోగించుకోవాలి. తెలుగు, సంస్కృతం కలిపి రాస్తే పదబంధాలు ఎక్కువై భాషాభివృద్ధి జరుగుతుంది. మనం వొప్పుకున్నా లేకున్నా తెప్పోత్సవం, మెట్లోత్సవం లాంటివి ప్రజలు ఉపయోగిస్తున్నారు.జయంతి, ఉత్సవం తెలుగులో జయంతోత్సవమవుతుంది. ఇది తప్పని, జయంత్యుత్సవమని రాయాలని చెప్పే గ్రాంధికులున్నారు. సంస్కృత పదాలను తెలుగులోకి తీసుకున్నప్పుడు వాటితో గూడ సంస్కృత వ్యాకరణాన్ని తెలుగులోకి తీసుకు రారాదు. ప్రజలు మాట్లాడేదే భాషగాని పండితులు రాసేది మాత్రమే కాదు.

**తత్సమా లెక్కడివి?**

సంస్కృతంలో తత్సమాలని చెప్పబడుతున్న పదాలన్నీ ప్రాకృత, ద్రావిడ భాషలనుంచి తీసుకొని సంస్కృతీకరించ బడినవని తెలుసుకోవాలి. అందువలనే సంస్కృతం విస్తరించింది. మడిగట్టుకొని కూర్చొని ఉంటే ఆ భాష గూడా వేదాల్లో ఉన్న చిన్న పదజాలంలో చిక్కుకు పోయేది.

**ఏది ప్రకృతి, ఏది వికృతి?**

మనం చేస్తున్న మరో ఘోరం తెలుగు పదాలను ప్రకృతి–వికృతులుగా విడగొట్టడం. ప్రాకృత భాషల్లోనుంచి వచ్చిన పదాలను "వికృతు"లు గా చెప్పడం విడ్డూరం. ప్రాకృతంలో నుంచి వచ్చిన పదాలు ప్రకృతులౌతవి గాని వికృతులు గావు. వీటిని తెలుగు లేక ప్రాకృత పదాలుగా చెప్పవచ్చు. సంస్కృతీకరించబడిన ప్రాకృత పదాలకు వేరే పేరు పెట్టుకోవచ్చు.

తెలుగుభాష బోధనను, సరళీకరణను ఒక ఉద్యమంగా తీసుకోవాలి. కేవలం తెలుగు మాధ్యమాన్నే గాదు.

**–చెన్నూరు ఆంజనేయరెడ్డి,** హైదరాబాదు.

## ఆచార్య గారపాటి ఉమామహేశ్వరరావు, డా॥అద్దంకి శ్రీనివాస్ గార్ల స్పందన

**చె.ఆ.రె:** తెలుగు నేర్చుకోవాలంటే, ఇంగ్లిష్ మాధ్యమం వదిలెయ్యాలని పదుగురి అభిప్రాయంగా తెలుస్తుంది.

**గా.ఉ.రా :** క్షమించాలి. మేము కోరేది తెలుగు నేర్చుకోవాలంటే కాదు, తెలుగు మాధ్యమం ఉండాలి, ఇంగ్లీషూ నేర్చుకోవాలి అని. రెండు ఏమిటి…అవసరమైతే అంతకంటే ఎక్కువే నేర్చుకోవాలని నమ్ముతాను.

**అ.శ్రీ :** మాతృభాష కాని ఎన్ని భాషలనైనా వేగంగా సులభంగా నేర్చుకోవడానికి కావలసిన మెలకువ ఇచ్చేది మాతృభాషే. మరి ఆ మాతృభాష స్థానంలో ప్రాథమిక విద్యలోనే ఆంగ్లం రుద్దితే వారి ఆశయమూ నెరవేరదు. పైగా గోటితో పోయేదానికి గొడ్డలి దాకా వెళ్ళినట్లు అవుతుంది.

**చె.ఆ.రె:** ఇంగ్లీష్ ఎంతో గొప్పగా అభివృద్ధి అయిన అంతర్జాతీయ

భాష, వాణిజ్య మాధ్యమ భాష, ఉన్నతవిద్యామాధ్యమ భాష. ఒకప్పుడు ఎంతో ప్రాముఖ్యంలో ఉన్న ఫ్రెంచి, జర్మన్ భాషలను అధిగమించి ముందుకు వెళ్ళి వర్ధిల్లుతున్న భాష.

**గా.ఉ.రా :** ఒక భాష అభివృద్ధి చెందినదా లేదా అనేది భాషాతత్త్వంలో లేదు, అది భాషను వాడే రంగాలనుబట్టి ఉంటుంది. అంటే సామాజిక రాజకీయ విధివిధానాలకు సంబంధించినది. అనేక రంగాలలో మాధ్య మంగా వాడుతుంటే భాష అభివృద్ధి చెందుతుంది. అందుకనే తెలు గును అన్నిచోట్లా వాడాలి అంటున్నాం.

**అ.శ్రీ :** అలా తెలుగును వాడాలంటే దానికి కావలసిన ముడిపదా ర్థాన్ని అందించడంలో అకాడమీలుగానీ విశ్వవిద్యాలయాలుగానీ భాషాసాంస్కృతికశాఖలుగానీ దీనాతిదీనంగా వెనుకబడి ఉన్నాయి. వివిధ శాఖలలో తెలుగు వాడకంలో ఇబ్బందులు ఉన్నాయి. తగిన ఆంగ్లపదాలకు అనువాదాలు లేకపోవడంవల్ల ఆంగ్లంలోనే వాడడం సులభమనే భావన ఉంది. కావలసిన పదానువాదాలు జరిగే దాకా లిప్యంతీకరించైనా తెలుగు వాక్యాలలో వాడకం జరగాలి. వాడాలి అనే చిత్తశుద్ధి ఇక్కడ ముఖ్యం. ఇదంతా నిరంతర ప్రక్రియగా జరగాలి. దీనికి పెద్దలు ఆంజనేయరెడ్డిగారివంటి వారు అండగా నిలవాలి. వారి మిసిమి పత్రిక ద్వారానూ పదాలను వ్యాప్తి చేయవచ్చు.

**చె.ఆ.రె :** దీని బారి నుండి తెలుగుని ఎలా రక్షించుకోవాలి అని ఆలోచించే దానికన్నా దానితో ఎలా సహజీవనం చెయ్యాలి. ఇంగ్లీష్ వస్తే గాని సేల్స్‌గరల్ ఉద్యోగం కూడా రాని ఈ రోజుల్లో ఇంగ్లీషు మాధ్యమాన్ని అందరూ కోరుకోవడంలో ఆశ్చర్యం లేదు.

**గా.ఉ.రా :** చక్కగా చెప్పారు. మన ఆలోచన కూడా ఎలా రక్షించు కోవాలి అనేదానికంటే తెలుగుకు దాని ఉచిత స్థానాన్ని ఎలా తిరిగి రాబట్టాలనే. ఎంత దౌర్భాగ్యం! తెలుగుతో సేల్స్‌గర్ల్ ఉద్యోగం కూడా తెచ్చుకోలేని పరిస్థితిని కల్పించుకున్నాం! వంకాయలూ ఉప్పూ పప్పూ కొనుక్కోవటానికి కూడా ఇంగ్లీషు అవసరమనిపించేలా మన విద్యా వ్యవస్థను తయారుచేసుకున్న మన బానిస బతుకుల మానసిక స్థితిని గురించి ఏమని చెప్పుకోవాలి. తెలుగు మాధ్యమం మనందరికోసం మన సమాజంలో అందరికీ సమస్థాయిని కల్పించగల తెలుగును వదిలి ఆంగ్లమాధ్యమమా. ఉన్నత విద్య అనంతరం ఎవరికి అవసర మైతే వాళ్లు ఆంగ్లమాధ్యమంలోకి మారవచ్చు. ఆంగ్లమే కాదు ఇతర భాషలలోకి కూడా మారవలసిన అవసరం రావచ్చు.

**అ.శ్రీ :** తెలుగు ఇప్పుడు ఆంగ్లంతో సహజీవనం చేస్తూనే ఉంది. కానీ ఆ సహజీవనం రెంటికీ చెడిన రేవడి అవుతోంది. ఇంగ్లీష్ వస్తే గాని సేల్స్‌గరల్ ఉద్యోగం కూడా రాని రోజుల్లో ఇంగ్లీషు మాధ్యమాన్ని అందరూ కోరుకోవడంలో ఆశ్చర్యం లేదు కానీ అదే చిన్నప్పటినుంచీ ఆంగ్లమాధ్యమంలోనే చదివిన మన విద్యార్థులు నాలుగు ఆంగ్లం ముక్కల్ని బట్టీ పట్టి చదివేస్తున్నారు. వారిలో సృజ నాత్మకత ఎక్కడుంది? ఆవిరైపోతోంది. ఎంతమంది ఆంగ్లమాధ్య మంలో చదివిన వాళ్ళు అద్భుతమైన సృజన పుస్తకాలుగానీ, సబ్జెక్ట్ పుస్తకాలుగానీ రాస్తున్నారు? పరిశోధనకోసం పేపర్లలోనూ ఒకే మూస పదజాలప్రయోగాలూ వాక్యవిన్యాసాలూ తప్ప కొత్తగా అద్భుతంగా రాయగలిగేవాళ్ళు ఎందరున్నారు? తెలుగులో చదివితే తద్వారా కనీసం తెలుగులోనైనా అద్భుతంగా రాయగలిగితే అప్పుడు అన్య భాషలో రాయడం ఎంతో సులభం. దీనికి ఆంజనేయరెడ్డిగారే ఒక ఉదాహరణ. వారు ఆంగ్లాన్ని సమర్థవంతంగా వాడుతున్నారంటే దానికి కారణం చిన్నప్పుడు వారు తెలుగు మాధ్యమంలో చవవడం వల్లనే. ఇప్పటి ఆంగ్ల మాధ్యమంవల్ల ఇంటి భాషా గల్లంతే. ఒంటికి బలవంతంగా పూసుకున్న భాషా గల్లంతే.

**చె.ఆ.రె :** సంస్కృతం నేర్చుకుంటే రాజపోషణ.. పారశీకం నేర్చు కుంటే నవాబుల ఆదరణ.. ఉర్దూ నేర్చుకొన్నవారికే నిజాం లాంటి సుల్తానుల దగ్గర కొలువులు..ఇంగ్లిష్ రాజ్యమేలే రోజులో..ఇంగ్లిష్ నేర్చుకోవాలనే ఆత్రుత..

**గా.ఉ.రా :** సంస్కృతం, పారశీకం, ఉర్దూ, ఇంగ్లీషు ఇవ్వన్నీ మనకు పరాయి భాషలే. మనం అవి నేర్చుకున్నప్పుడే బ్రతుకు తెరువు అనడం లోనే పరాయీకరణ అని తెలుస్తోంది. ప్రజలభాషలను కాదని పరాయి భాషలను మనం నేర్చుకోలేదా పొట్టకూటికి అని ఉదహరించడం మన బానిస వాసనలకూ వారసత్వానికీ మళ్లీ తలూపడమే. ఇక, పూర్వం అందరూ సంస్కృతం నేర్చుకోలేదు. మన సమాజంలో నూటికి ఒకరికి కూడా సంస్కృతం, పారశీకం వచ్చి వుండవు. అవి కూడా ఒకటి రెండు రంగాలకే పరిమితం. ఇక ఉర్దూ, దండనీతితో మనమీద రుద్దబడిన భాష. ఇక వీటిని ఉదాహరణలుగా తీసుకుంటే మన స్వాతంత్ర్యానికి అర్థం లేకుండా పోతుంది. దేనికి ఈ స్వాతంత్ర్యం? మన భాషను మనం వాడుకోలేని చోట. ఇంగ్లీషు నేర్చుకోవద్దని ఎవరంటున్నారు. తెలుగు మాధ్యమం ఉండాలంటున్నాం. మనం స్వయం సమృద్ధిని ఎప్పుడు సాధిస్తాం. ఇక ఎప్పుడూ బొచ్చేసుకొని ఎవరినో దేబిరించడమేనా?

**అ..శ్రీ :** సంస్కృతం, పారశీకం, ఉర్దూ భాషలను రాజులు పాలనా భాషలుగా ఆదరించినా వాడకంలో ప్రజల భాషలకు ప్రాధాన్యం ఉండేది. పాలనా వ్యవహారాలకోసమే అన్యభాషల వాడకం వచ్చింది. కానీ తెలుగు వాళ్ళు గుండె చప్పుడు తెలుగులోనే వినిపించేవాళ్ళు. అందుకే తెలుగువాళ్ళు తమ రచనలను తెలుగులోనే రాశారు. అన్య భాషలలో చాలా తక్కువగా రాశారు. ప్రాచీన రాజులు కూడా ప్రజల భాషలను గౌరవించారు. పాఠశాలలలో తెలుగును బతికించారు. ఇక్కడి ప్రజలను పాలించడానికి వచ్చిన ఆంగ్లేయులు కూడా తెలుగు నేర్చుకున్నారు. ఇప్పటికీ తెలుగు వాడుతున్న రంగాలతో పోలిస్తే తెలుగు ప్రాంతాలలో ఇంగ్లీషు వాడుతున్న రంగాలు హస్తిమశకాంతర భేదంతో (ఏనుగుకీ దోమకీ ఉన్నంత తేడా) ఉంటాయి. మరి ఓట్ల మీద, ప్రజాభిప్రాయం మీద ఆధారపడే ప్రభుత్వాలు దీనిని గుర్తించలేక పోవడానికి కారణం అటు ప్రభుత్వానికి ఇటు ప్రజలకూ కమ్ముకున్న అపోహ మాత్రమే.

**చె.ఆ.రె :** వెనుకబడిన వారే సర్కారు బడులకు పిల్లలను పంపు తున్నారు.. కాబట్టి వారిమీద మనం తెలుగు మాధ్యమం రుద్దితే దాన్ని అగ్రకులాల కుట్రగా చూస్తారు.. చూస్తున్నారు.

**గా.ఉ.రా :** ఔను మీరు అన్నది నిజమే. కొందరు తెలుగు మాధ్య మాన్ని అగ్రకులాల కుట్ర అని అనుకొంటున్నారు. కానీ అంతర్లీనంగా ఉన్న నిజం ఏమిటి? ఇది ఎట్లా ఉందంటే రెండు కోతులు కొట్టుకొని పిల్లికి పెత్తనం ఇచ్చినట్లుంది. ఇది మన స్వయంకృతాపరాధమే. కంపుకొడుతున్న మన కులవ్యవస్థే కారణం. సమాజంలో అట్టడుగు వర్గాలవారి భయాన్ని పోగొట్టడానికి మనం త్యాగం చెయ్యక తప్పదు.

*(మిగతాది... 28వ పుటలో)*

బయటి తెలుగు బతుకు కతల మాలిక-2



# ఓ సంచారి అంతరంగం

కుప్పె నాగరాజు గారు
కన్నడంలో రచించిన
'అలెమారియ అంతరంగ'కు
రంగనాథ రామచంద్రరావు గారి
తెలుగు అనువాదం

## 3. మళ్ళీ నడక-కొడుగు కడకు

కుశాలనగరలో కొద్దిరోజులు గడిపిన తరువాత మా ప్రయాణం మడికేరి వైపు సాగింది. ఆ ప్రదేశం పూర్తిగా కొండలు గుట్టలతో, వంకర టింకర దారులతో, దట్టమైన అడవులు, కాఫీ, యాలకులు, బత్తాయి తోటలు, అక్కడక్కడ ప్రవహిస్తున్న చిన్నచిన్న ఝరులతో కూడుకుని ఉంది. వీటి మధ్య నుంచి సాగిపోతూ మైలుకో రెండు మైళ్ళకో కనిపిస్తున్న ఒక్కొక్క గడ్డిపాకను దాటుకుంటూ ఆ ఇళ్ళల్లో తినటానికో, తాగటానికో ఏదైనా ఇవ్వమని అడిగి ఇప్పించుకుని 'అమ్మయ్య' అనుకుంటూ సుంఠికొప్ప చేరాం.

బయలుసీమలో ఇష్టమైన రీతిలో జీవనాన్ని సాగిస్తున్న మాకు కొడుగు మరియు దాని పరిసరాలు మరీ భిన్నంగా కనిపించేవి. మేము ఎక్కడబడితే అక్కడ విడిది చేయడానికి అవకాశం లేదు. ఎక్కడా ఖాళీ స్థలం కానీ, మైదానం కానీ కనిపించ లేదు. ఎటు చూసినా కాఫీ తోటలు లేదా దట్టమైన అడవులు. ఇలాంటి స్థలంలో ఎక్కడ బస చేయాలో అర్థం కాక సతమతమయ్యాం. రోజుకు నాలు గైదు ఊళ్ళను తిరుగుతూ వందలాది మందిని సంప్రదిస్తున్న నాన్నకు ఇక్కడ పదిపదిహేను ఇళ్ళు తిరగడానికి కూడా చేతనయ్యేది కాదు. ఆ కొండలు, గుట్టలు, అడవులు, దిబ్బలు ఎక్కుతూ దిగుతూ నాన్న అలసిపోయేవాడు. ఇతనొక్కడి కష్టంతో మా కడుపులు నిండవని అర్థమైంది. భిక్షాటన, నాటకం, హరికథలు-ఇలాంటి జానపద సంస్కృతిని అక్కడ ప్రదర్శించే అవకాశం లేదు.అక్కడ అప్పన్న అనే తోట యజమాని కూలీపనులకు పిలిచేవాడు. నాన్న ఎన్నడూ కూలీ నాలీ చేసినవాడు కాదు. అటువంటి శారీరకమైన కష్టమైన పనులు కొంచెం కూడా అతడికి తెలియదు. అయితే అమ్మకు కూలీపనులు చేయటం తెలుసు.

మా కడుపులు నింపాల్సిన అనివార్యత వల్ల అమ్మ అక్కడ ఒక తోటలో కూలీపనికి చేరింది. తోటలో పనిచేసే కూలీజనానికి యజమానే వసతి ఏర్పాటు చేసేవాడు. ఆ కారణంగా అక్కడ మకాం పెట్టడానికి మాకొక స్థలం దొరికింది.

అమ్మ ఏడాదిన్నర వయస్సున్న నా తమ్ముడిని అక్క దగ్గర వదలి తాను కాఫి తోటలో పనికి వెళ్ళేది. అన్నయ్య- నేనూ, నాన్న వెంబడి వెళ్ళేవాళ్ళం. అప్పటి కాలంలో పెంకులు, ఆర్.సి.సి. ఇళ్ళ కన్నా గడ్డి కప్పిన ఇళ్ళే ఎక్కువగా ఉండేవి. అత్యధికంగా వర్షం కురిసే ప్రదేశం కావటం వల్ల గడ్డి ఇండ్లే అధిక సురక్షితమని, ఎంతటి ధనవంతులైన గడ్డి ఇళ్ళల్లోనే నివాసం ఉండేవారు. నాన్న ఇంటి ముందు నిలబడి హార్మోనియం శృతి చేసిన సవ్వడికి ఇంటివారు బయటికి వచ్చి విచిత్రంగా చూసి, పిడికెడు బియ్యమో, చిల్లర నాణ్యామో జోలెలో వేసి వెళ్ళేవారు. మా బయలుసీమలోని వారిలా పిలిచి, కూర్చోబెట్టుకుని పదాలు పాడించుకుని ధవస ధాన్యాలు ఇచ్చే పద్ధతి ఇక్కడ లేదు. బయలుసీమ నుంచి అటువైపు వలసపోయి జీవిస్తున్న కొందరు మాత్రం మమ్మల్ని కూర్చోబెట్టి పదాలు పాడించు కుని బియ్యమో, చిల్లరో, కాఫిగింజలో ఇచ్చి పంపేవారు.

నాన్న వెనుక నడుస్తున్న పసివాళ్ళమైన మమ్మల్ని చూసి కనికరంతో తినటానికి రొట్టెనో, అన్నాన్నో, లేదా ప్రత్యేకంగా బియ్యం పిండి, రాగిపిండితో తయారుచేసిన అంబలినో ఇచ్చేవారు. ఆ అంబ లిలో నంజుకోవడానికి ఊరగాయనో, ఉప్పుచేపల ముక్కలో ఉండేవి. అది చాలా రుచికరంగా ఉండేది.



# 4. మళ్ళీ బయలు సీమకు



ఇలాగే ఒక రోజు ముగ్గురం కాఫి తోటలో గట్టు దిగి పల్లంలో ఉన్న యాలకుల తోటలోకి వెళుతున్నాం. ఆ దుర్గమమైన స్థలాల్లో మేము ఒట్టి కాళ్ళతో, అరకొరా బట్టలు తొడుక్కుని నడుస్తున్నాం. సాధారణంగా యాలకుల తోటలో జలగల సంతతి ఎక్కువ. ఈ జలగల గురించి బయలుసీమవాళ్ళమైన మాకు ఏమి తెలుసు? మేము ఆ యాలకుల తోట మధ్య నుంచి నడుచుకుంటూ వెళుతుండగా జలగలు మా మీద దాడి చేశాయి. నేను, మా అన్న కేవలం చడ్డీ, అంగీ మాత్రమే తొడుక్కుని ఉన్నాం. ఆ జలగలు కాళ్ళ మీదికెక్కి పిక్కల వెంబడి ఎక్కడంటే అక్కడ కరిచి మాకు నొప్పి కలగకుండా రక్తం తాగి బెలూన్ల మాదిరి ఉబ్బిపోయాయి. మేము చేతితో లాగడానికి ప్రయత్నిస్తే వాటి దేహాలు ముక్కలయ్యాయే తప్ప కరిచి పట్టుకున్న భాగాన్ని వదిలేవి కావు. నేను, అన్న కంగారుగా కేకలు పెడుతుంటే నాన్న అసహాయతతో ఏం చేయాలో తోచక వాటిని లాగివేయటానికి తీవ్రమైన ప్రయత్నం చేసేవాడు. మా అరుపులు విని అక్కడికి కొద్ది దూరంలో ఉన్న ఇంటి ఆడవాళ్ళు మా సహాయానికి వచ్చారు. వాళ్ళు జరిగిందేమిటో ఊహించినట్టు చేతిలో కొన్ని వరిగడ్డిపరకలు పట్టుకొచ్చారు. అగ్గిపుల్ల గీసి గడ్డిని అంటించి మా కాళ్ళ దగ్గరికి తెచ్చి నిప్పు వేడిమిని చూపించగానే ఆ జలగలు టపటపమని రాలిపడసాగాయి. ఈ ప్రమాదం వల్ల భయపడిపోయిన మేము సంతృప్తిగా నిట్టూర్పు విడిచాం. ఆ మహాతల్లి మమ్మల్ని ఇంటికి తీసుకునిపోయి తినటానికీ, తాగటానికీ ఇచ్చి ఇకపై యాలకుల తోట ఉన్నవైపు జాగ్రత్తగా తిరగాలని చెప్పింది.



అమ్మకు కాఫితోటలో పని కొత్తది. ఆ పల్లపు ప్రదేశాల్లోని అడవి పొదల్లో పని చేసే అనుభవం ఆమెకు కొంచెం కూడా లేదు. ఒక రోజు కాఫి తోటలో కాఫి గింజలు కోస్తున్నప్పుడు ఆకస్మాత్తుగా జారి పల్లంలో పడిపోయింది. స్పృహ కూడా తప్పింది. తోట యజమానే తమ జీపులో అమ్మను ఆస్పత్రికి తీసుకెళ్ళి చికిత్స చేయించాడు. ఆ తోటలో పడిపోయిన పరిణామంగా అమ్మ ఆరోగ్యం క్షీణించింది. చాలా రోజులు పనికి వెళ్ళలేకపోయింది. అమ్మ కాలుజారి పడిపోయిన విషయం సాయంత్రం మేము మా కాయకం ముగించుకుని వచ్చాకే తెలిసింది. దీని వల్ల నాన్న చాలా బాధపడ్డాడు. ఈ సంఘటన తరువాత నాన్నకు ఎందుకో ఈ ప్రదేశంలో ఉండకూడదనిపించింది. మరలా బయలుసీమకు వెళ్ళాలని అనుకున్నారు. అదే సమయంలో మా అమ్మ చెల్లెలి, తమ్ముడి వివాహాలు నిశ్చయమయ్యాయి. మా మామయ్య, మా పెద్దమ్మ కొడుకు, మా అన్న మమ్మల్ని వెదుక్కుంటూ వచ్చారు. ఇలాంటి బలమైన కారణం ఉండటం వల్ల కొడగు వనవాసం ముగించి తిరిగి వచ్చాం.

# 5. నిలిచిన నెలవుకొక అందమైన పేరు

మేము మళ్ళీ ఊరికి వచ్చేంతలో వేరు వేరు దిక్కుల్లో వలస పోయిన మా దాసరుల కుటుంబాలు కొన్ని తిరిగొచ్చాయి. మేము వదిలిపెట్టి పోయిన గుడిసె చెదలుపట్టి శిథిలమైంది. ఆ గుడిసెను మళ్ళీ మరమ్మత్తు చేసుకుని అందులో చేరాం. నూనెకు వత్తికి సంబంధం ఉన్నట్టు కొడుగులో గడిపిన ఆ రోజుల్లో సంపాదించి మిగుల్చు కున్నదేమీ ఉండలేదు. మా కడుపులు నింపుకుని జీవించాం. అంతే.

మా సంసారం మరలా ఊరికి రావటం గ్రామీణులకు సంతోషం కలిగించింది. బాలగ్రహ పీడితులైన పిల్లలకు తాయెత్తులు కట్టడం, బెదిరిపోయిన పిల్లలకు మంత్రం వేసి బెదురు పోగొట్టడం, దిగ్బంధనం చేసి దోషాలు, గ్రహచారాలు సరిచేయడం, చరఖా నుంచి నూలు దారాన్ని వడికి దారాన్ని తీసి కొత్తగా పేని పురితిప్పి చేపలు పట్టే

వలలు అల్లడం, చిరిగిన వలలను రిపేరీ చేయడం–ఈ పనులన్నీ నాన్న మళ్ళీ మొదలుపెట్టాడు. ఇది నాన్న ప్రత్యేకత.

మైసూరు–హుణసూరు ప్రధాన రహదారి పక్కన గుడిసెలు వేసుకుని నివసించడం ప్రారంభించిన నాలుగు కుటుంబాలు కలసి ఒక ఊరుగా మారింది. "దొమ్మరి దాసరుల" సముదాయం ఇక్కడ నివాసం ఏర్పరుచుకున్న విషయం ప్రభుత్వం దృష్టికి వచ్చి, ప్రభుత్వం వీళ్ళ వసతి కోసం కొంత భూమిని మంజూరు చేసింది. చుట్టుపక్కల ఊళ్ళ వాళ్ళు ఈ ఊరిని ఊరు అని పిలవకుండా "స్త్రీ వేషధారుల గుడ్లు"" అని పిలవసాగారు. ఈ కళాకారులు తాము అభినయిస్తున్న నాటకాలలో కనిపించే స్త్రీ పాత్రలను స్త్రీలే సిగ్గుతో చితికిపోయేలా చీరలు, రవికలు ధరించి మనోజ్ఞంగా అభినయించేవారు. ఈ కారణంగా దానికి గుర్తుగా 'స్త్రీ వేషధారులు' అని గ్రామీణజనం పిలిచేవారు. ఆ దాసరులు నివసించే ఊరు 'స్త్రీ వేషధారుల గుడ్లు' అయింది. మేము నివసిస్తున్న ఈ ఊరికి ఒక అందమైన పేరు పెట్టాలన్నది మా అందరి కోరిక. అయితే ఇతరులకు దాసరులు నివసిస్తున్న ఈ నాలుగు ఇళ్ళ కొంపకు పేరెందుకు? వీళ్ళేమైనా శాశ్వతంగా ఇక్కడ ఉంటారా? అనే అనుమానం. ఆ కారణంగా ఊరికి ఒక పేరు పెట్టాలనే ఆసక్తి ఎవరికీ ఉండలేదు.

ఈ మధ్యన దక్షిణ కర్ణాటక ప్రాంతంలో నివసిస్తున్న దొమ్మరి దాసరులకు వైష్ణవ పంథాకు చెందిన శ్రీ సంజీవ స్వాములవారు గురుదీక్ష ఇస్తూ వేరు వేరు జిల్లాల్లో సంచరిస్తున్నారు. వీరు మండ్యాలో ఉన్న హుణసహళ్ళి గురుమఠానికి పీఠాధ్యక్షులుగా ఉన్నారు. ఎలాంటి కులమత భేధాలు లేకుండా అన్ని జాతులవారికీ గురుదీక్ష ఇవ్వడం ద్వారా గురుపుత్రులుగా మార్చి తమ తత్త్వ సిద్ధాంతాలను బోధించేవారు. మూలతా వైష్ణవ సంప్రదాయపరులైన దాసరులను చూస్తే వీరికి ఎంతో ప్రేమాభిమానాలు.మా ఊరిలో నివసిస్తున్న మా కుల బంధువులంతా వీరి ద్వారా గురుదీక్ష పొంది వీరి అనుయాయులు అయ్యారు. ఈ సంజీవ స్వాములను గౌరవాభిమానాలతో జ్ఞానానందులు అని కూడా పిలిచేవారు.

ఆయన అభిమానం మరియు ప్రభావం వల్ల ఈ ఊరికి "జ్ఞానానందపుర" అని పేరు పెట్టారు. అయితే ఆ పేరును ఉచ్ఛరించటానికి గ్రామీణులకు ఇబ్బందికరంగా ఉండటంతో చివరికి ఈ దాసరుల నెలవుకు సర్వజనాంగపు సాక్షిప్రజ్ఞలా ఉన్న స్వాతంత్ర్య సమానలతకు గౌరవ సంకేతమైన మహాత్మా గాంధీగారి పేరిట మా తాండాకు "బాపూజీ కాలనీ" అని నామకరణం చేయడం జరిగింది.

మా ఊరికీ ఒక పేరు, ఒక అస్తిత్వమేమో దొరికింది. కానీ ముఖ్యంగా తాగడానికి నీళ్ళే లేవు. ఊళ్ళో ఉన్నప్పుడు కుప్పె గ్రామానికి ఒక కిలోమీటర్ దూరంలో ఉన్న చేదుడు బావి నుంచి నీళ్ళు తెచ్చుకునేవాళ్ళం. ఇప్పుడు నీళ్ళ బావి మరీ దూరం కావటంతో నీళ్ళకు కటకటలాడవలసి వచ్చింది. నీటి మూలాలను వెదుకుతూ వెదుకుతూ పోగా మాకు లింగాయతుల పుట్టమల్లప్పగారి వాగు కింది భూమి కనిపించింది. ఆ వాగు కింది భూమిలో ఒక పురాతన కాలపు నీటి గుంట ఉంది. అందులో సాధారణంగా ఎప్పుడూ నీళ్ళు నిలువ ఉండేవి. అయితే లింగాయతులకు చెందిన ఆ నీటిగుంటలో మాకు నీళ్ళు తోడుకునే అవకాశం లేదు. దాని పక్కనే లింగాయతుల పుట్టనంజమ్మగారి పొలం ఉంది. ఆ వాగు నీళ్ళతోటే వాళ్ళు వరిమడిని తడిపి వడ్లు పండించేవారు. వారి పొలం మూలన ఒక దిగుడుబావి తవ్వితే తాగడానికి నీళ్ళు దొరుకుతాయని గ్రహించి, ఆ ఊళ్ళో అనేక నాటకాలు నేర్పించి పేరుప్రఖ్యాతలు గడించిన మా చిన్నాన్న, మామయ్య మరియు జోస్యం చెప్పే మా నాన్న –ఈ ముగ్గురు పుట్టనంజమ్మగారి ఇంటికి వెళ్ళి తాగేనీళ్ళ కోసం తాము పడుతున్న కష్టాలు చెప్పుకుని, మీ చెరువు కింది పొలంలో ఒక దిగుడుబావి తవ్వుకోవడానికి అవకాశం ఇవ్వమని వేడుకున్నారు. మా ఇబ్బందులు గ్రహించిన పుట్టనంజమ్మగారు ఉదారమైన మనస్సుతో అక్కడ నీళ్ళబావి తవ్వుకోవడానికి అనుమతి ఇచ్చారు.

ఆడవాళ్ళు, పిల్లలు, పెద్దవాళ్ళు, చిన్నవాళ్ళు అందరూ కలసి ఒకరోజు పలుగు–పారా, తట్టాబుట్టా పట్టుకుని వారి పొలం మూలలో ఒక దిగుడుబావి తవ్వి అందులో నీళ్ళు సేకరణ అయ్యేలా చేశారు. ఆ దిగుడు బావి మా నీటి బాధను తీర్చింది.

ఆ బావికి అనుకునే పొలం ఉండి ఎప్పుడూ పూడు నిండుకునేది. ప్రతీనెల పదిహేను రోజులకు ఒకసారి పూడిక తీసి బయట పారవేసి అందులో మళ్ళీ నీళ్ళు నిలిచేలా చేయాల్సి వచ్చేది. ఇలా ఏదో విధంగా తాగడానికి నీళ్ళు దొరికి మా దాహం తీరటంతో మేము సంతృప్తిగా నిట్టూర్పు విడిచాం. మా గుడిసెకు చాలా దగ్గరలో ఉన్న ఆ బావి నుంచి మా వాళ్ళందరూ నీళ్ళు తెచ్చుకుని వాడుకునేవారు. నేనూ చిన్నవాడైనప్పటికీ ఒక చిన్న పాత్రనో, బిందెనో తీసుకుని వెళ్ళి నీళ్ళు తెచ్చేవాడిని. మా అక్క మాకు తోడుగా వచ్చేది. అమ్మ కొడుగులో కాఫీ తోటలో పడిపోయినప్పటి నుంచీ ఆరోగ్యం క్షీణించటంతో తల తిరుగుడుతో, ఆయాసంతో బాధపడుతూ ఉండేది. నీళ్ళు–నిప్పు తేవడానికి, కసువు ముసురులు చేయడానికి కష్టమయ్యేది.
ఇలా మా నీటిపురాణం ముగిసిందని భావిస్తున్నంతలో మరొక సమస్య వచ్చి పడింది. ఆ పుట్టనంజమ్మకు ఈరప్పాజీ అనే ఒక కొడుకు ఉన్నాడు. అతను కాస్త రౌడి. ఒక రోజు ఉదయం మా ఆడవాళ్ళు నీళ్ళు తీసుకుని రావడానికి వెళ్ళారు. అదే సమయంలో ఈరప్పాజీ పొలం వైపు దైనందిన కాలకృత్యాలు ముగించుకోవటానికి వచ్చి మా తాగేనీటి బావిలో ముడ్డి కడుక్కుంటున్నాడు. ఆ దృశ్యాన్ని చూసిన మా ఆడవాళ్ళు "ఏమి ఐనోల్లే, మేము తాగేనీళ్ళో గుద్ద కడక్తా ఉండారే, న్యాయమా?" అని అడిగితే, అతను, "పోండమ్మా, ఇదేమైనా మీ అబ్బ జాగీరా? నా జమీను. నా బావి. నేను గుద్ద అయినా కడుగుతా ఏమైనా చేస్తాను.అడగటానికి మీరెవరు?" అని దబాయించి పంపాడు. మా ఆడవాళ్ళకు దిక్కుతోచనట్టయి చూస్తూ చూస్తూ ముడ్డి కడుక్కున ఆ బావి నీళ్ళు ఎలా తాగాలా అని నీళ్ళు తీసుకోకుండానే తిరిగొచ్చారు. మాకు కనిపించకుండా ఆ పాపాత్ముడు ఎన్నాళ్ళుగా నిర్మలమైన గంగను అపవిత్రం చేశాడో, అవే నీళ్ళను మేము ఎన్నాళ్ళుగా తాగామో ఆ దేవుడికే తెలుసు !

ఈ విషయం గురించి మా పెద్దలు ఊరి ఛైర్మన్ అయిన పుట్టమల్లప్ప, ఆ పొలం యజమానురాలైన పుట్టనంజమ్మగార్ల దృష్టికి తీసుకునిపోయారు. ఆ విషయం తెలిసి వారు నొచ్చుకుని అతనితో 'ఇకపై ఇలాంటి పని చేయొద్దు. తాగేనీటిని అపవిత్రం చేస్తే రాకూడని పాపం వస్తుందని' హెచ్చరించారు. తాగేనీళ్ళకు మరోదారిలేని మేము మళ్ళీ ఆ దిగుడుబావిలోని నీటినంతా తోడి, బావిలో నిండిన పూడునంతా వెలికి తీసి శుద్ధి చేసి యథావిధిగా ఆ నీళ్ళనే వాడుకోసాగాం. ఈ నీళ్ళు తప్ప మరో గతి లేకపోవటంతో గంగ ఎన్నటికీ అపవిత్రురాలు కాదు అని మమ్మల్ని మేము ఓదార్చుకున్నాం.

**తరువాయి వచ్చే సంచికలో...**

## ఇంగ్లిష్ మాధ్యమమా, తెలుగు మాధ్యమమా....

(25వ పుట తరువాయి)

అంతేగానీ మళ్లీ బానిసత్వంలోకి కూరుకుపోగూడదు. ఆలోచించండి. ప్రభుత్వం ఇంగ్లీషు మీడియం పెడితే అగ్రకులాలవారు కార్పోరేట్ ఇంగ్లీషు స్కూళ్లకు తమ పిల్లల్ని పంపకుండా ఉంటారా. ప్రభుత్వ ఇంగ్లీషు మీడియంలో చదువుకున్నవాళ్లు కార్పోరేట్ ఇంగ్లీషు మీడియం వాళ్లతో పోటీపడగలరా. కార్పోరేట్ ఇంగ్లీషు మీడియం స్కూళ్లు తామర తంపరగా పెరిగిపోయి ప్రభుత్వ ఇంగ్లీషు మీడియం స్కూళ్లు మూతపడే స్థితికి వస్తాయి. అసలు ప్రభుత్వ స్కూళ్లలో ఇంతమందికి ఇంగ్లీషు మాధ్యమంలో బోధించగల అధ్యాపకులు ఉన్నారా. అటు ఇంగ్లీషూ రాక, తెలుగూ రాక ఆత్మన్యూనతాభావంతో నిరాశా నిస్పృహలకు లోనై ఆత్మహత్యలకు దిగితే దానికి ఎవరు బాధ్యత వహిస్తారు? ఇప్పటికే తెలుగు బోధనకే గతిలేక, మానవీయ విలువలున్న సాహిత్యాన్ని చదవ గలిగిన శక్తిలేక ఇంకో మనిషితో ఎలా మెలగాలోకూడా తెలియక ఓర్పు వీసమెత్తుగూడా లేక, సహనం నశించి, తన మాట కాదన్న మనుషులతో సహజీవనమే చేయలేని స్థితికి వచ్చి హత్యలూ, ఆమ్ల దాడులూ ఎక్కువై సమాజం ఏ దారిపడుతుందో చూస్తున్నాం కదా! ఇంకా మనకు కనువిప్పు కావడం లేదా! ఇంటర్మీడియేట్ విద్య వరకూ మాతృభాషా మాధ్యమమే ఉండాలని అది ప్రభుత్వ బడులూ, ప్రైవేటు బడులూ కార్పోరేట్ బడులూ అనే తేడా లేకుండా అందరికీ తెలుగు మాధ్యమంలోనే విద్యను అందించాలని చట్టం చేయాలి. ఇట్లాంటి విద్య చైనా, జపాన్, కొరియా, ఇంకా అన్ని అభివృద్ధి చెందిన దేశా ల్లోనూ ఉంది. ఇది నేడు అత్యవసరం కూడా. మాతృభాషా మాధ్యమం తోనే చిన్నవయసులో జాతీయ స్పృహతో, దేశీయ పద్ధతిలో, మాన వీయ విలువలున్న మనదైన సమసమాజ నిర్మాణానికీ దేశ ఐక్యతకూ దోహదంచేసే విద్యను అందించగలుగుతాం. అప్పుడే తీవ్రవాదం, ఉగ్రవాదాలు తగ్గుముఖం పడతాయి.

**అ.శ్రీ :** వెనుకబడిన వారిలో అగ్రవర్ణాల వాళ్ళూ ఉన్నారు. సర్కారు బడుల్లో చదివిన పాతతరం వారి ఆంగ్లభాషాప్రావీణ్యంతో నేటి ఆంగ్ల మాధ్యమంలో నిండా చదివినవాళ్ళు పోటీ పడగలరా? లేరు. ఇది తెలుగు విషయంలోనూ ఉందనుకోండి. అంటే ఇక్కడ సమస్య నాణ్యత లోపించడం. నాణ్యమైన పద్ధతిలో ఆంగ్లాన్ని ఒక అంశంగా చదివినా చాలు. ఉద్యోగానికి కావలసిన నైపుణ్యం అందుతుంది. అందరూ మాతృభాషామాధ్యమం మనోవికాసాన్ని కలిగిస్తుందని చెపుతుంటారు. కానీ మాతృభాషామాధ్యమం ఎందుకు మనోవికాసాన్ని కలిగిస్తుందో అర్థం చేసుకోవాలి. ప్రాథమిక విద్య అంటే పిల్లవాడు తాను పెరుగుతూ చుట్టూ చూస్తున్న సమాజాన్ని, ఇంట్లో తారసపడే సన్నివేశాలనూ కలుపుకుంటూ, సంస్కృతిని మేళవిస్తూ సభ్యతని రంగరిస్తూ సాగాల్సిన విద్య. మరి తాను ఇంటా బయటా చూసేది ఒకటి. అక్కడ చదివేది ఒకటి. తెలుగుపిల్లల పాటల్లో తెలుగు వాతావరణం తెలుగు సంస్కృతి ఉంటుంది. ఇంగ్లీషు రైమ్స్‌లో ఇంగ్లీషు వాతావరణం ఉంటుంది. అది వాళ్ళకు ఎంత చెప్పినా అర్థం కాదు. ఇది నా ప్రత్యక్ష అనుభవం. అక్కడే వారి ఆలోచన బీటలు వారుతోంది. సృజనకు అడ్డుకట్ట పడుతోంది.

**చె.ఆ.రె :** తెలుగు లిపి ఇంకా కంప్యూటర్ ఫ్రెండ్లీ కావాలి.

**అ.శ్రీ :** ఇది వాస్తవం. తెలుగు లిపి కంప్యూటర్ ఫ్రెండ్లీ కావాలి. అది జరగాలంటే కంప్యూటర్లో యూనికోడ్ వాడకం పెరగాలి. నేడు అంతర్జాలంలో వాడడానికి వీలుగా ఉండే యూనికోడ్‌లో పుస్తకాలు ఎవ్వరూ వెయ్యడం లేదు. దానివల్ల ఎంతో విజ్ఞానాన్ని తెలుగులో పొందే అవకాశాన్ని కోల్పోతున్నాం. చావు అన్నదే లేని యూనికోడ్ను వదిలి ఒక పుట్టుకతోనే చచ్చే అను ఫాంట్లలోనే అందరు పుస్తకాలు వేస్తున్నారు. దీనికి కారణం వికృతంగా నోళ్ళు చాచుకొని కూర్చున్న వ్యాపారదాహం. అయితే అను కన్నా అందంగా సులభంగా యూని కోడ్‌లో పుస్తకాలు వేయవచ్చు. కానీ వాడరు. ఎందుకంటే ఇది ప్రజ లకు అందే ఉచితమైన ఫాంటు. అను కమర్షియల్.

**చె.ఆ.రె:** తెలుగు పదాలు వున్నచోట సంస్కృతం గాని, ఆంగ్లం గాని వాడవలసిన అవసరం లేదు.

**గా.ఉ.రా :** ఇక ఏ పదం వాడాలి, అరువు పదాలు ఉండాలా లేదా అనేది అసలు సమస్యే కాదు. ప్రతివారికి వారి నేపథ్యం, శిక్షణ, పనిచేసే రంగాన్నిబట్టి వాడుకలో తేడాలు ఉంటాయి. ఎవరు ఎలా రాయాలో మనం నియంత్రించగూడదు. రాయనీయండి, ఎవరికి ఇష్టమైన పద్ధతిలో వారిని. నేటి కంప్యూటరు మనకు ఇష్టమైన రీతిలో మన మాండలికంలో మనం చదువుకొనేందుకు ఒక్క క్షణంలో మార్చి మనముందు ఉంచుతుంది. దీన్ని తయారుచేయడానికి పెద్ద పరి జ్ఞానమూ తెలివీ అవసరం లేదు. ఇది త్వరలో అందరి ముందుకూ రానున్నది.

**అ.శ్రీ :** తెలుగు పదాలు వున్నచోట సంస్కృతం గానీ, ఆంగ్లం గానీ వాడవలసిన అవసరం లేదు. ముమ్మాటికీ నిజం. ఇది తెలుగు భాష వాడకానికి దన్నుగా ఉంటుంది. కానీ పదాలను వాడకంలో వాడుకరులను ఎవరూ నియంత్రించలేరు. చక్కగా సులభంగా తేలికగా ఉండే పదమే ఎప్పుడూ నాలుకపై ముందుంటుంది. కానీ ఈ రుద్దుడు కార్యక్రమం శాస్త్రపారిభాషిక పదాలలో బాగా జరిగింది.

నేడు గణిత, సామాన్య, భౌతిక, రసాయనాది శాస్త్రగ్రంథాల పాఠ్యాంశాలను తెలుగు మాధ్యమంలో తెలుగు పారిభాషికపదాల వాడుకతోనే రాస్తున్నారు. అయితే పారిభాషిక పదాలను కల్పించిన తీరులో కొంత అస్పష్టత కన్పిస్తుంది.

ఇప్పటికే వాడుకలో ఉన్న ప్రయోగాలపై కొత్త అనువాదాలను బలవంతంగా రుద్దడంవల్ల ప్రయోజనం ఉండదు. ఉదా : Soil అంటే నేల అనీ, Examination పరీక్ష అనీ స్థిరపడ్డాయి. వాటికి ప్రత్యా మ్నాయంగా మృత్తిక, నికష అని ప్రయోగిస్తున్నారు. వీటివల్ల ప్రయో జనం లేదు. Activity oriented – కర్తవ్యనిష్ఠ, Devotion to duty– తంత్రణీయం వంటి అనువాదాలు పరిభాషాకల్పన ప్రయో జనాన్ని దెబ్బతీస్తాయి. ఆంగ్లంలోని పదాలకు అనువాదాలు చక్కగా ఉంటే అవగాహన మెరుగవుతుంది.

ప్రత్యేక గ్రేడ్లు, స్టేషనరీ అధికారులు, సీనియారిటీ పట్టిక. ఇటువంటివి వ్యవహారంలో బాగా కలిసిపోయాయి, వాటిని పెద్దలు ఆంజనేయరెడ్డిగారు చెప్పినట్లు వైరిసమాసాలనీ అపశబ్దాలనీ తీసి పారెయ్యకూడదు. ఉదా: గర్భగుడి. అలాంటిదే. వ్యాప్తిలోకి వచ్చింది అలాగే ఉదా: వార్షిక హెచ్చింపు, వార్షిక ఇంక్రిమెంట్లు సెమినార్ నిర్వాహకులు మొదలైనవి. వీటిని వాడాలి.

**చె.ఆ.రె :** ప్రజలు మాట్లాడేదే భాషగాని పండితులు రాసేది మాత్రమే

కాదు.

**గా.ఉ.రా:** భాషను గురించి మీరు చేసిన సూచనలు అక్షరాలా నిజం. మన భాషా తత్త్వం గురించి చాలామంది చాలా చెప్పారు. ఇప్పుడు మన తక్షణ కర్తవ్యం, మన జన బలమూ, తెలివీ, సమయమూ అన్నింటినీ కలిపి తెలుగు మాధ్యమాన్ని నిలుపుకొనేందుకు కృషిచేయడమే. మనందరం తెలుగు మాధ్యమంలో చదువుకొని ఇంగ్లీషు నేర్చుకున్నవాళ్లమే. ఇప్పుడు విదేశాల్లో ఉన్నవారిలో 90% తెలుగుమాధ్యమంలో చదువుకున్నవారే. ఇంతమంది తెలుగు మాధ్యమంలో చదువుకున్నవారు జీవితంలో గెలిచి వెలుగుతున్నప్పుడు మనం భాషను బలిపెట్టవలసిన అవసరం లేదు.

**అ.శ్రీ :** మొత్తంగా చూస్తే ఎక్కువమంది రోజూ వాడే భాషలో ప్రాథమిక విద్య అందడం లేదు. ఇది మన అభివృద్ధికి మొదటి అవరోధం. పోనీ ఉన్నత విద్యలో చూద్దామంటే శాస్త్రవిషయాలకు సంబంధించి పాఠ్యపుస్తకాలుమాత్రమే తెలుగులో వస్తున్నాయి. అవీ కొన్నింటికే పరిమితం. కానీ పరిశోధన గ్రంథాలు తెలుగులో రావడంలేదు. అలా రావాలంటే పి.జి.స్థాయిలోనూ తెలుగుమాధ్యమంలో వివిధ శాస్త్రాల పఠనపాఠనాదులు జరగాలి. ఆంధ్రదేశంలో కొన్ని శాస్త్రాలకు సంబంధించి డిగ్రీస్థాయిలో తెలుగు మాధ్యమం ఉంది. ఆధునిక విద్యలు అస్సలే లేవు. ఎప్పటినుంచో ఉన్న న్యాయశాస్త్ర అధ్యయనం డిగ్రీ స్థాయిలోనూ లేదు. అది ప్రవేశపెట్టడం కష్టమా? అంటే కాదు. ఎందుకంటే కొన్ని రాష్ట్రాలలో మాతృభాషలోనే న్యాయవిద్య లభిస్తోంది. అంతే కాదు. బ్రిటీష్ హయాంలో దావాపత్రం, జవాబుపత్రం తెలుగులోనే ఉండేవి. జిల్లాస్థాయి న్యాయస్థానాలలో వాదోపవాదాలు కూడా తెలుగులోనే జరిగేవి. ఈ అంశాలన్నీ మనకి ఆదర్శం కావాలి.

300 సంవత్సరాలు ఫ్రెంచిభాష బ్రిటీష్ న్యాయస్థానాలలో ఉండడంవల్ల ఆంగ్లభాషలోనూ judge, summon, evidence, proof, petition, bail వంటి పదాలు ప్రవేశించాయి. అందువల్ల మనం వ్యవహారంలో ఉపయోగించే భాషాపదాలే అనంతరకాలంలో వ్యాప్తిలోకి వస్తాయి. కాబట్టి ఇక్కడ పదాలు కాదు ముఖ్యం. అవి ఎన్ని వచ్చినా మంచిదే. భాష ముఖ్యం. ఇదే తెలుగు భాషకు గడ్డుకాలమూ ఆశలు చివురులెత్తే కాలమూనూ. ఎందుకంటే పెద్దలు కూడా ఈ అంశాలపై దృష్టి పెడుతున్నారు. అంటే కదలిక వచ్చినట్లే. ఈ వేడిని చల్లారనివ్వకుండా ఈ వాడి మొద్దుబారిపోకుండా అంతా కలిసికట్టుగా ఇంకా ఇంకా ఆలోచించి పనిచేయాలన్నదే నా ఆలోచన.

❊

*మరికొందరు కూడా ఈ చర్చలో పాలుపంచుకుంటున్నారు.*
*ఆసక్తి కలవారు మరికొందరు కూడా చేరవచ్చునేమో...*
*మాకు వీలైనంతవరకు ఇక్కడ ఇచ్చాము.*

---

**(మాటామంతీ...** 22వ పుట తరువాయి)

బదులిస్తే మనల్ని మనమే తిట్టుకొన్నట్లు అవుతుంది. అయినా చెప్తాను. **మా గొంతులను నొక్కేసిన మా తొలిముఖ్యమంత్రి పర్లాకిమిడి రాజు దగ్గర నుండి ఇప్పటి వరకూ ఏ ఒడియా ప్రభుత్వమూ మాగోడును వినిన పాపాన పోలేదు. అది వాళ్ల నైజం అనుకొందాం. తెలుగు ప్రభుత్వాలకు ఏమయింది? మీరూ మేమూ ఒక తెలుగుతల్లి బొడ్డుపేగును పంచుకొని పుట్టినవాళ్లం కదా. ఎందరో రాజకీయ నాయకులూ హౌసు కమిటీవారూ, సినీ సాహితీ దిగ్గజాలూ ఇక్కడకు రావడం పోవడం అంతే. అందరి ముందూ మా గోడును వెళ్లబోసుకొంటాం. అంతా విని, ముఖ్యమంత్రిగారితో మాట్లాడి మీ సమస్యలను పరిష్కరిస్తాం అనేసి వెళతారు. మా సమస్యలు తీరుతాయనే ఆశతో ఎదురుచూస్తూనే ఉంటాం. ఏబై అరవై ఏళ్లుగా ఇదే తంతు. ఒక్కరూ పట్టించుకోలేదు. మాది ఒక్కటే కోరిక. మాకు తెలుగును నేర్పే పంతుళ్లను ఇవ్వండి, మా బడులను నిలబెట్టండి చాలు.** ❊

## జూన్ 2016 సంచికలో దొరలిన తప్పులకు సవరణలు



32వ పుటలో పాలగుమ్మి పద్మరాజు గారి చిత్రం బదులుగా పాలగుమ్మి విశ్వనాథం గారి బొమ్మను ముద్రించాము. ఈ పక్కన ఇచ్చినది పాలగుమ్మి పద్మరాజు గారి చిత్రం.

20వ పుటలో 2వ పేరాలో 3వ వరుసలో అసహాస్యం –తప్పు, అపహాస్యం –ఒప్పు.

13వ పుటలో తెలుగుమాటలు 21వ వరుసలో బాగుపడి –తప్పు, చాగుబడి –ఒప్పు.

పుట 15 : మొదటి నిలువరుస (కాలం)లో కొన్ని మాటలు ముద్రణలో రాలేదు. అవి ఈ క్రింది విధంగా ఉండాలి.

6.1) కడతఱి=గడిచిపోయిన తఱిని తెలుపునది–చదివెను, తినెను.

6.2) నడతఱి= నడుచుచున్న తఱిని తెలుపునది– నడుచుచున్నాడు, తినుచున్నది.

6.3) మీదుతఱి= జరుగబోవు తఱిని తెలుపునది– చదువుతాడు, తింటుంది.

6.4) పాటితతి= పాటిగా జరుగు పనులను తెలుపునది–గాలి వీచును, పొద్దు పుట్టును.

పుట–33 : 2వ నిలువరుసలో–

మ :మెలట్టూరు, పెద్దగుడి శాసనాలు తెలుపుతున్నాయి–తప్పు.

మ : మెలట్టూరు, చోళుల కాలం నుండే అంటే వెయ్యేండ్ల కిందటి నుండీ కళలకు నిలయం. ఆ విషయాన్ని తంజావూరి పెద్దగుడి శాసనాలు తెలుపుతున్నాయి – ఒప్పు.

పుట– 35 : ఒకటవ నిలువరుసలో – 5వ వరుసలో–

తెలుగు లిపులలో పుస్తకంలో తెచ్చినాము–అనేమాటను –తెలుగు కళారూపమైన మెలట్టూరు భాగవతం, తెలుగు నేలమీద ప్రచారంలోకి రావాలని మా కోరిక. అందుకే ఇప్పుడు (2016 మే 20), ప్రహ్లాద చరిత్రను దేవనాగరి + తెలుగు లిపులతో పుస్తకంగా తెచ్చినాము– అని చదువుకోవాలి.

పొరపాట్లకు మన్నించ ప్రార్థన. –సం.

-డా॥పరిమి రామనరసింహం
9849316730

# అన్ని భాషలూ సంస్కృతం నుంచే పుట్టాయని కేతనాదులు అన్నారా?

**అ**మ్మనుడి ఏప్రిల్ సంచికలో ప్రత్యేక వ్యాసంగా వచ్చిన ప్రయాగ కృష్ణమూర్తి గారి 'సంస్కృతము తల్లి కొన్ని భాషలకు మటుకు..' అనే వ్యాసం లోని కొన్ని అంశాల మీద స్పందనగా కొన్ని మాటలు రాయదలచుకున్నాను.

మొదటి మాటగా – **సంస్కృతం గొప్ప భాషా కాదు; మరొక భాష తక్కువ భాషా కాదు. ఏ భాష అయినా దాని వినియోగాన్ని బట్టి అది పసదేరుతుంది. వాడిన కొద్దీ పదునెక్కుతుంది. ఈ నాటి ఇంగ్లీషు లాగా. ఇదే ఇంగ్లీషు పద్దెనిమిదో శతాబ్దం వరకు ఇంత గొప్ప భాష కాదు.**

ప్రధానంగా కృష్ణమూర్తి గారి అభిప్రాయం ప్రాచీన భారతదేశం లోని వ్యాకర్త లందరూ ఈ దేశం లోని భాషలన్నీ సంస్కృతం లోనించే పుట్టినై అని నమ్మారని. అందుకు సాక్ష్యంగా మూలఘటిక కేతన రాసిన "తల్లి సంస్కృతంబె యెల్ల భాషలకును" అనే పద్య పాదాన్ని ఉట్టంకించారు. ఇట్లాంటి అర్థాన్నే ఇచ్చే మరొక పద్య పాదాన్ని కూడా ఉట్టంకించారు. ఇటీవలి కాలంలో పాశ్చాత్యులు వచ్చి మన దృక్పథాన్ని సరిదిద్దారని చెప్తూ, "పాశ్చాత్య శాస్త్రవేత్తలు ఫ్రాన్సిస్ వైల్ ఎల్లిస్, రాస్మన్ క్రిస్టియన్ రాస్క్, రాబర్ట్ కాల్డ్వెల్ .... పరిశోధనలు చేసి సంస్కృతం నుంచి దేశభాషలు పుట్టలేదని రుజువు చేశారు." అని రాశారు. ఇట్లాంటి అభిప్రాయం చాలా మందిలో ఉంది. నిజమే! మూలఘటిక కేతన ఒక పద్యం మొదటి చరణంలో "తల్లి సంస్కృతంబె యెల్ల భాషలకును" అని రాశాడు. సాధారణంగా చాలామంది ఈ ఒక్క చరణాన్ని మాత్రమే ఉట్టంకించి మాట్లాడుతూ ఉంటారు. కాని వారందరూ మూలఘటిక కేతన రాసిన ఈ పద్యం లోని ఈ మొదటి చరణాన్ని మాత్రమే కాకుండా పద్యాన్ని పూర్తిగా చదివే ఉంటారు. ఆ పద్యం ఇది:

*తల్లి సంస్కృతంబె యెల్ల భాషలకును*
*దాని వలన కొంత కానబడియె,*
*కొంత తాన కలిగి అంతయు నేకమై*
*తెనుగు బాస నాగ వినుతి కెక్కె.*

దీని అర్థం స్పష్టమే. ఈ పద్యంలో 'తల్లి సంస్కృతంబె' అనటాన్ని గమనించాలి. ఎవరో ఒకటే మయిన "భాష లన్నిటికీ తల్లి సంస్కృతమే" అని జోరీగ లాగా హోరు పెడుతుంటే, "సరేలే వయ్యా! అన్ని భాషలకూ తల్లి సంస్కృతమేలే!" అని వారిని కొంచెం దువ్వి, "దాని వల్ల కొంత (మాత్రమే) ఏర్పడింది, తనకు తానుగా కూడా కొంత ఏర్పడి అదంతా కలిసి 'తెనుగుభాష' అని ప్రసిద్ధి పొందిం దయ్యా!" అని చెప్తున్నట్లుంది ఈ పద్యం. అట్లా కాకపోతే, మొదటి చరణంలో చెప్పినదానికీ తర్వాత చెప్పినదానికీ పొంతన లేని విధంగా పద్యం రాశాడు కేతన అనుకోవాలి. మన లాగా కేతన యమ్మేలూ పీహెచ్చిడీలూ పాసుకాకపోయినా ఒక మాటకూ మరొక మాటకూ పొంతన లేని విధంగా పద్యం రాసి ఉంటాడా? అట్లా రాసి ఉండడనే అనుకోవాలి. ఎందుకంటే ఆయన తెలుగుకు వ్యాక రణం రాశాడు. పైగా తిక్కన గారి శిష్యుడు. సంస్కృతంలో దండి రాసిన దశకుమార చరిత్ర అనే గద్య కావ్యాన్ని పద్య కావ్యంగా రాసి తిక్కన గారికి అంకితం చేశాడు. భాష పట్ల అవగాహన కలిగినవాడే అయి ఉంటాడు.

నన్నయ నుండీ చిన్నయ దాకా ఉన్న వ్యాకర్తలందరికీ భాష పట్ల ఉన్న అవగాహన ఒకే తీరుగా కనిపిస్తుంది. వారి భాషాదృష్టి వారికి ప్రత్యక్ష అనుభవంలో ఉన్న సంస్కృతం, ప్రాకృతం, తెలుగు మొదలైన దేశ భాషల పరంగా ఉంటుంది. ఈ భాషలు వాక్యంలోని పదాల వరుస క్రమంలో మార్పును చాలావరకు సహిస్తై. 'నేను తొందరగా ఇంటికి వెళ్ళాలి' అనే వాక్యంలోని పదాలను ఏ క్రమంలో నైనా వాడవచ్చు. అదే ఇంగ్లీషులో అట్లా ఉండదు. దీనికి కారణం భారతీయ భాషలు రూప నిర్మాణం (= పదాలు ఏర్పడే విధానం) పట్ల మొగ్గు చూపే భాషలు కావటం. అదే ఆంగ్లం వంటివి వాక్య నిర్మాణం పట్ల మొగ్గు చూపే భాషలు. వీటిలో పదాల అమరికకు ఎక్కువ ప్రాధాన్యం ఉంటుంది. తెలుగు, సంస్కృతం వంటి భాషలు నేర్చుకోవాలంటే వస్తున్నాను, తింటున్నారు, కావాల్సివస్తుంది, ఇంటికి, ఒంట్లో, గోతులు, కోళ్ళు, కరోమి, కృత్వా, కర్తుం, గంతవ్యం, పపాఠ వంటి పదాలు ఏర్పడే విధానం నేర్చుకోవాలి. ఇంగ్లీషు నేర్చుకోవాలంటే వాక్యంలో పదాలు అమరే విధానం – అంటే composition– నేర్చుకోవలసి ఉంటుంది; అందువల్ల, తెలుగు, సంస్కృతం వంటి భాషలు నేర్చుకోటంలో వ్యాకరణం పాత్ర ఎక్కువగా ఉంటుంది. ఇంగ్లీషు వంటి భాషలు నేర్చుకోటంలో నిఘంటువు పాత్ర ఎక్కువగా ఉంటుంది. ఇంగ్లీషులో I will go– వంటి వాక్యంలోని పదాలన్నీ నిఘంటువులో దొరుకుతై. అదే తెలుగులో 'నేను వెళ్తాను' అనే వాక్యం లో నేను ఒకటే నిఘంటువులో దొరుకుతుంది. వెళ్తాను అనే పదం నిఘంటువులో దొరకదు; వెళ్ళు అనే ధాతువు మాత్రమే దొరుకుతుంది. కనుక 'వెళ్తాను' గురించి తెలుసుకోవాలంటే వ్యాకరణం చూడాల్సి ఉంటుంది.

అందువల్ల సంస్కృత వ్యాకరణం, అట్లాగే తెలుగు వ్యాకరణాలూ పద నిర్మాణం పట్ల ఎక్కువ మొగ్గు చూపుతున్నట్లు కనిపిస్తాయి. ఈ కారణం వల్లనే ఆధునిక భాషాశాస్త్రం అభివృద్ధి చెందుతున్న దశలో ప్రధానంగా చామ్స్కీ వాక్య నిర్మాణ విధానాన్ని నిరూపించే ఉత్పాదక వ్యాకరణం వెలువరించిన కాలంలో అమెరికాలో భాషాశాస్త్రం చదువుకుని వచ్చిన విద్వాంసులు భారతీయ వ్యాకరణాలకు పద నిర్మాణ దృష్టే కాని వాక్య నిర్మాణ దృష్టి లేదు అని పొరపడ్డారు. తర్వాత

తర్వాత భారతీయ వ్యాకరణాల లోని కారక నిరూపణ, విభక్తి రూపాల నిరూపణ అనేవి వాక్య స్వరూప నిరూపకాలేనని తెలుసుకున్నారు. వాక్యపదీయం వంటి గ్రంథాలను కూడా అర్థం చేసుకొని ప్రాచీన వ్యాకర్తలకు భాషపట్ల గల అవగాహన బాగానే ఉంది అని గ్రహించారు. గడిచిన రెండు దశాబ్దాలలో వచ్చిన సంగణక భాషాశాస్త్ర విశ్లేషణకు పాణిని వ్యాకరణ విధానం, కారక సిద్ధాంతం బాగా పనిచేస్తె అని కూడా గ్రహించారు.

చెప్పవచ్చేదేమంటే: భారతీయ వ్యాకర్తలు పదాన్ని ఒక ప్రామాణిక ఏకకంగా (unit గా) గుర్తించారు అని; ఆ కారణంగా వారు పదాలనే ఔపచారికంగా భాషాస్వరూపంగా పేర్కొనటం కనిపిస్తుంది అని. అందువల్లనే "సంస్కృత ప్రాకృత సమంబగు భాష తత్సమంబు" అనీ, "సంస్కృత ప్రాకృత భవంబగు భాష తద్భవంబు" అనీ, త్రిలింగ దేశ వ్యవహార సిద్ధంబగు భాష దేశ్యంబు" అనీ, "లక్షణ విరుద్ధంబగు భాష గ్రామ్యంబు" అనీ చెప్పుకున్నారు. ఈ సూత్రాలలో 'భాష' అనే పదాన్ని గుర్తించాలి. ఇక్కడ వారు ఉద్దేశించినది పదాలే. పదాలే భాష.

ఇక, ఒక భాషకు మరొక భాష 'తల్లి' అన్న మాటను చూద్దాం. నిజానికి తల్లి భాష పిల్ల భాషలు అని ఉండవు. అట్లా చెప్పటం మాట వరసకు చెప్పటమే... మామూలు జనానికి తేలికగా తెలియటానికి. సరిగ్గా చెప్పాలంటే–**ఒక భాష లోనించి మరొక భాష పుట్టటం ఉండదు. ఒక భాష రెండు లేదా కొన్ని భాషలుగా విడిపడిపోతుంది. ఒక నీటి ప్రవాహం ఆగిపోగా ఆ నీరు వేరువేరు కుంటలలో నిలిచిపోయి ఆయా కుంటలలోని నీరుగా వేరువేరు గుర్తింపులు పొందినట్లు అన్నమాట.** ఒక భాషా సమాజం వివిధ ప్రాంతాలకు వ్యాపించినప్పుడు ఆయా ప్రాంతాల మధ్య సంవాదం (communication) లేనప్పుడు ఆ ప్రాంతాలలో కాలక్రమేణ మొదట ఒకటిగానే ఉన్న ఆ భాషలో మార్పులు ఏర్పడి వేరువేరు భాషలుగా విడిపడిపోతుంది. ఏదైనా ఒక ప్రాంతంలో ఆ మొదటి భాష పేరు నిలిచి ఉన్నప్పటికీ అది కూడా తక్కిన 'పిల్ల' భాషలతో సమానమైన మరొక 'పిల్ల' భాషే కాని, వాటికి అది 'తల్లి' కాదు. ఆ తల్లి భాష (అంటే పిల్ల భాషలుగా విడిపడి పోయిన మొదటి భాష) ఆయా ప్రాంతాలలో మార్పులకు గురి అయి వేరుపడిపోయిన 'పిల్ల' భాషల రూపంలో నిలిచి ఉన్నదని తలంచాలి సిద్ధాంతపరంగా. అంతేకాని, ఆ మొదటి భాష తన మొదటి స్వరూపంలో ఉండదు..గ్రంథస్థం అయితే తప్ప. గ్రంథస్థం అయినప్పటికీ గ్రాంథిక రూపంలో విద్యా వ్యాసంగంలోనూ, కొన్ని సందర్భాలలో రచనా వ్యాసంగంలోనూ ఉంటుంది తప్ప వ్యవహారంలో ఉండదు.

మరి కేతన "తల్లి సంస్కృతంబె యెల్ల భాషలకును" అనటంలోని ఆంతర్యం ఏమిటి? మళ్ళీ రెండవ వాక్యంలోనే "దాని వలన కొంత (మాత్రమే) కానబడియె" అనటంలోనూ, ఆ తర్వాతి వాక్యంలో "కొంత తాన కలిగి అంతయు నేకమై తెనుగు బాస నాగ (=అనగ) వినుతి కెక్కె" అనటం లోనూ ఆయన ఆంతర్యం ఏమిటి?

ఈ పద్యంలోని రెండు, మూడు, నాలుగు చరణాలలో చెప్పిన దాన్ని బట్టి తెలుగు సంస్కృతంలోనించి పుట్టిన భాష కాదు అనే స్పష్టం అవుతున్నది. మరి సంస్కృతం తెలుగుకు తల్లి ఎట్లా అవుతుంది? ఇక్కడ 'తల్లి' అంటే వనరులకు నెలవు అయిన భాష (resourceful language) అని గ్రహించాలి. ఇంతకు ముందు చెప్పుకున్నట్లుగా తెలుగుతో సహా భారతీయ భాషలకు 'పదం' ముఖ్యమైన నిర్మాణ స్థాయికి చెందినది కనుక అ పదాలు అనే వనరులకు నెలవైన భాష సంస్కృతం అనే భావం తెలపటానికి ప్రాచీనులు 'అన్ని భాషలకూ సంస్కృతం తల్లి' అనే భావనను కలిగి ఉండేవారు. అది non-specialists కూ, సామాన్య జనానికీ 'తల్లి' అంటే 'జన్మనిచ్చినది' అనే భావం ఏర్పడటానికి కారణం అయింది. ఆ భావనను తొలగించి సరైన అవగాహన కల్పించటానికి మూలఘటిక కేతన అనే వ్యాకర్త :

> *"తల్లి సంస్కృతంబె యెల్ల భాషలకును*
> *దాని వలన కొంత (మాత్రమే) కానబడియె*
> *కొంత తాన (వతనంతట తానే) కలిగి అంతయు నేకమై*
> *తెనుగు బాస నాగ (వఅనగ) వినుతి కెక్కె"*

అని స్పష్టం చేశాడు. **తెలుగు మూల ద్రావిడ భాషాజన్యం కదా! తనంతట తానే ఎట్లా ఏర్పడుతుంది అనే సందేహం అక్కరలేదు. మూల ద్రావిడ భాషే ఈ ప్రాంతంలో తెలుగు రూపంలో కొనసాగుతున్నది. మూలద్రావిడానికి మూలం ఏది అన్న విచారం వేరు.**

భారతదేశంలో సంస్కృత ప్రాకృతాలే కాకుండా దేశి భాషలు కూడా స్వతంత్ర ప్రతిపత్తి కలిగి ఉన్నై అనే తెలివిడి ఇవ్వేళ కొత్తది కాదు. 11వ శతాబ్దానికి చెందిన హేమచంద్రుడు అనే వ్యాకర్త మరియు నిఘంటుకారుడు 'దేశి నామమాల' అనే నిఘంటువును కూర్చాడు. ఈ నిఘంటువులో ప్రాకృత భాషలలో వాడుకలో ఉన్న దేశి పదజాలం కూర్చబడింది. సంస్కృత మూలాలు కాని, ప్రాకృత మూలాలు కాని లేని పదజాలం ఇది.

కొడుకు+ ఆలు కోడాలు = కోడలు అయింది అని రాశారు కృష్ణమూర్తిగారు. 'కోడలు' "కొడుకు ఆలే" కాని మాట ఏర్పడిన తీరు అది కాదు. కోడ్– అనే ధాతువు ఉంది, young, egile అనే అర్థంలో. కోడ్–ఆలు కలిసి కోడలు అనే మాట ఏర్పడింది – తొలుత young lady అనే అర్థంలో. తర్వాత అది 'young lady of the house/family' (ఆ ఇంట్లో పుట్టిన ఆడపిల్లలు ఆ ఇంటి/కుటుంబం వారు కారు కనుక కొడుకు భార్యగా ఆ ఇంటికి వచ్చిన స్త్రీ)' అనే అర్థంలోకి మారింది. కొడుకు, కోడలు, కోడె(దూడ), మొదలైన మాటలు ఈ ధాతువు నించే ఏర్పడినై.

నన్నయ అనే పేరు గలవారు మరొకరు తెలుగునాట కనిపించటం లేదు కనుక, నన్ని అనే పదం కన్నడంలో ఉండటం వల్ల, భట్టు శబ్దం "సహజంగా" కన్నడ బ్రాహ్మణుల పేర్ల చివర ఉండటం వల్ల నన్నయ కన్నడం వాడు అని కృష్ణమూర్తి గారు రాశారు. నన్నయ అనే పేరు గలవాళ్ళు మరెవరూ కనపడక పోయినంత మాత్రాన ఆయన తెలుగువాడు కాడు అని తీర్మానించ లేమేమో. తిక్కన పేరు గలవాళ్ళు కూడా అంతగా కనిపించరు. అన్నట్లు, నన్నయగారి పక్కనే నన్నెచోడుడొకడు ఉన్నాడు కదా! నన్ని అనే మాట కన్నడంలో కూడా ఉంది. అంత మాత్రాన అది తెలుగు పదం కాకుండా పోదు. తెలుగు లోనూ తమిళం లోనూ పాలు అనే మాట ఉంది. కాబట్టి తెలుగు పాలు కూడా తమిళమే అందామా? ఇదంతా ఉమ్మడి ద్రావిడ పద సంపద. నల్ అనే మూలద్రావిడ ధాతువు ఒకటి ఉంది– అందమైన, ఒప్పైన అనే అర్థంలో. తమిళంలో నల్ల అంటే మంచి, అందమైన

అని అర్థం. ఈ మూలద్రావిడ ధాతువు నించి ఏర్పడిన పదాలు తమిళంలో ఉన్నై; కన్నడంలో ఉన్నై; తక్కిన ద్రావిడ భాషలలోనూ ఉన్నై. తెలుగులో కూడా ఉన్నై: నలి, నలువు (–ఒప్పిదం; చక్కనిది; శక్తి; సామర్థ్యం; అనురాగం; అందం; ఉత్సాహం) అని. వీటికి నిఘంటువులు కావ్య ప్రయోగాలు కూడా ఇచ్చినై. మహా భారత ప్రయోగాలే ఉన్నై. ఈ లకారం నకారం కూడా అవుతుంది – తెలుగు–తెనుగు లాగా. నన్నయగారు తన *బర్తు సర్టిఫికెట్* ప్రొడ్యూస్ చేసే దాకా ఆయన తెలుగువాడా కన్నడిగుడా అనేది పక్కన బెట్టి ఇప్పటికి ఆయన పేరు తెలుగుది కూడా అయిన నల్ ధాతుజన్యమే అనుకోటా నికి ఇబ్బంది లేదు. భట్ట శబ్దం కన్నడిగుల పేటెంటేమీ కాదు. శ్రీనాధుడు కూడా "శ్రీనాథ భట్ట సుకవి" అని చెప్పుకున్నాడు. గౌడ డిండిమ భట్టు ఒకడున్నాడు; వామన భట్ట బాణుడున్నాడు. ఆ కాలంలో ఓఢ్ర దేశంలోనూ వంగ దేశంలోనూ సంస్కృత పండితు లను భట్ట, భట్టాచార్య శబ్దాలతో గుర్తించేవారు.

"నన్నయగారు పండితుడవటం వల్ల రాజాస్థానాలకే పరిమిత మవటం వల్ల ఆయన ప్రజా వాహినితో మమేకం అవటం అరుదైన విషయం" అని రాశారు కృష్ణమూర్తి గారు. ఇందులో మూడు అంశాలు ఉన్నాయి. నన్నయ పండితుడు; ఆయన రాజాస్థానాలకే పరిమితం అయినవాడు; అటువంటివాడు ప్రజావాహినితో మమైకం కావటం అరుదైన విషయం. వీటిలో మొదటి అంశంతో పేచీ లేదు; ఒప్పుకోవచ్చు. రెండూ మూడూ అంశాలు మన ఊహను బట్టి చెప్పే మాటలే కాని వాటికి ఆధారాలు లేవు.

కృష్ణమూర్తిగారు తమ వ్యాసంలో నన్నయ సంస్కృతం తెలుగు కలిపిన ఒక మిశ్రమ భాషను తన రచన కొరకు తయారు చేసుకొని ఉండవచ్చు అనే భావాన్ని వెలిబుచ్చారు. భాషను ఎవరూ తయారు చెయ్యరు. సంస్కృతం పాణిని తయారు చేసినది కాదు. అట్లాగే భారతంలోని భాష నన్నయ సృష్టి కాదు. నన్నయ వాడిన భాష వంటి భాష, పద్యాలూ ఆయనకు ముందే ఉన్న శాసనాలలో కనిపిస్తై. అది ఆయన కంటె ముందు నాటి వ్యవహార భాషే. నిజానికి నన్నయ భారతం అంతటి ప్రామాణిక రచన ఒక్కసారిగా నింగి నించి ఊడి పడదు. అప్పటికే ఎన్నో గ్రంథాలు వచ్చి ఉంటై – కాల పరీక్షకు నిలవలేకపోయినవి. వాటిలో కూడా నన్నయ వాడిన భాష వంటి భాషే ఉండి ఉంటుంది. ఇందుకు సాక్ష్యం అప్పటి శాసనాలలో కనిపించే నన్నయ భాష వంటి భాషా, పద్యాలూనూ.

కృష్ణమూర్తి గారి మరొక అభిప్రాయం సంస్కృతం పండితుల భాషే కాని ప్రజల భాష కాదని. గ్రాంథిక భాష విషయంలో కూడా అటువంటి అభిప్రాయాన్నే వెలిబుచ్చారు: "ఏ భాషలో నైనా వ్రాయ టానికి ఒక భాష మాట్లాడటానికి ఒక భాష ఉపయోగిస్తారు. పండి తులు వ్రాసే భాష గ్రాంథికం... మాట్లాడే భాషను వ్యావహారికం అంటాం" అని రాశారు. అట్లా అయితే, పండితులు తమ గ్రాంథిక భాషను ఎక్కడి నించి తెస్తారు? వారందరూ ఒకచోట చేరి, ప్రజ లందరూ 'సత్త' (ప్రాకృతంలో) 'వస్తున్నారు' (వ్యావహారిక తెలుగులో) అంటున్నారు; మనం వాటిని 'సప్త' (సంస్కృతం) 'వచ్చుచున్నారు' (గ్రాంథిక తెలుగు) అని పెట్టుకుందాం అని తీర్మానిస్తారా? అట్లా వాళ్ళు ఒక కృత్రిమ భాషను తయారు చేసి దానికి ఒక వ్యాకరణం తయారు చేయించుకుని, అందులోనే కావ్యాలు రాస్తూ ఉంటారా? నన్నయ రాసిన వ్యాకరణం, పాణిని రాసిన వ్యాకరణం తమిళంలో తొల్కాప్పియం, కన్నడంలోని కర్ణాటక భాషా భూషణం మొదలైనవి అన్నీ అటువంటివేనా?

**భాష వాడుకలో ప్రజల నాలుకల మీదపడి నిరంతరం మారుతూ ఉంటుంది. ఒకడెవరో బయల్దేరి పరిసరాల ప్రభావంతో గొంతెత్తి ఏదో అలపిస్తాడు. అది నలుగురికీ ఆనందాన్నీ అబ్బురపాటునూ కలిగిస్తుంది. దాన్ని అందరూ నోట పడతారు. అట్లా సాహిత్యం మొదలౌతుంది. ఆ పాటలూ/గేయాలూ/కథనాలూ జాతి నిలుపు కుంటుంది. వాటిని కూర్చిన వారిమీద జాతికి గౌరవం ఏర్పడుతుంది. ఆ సాహిత్యం అందులోని భాషా అట్లా నిలిచిపోతై. ఒక పక్క మాట్లాడే భాష మారుతూనే ఉంటుంది. ప్రజలు నోట బట్టి నిలుపుకున్న సాహిత్య భాష మీద మాట్లాడే భాష ప్రభావం పడి ఆ సాహిత్య భాషలో కూడా కొన్ని మార్పులు చోటు చేసుకుంటై. అయినప్పటికీ వాటి మధ్య కొంత దూరం ఉంటూనే ఉంటుంది. ఒక దశలో ఆ భాషకు లిపి ఏర్పడుతుంది. అప్పటి వరకూ నోట బట్టి నిలిపి ఉంచు కున్న సాహిత్యాన్ని అక్షర బద్ధం చేస్తారు. ఇంతకు ముందు చెప్పు కున్నట్లుగా, అప్పటికే సాహిత్య భాషకూ మాట్లాడే భాషకూ కొంత దూరం ఏర్పడి ఉంటుంది. సాహిత్య భాష మాట్లాడే భాష కంటె వేరుగా ఉన్నదని ప్రజలు గ్రహిస్తారు. ఆ సాహిత్యకారుల మీద ఉన్న గౌరవం సాహిత్య భాష మీదికి కూడా మళ్ళుతుంది. రాసే భాషే సరైనదని, తాము మాట్లాడే భాష సరైనది కాదని భావిస్తారు. రాసే వారందరూ సాహిత్య భాషలోనే రాయాలనుకుంటారు; రాస్తారు. కాలం గడిచిన కొద్దీ రాసే భాష మాట్లాడే భాషల మధ్య దూరం పెరుగుతూ ఉంటుంది. అది అర్థం కాని పరిస్థితి వస్తుంది. అప్పుడు రాసే భాషకు వ్యాకరణం రాసేవాళ్ళు బయల్దేరుతారు. వ్యాకరణాలు రావటంతో 'భాష'కు అసహజమైన స్థిరత్వం గ్రాంథిక భాషకు ఏర్పడుతుంది. దాని వల్ల ఒక ప్రయోజనం కూడా కలుగుతుంది. గ్రాంథిక భాషలో రాసిన సాహిత్యం వేరువేరు ప్రాంతాలలోనూ, వేరువేరు కాలాలలోనూ వ్యాకరణం సహాయంతో అర్థం చేసు కునేందుకు వీలు కలుగుతుంది. ఇది ఇట్లా ఉంటూ ఉండగా మాట్లాడే భాషలో కూడా రచనలు మొదలౌతై. ఈ విధంగా కొత్త గ్రాంథిక భాష రూపు దిద్దుకుంటుంది. పాత గ్రాంథికంలో రాయటం తగ్గి పోతుంది. ఇది ఇట్లా కొనసాగుతూనే ఉంటుంది.**

వేదాలు ఆ నాటి వాడుక భాషలోనే రచించ బడినై. కాలాం తరంలో వేదాలు అట్లా ఉండగా, వాడుక భాషలో మార్పులు వచ్చి అది ఇవ్వేళ మనం అనుకుంటున్న 'సంస్కృతం' అయింది. అందులో రచనలు బయల్దేరినై. పాణినితో సహా ఎందరో వ్యాకరణాలు రాశారు. దానితో సమకాలికం అయిన వాడుక భాష మారుతూనే ఉంది, క్రమంగా అది 'ప్రాకృతం' అనే పేరుతో గుర్తించబడిన భాష అయింది. ప్రాకృతం అంటే ఒకటి కాదు: వేరువేరు ప్రాంతాలలో వేరువేరు ప్రాకృతాలు – మాగధి అనీ, శౌరసేని అనీ, మహారాష్ట్రీ అనీ, ఘూర్జర అనీ; ఇట్లా అనేకం. మళ్ళీ ప్రాకృతాలలో సాహిత్యం పుట్టింది. అవి గ్రాంథిక భాషలు అయినై. వాటికి సమకాలీనంగా ప్రజలు మాట్లాడు తున్న ప్రాకృతాలలో కూడా మార్పులు చోటుచేసుకున్నై. మార్పులకు గురి అయిన వాడుక భాషలను అపభ్రంశాలు అన్నారు; అవి మళ్ళీ మార్పులకు గురి అయి నేటి మరాఠీ, గుజరాతీ, హిందీ, బెంగాలీ,

మొదలైన ఉత్తరాది భాషలుగా రూపు దిద్దుకున్నై. వీటిలో కూడా ప్రమాణ భాషా, మాండలిక భేదాలతో ఉన్న వాడుక భాషా అనే తేడాలు ఉన్నై.

దీన్ని బట్టి గ్రాంథిక భాష ఒక నాటి వాడుక (వ్యవహార) భాషే నని గ్రహించాలి. కనుక నన్నయ తన భాషను తాను సృష్టించుకో లేదు. అదే విధంగా సంస్కృతం కూడా ఒకనాటి ప్రజల వాడుక భాషే. అదే క్రమంగా రాయటానికి ఉపయోగించే ప్రమాణ భాష అయింది. దానితో అది వాడుక భాషకు దూరం అయింది.

అయితే సంస్కృతం ఈ దేశంలో ఒక పని చేసింది. అదేమంటే: ఈనాడు ఏ పని చెయ్యటం కొరకు హిందీని (జాతీయ భాష అంటూ) దేశం అంతా వ్యాపింప జేయాలని చూస్తున్నారో ఆ పని. ఇంత కాలం ఇంగ్లీషు ఏ పని చేసిందో, చేస్తున్నదో ఆ పని. ఆ పనిని ప్రాచీన కాలంలో సంస్కృతం చేసింది. (నిజానికి హిందీ జాతీయ భాష కాదు; అది అధికార భాష మాత్రమే. మనకు జాతీయ గీతం ఉంది; జాతీయ చిహ్నం ఉంది; జాతీయ జండా ఉంది; జాతీయ పక్షి ఉంది; జాతీయ జంతువు ఉంది. అంతేకాని జాతీయ భాష లేదు. కాని రాజ్యాంగం గుర్తించిన షెడ్యూల్డు భాషలు ఉన్నై. అధికార భాష ఉంది.)

సంస్కృతంలో మాండలికాలు లేవు అని కృష్ణమూర్తిగారు రాశారు. సంస్కృతం మాట్లాడుతున్న కాలంలో మాండలికాలు ఉండేవి. సంస్కృత వ్యాకర్తలు వేరువేరు ప్రాంతాల వాడుకలోని తేడాలను అక్కడక్కడ చెప్తూవచ్చారు. పాణిని అయితే చాలాచోట్ల ఛందస్సులో (= వేదంలో) ఇట్లా ఉంది; భాషలో -అంటే మాట్లాడే దాంట్లో (= సంస్కృతంలో) ఇట్లా ఉంది అని చెప్తూ ఉంటాడు. వార్తికకారుడు (పాణిని సూత్రాలకు వృత్తి రాసిన వరరుచి) నపుంసక లింగం అయిన సరస్ శబ్దాన్ని దక్షిణాపథంలో సరసీ అని స్త్రీ లింగ రూపంలో వాడుతున్నారు అని రాశాడు. మహాభాష్యకారుడు (పాణిని వ్యాకరణానికి వరరుచి వృత్తికి కలిపి భాష్యం అంటే commentary రాసిన పతంజలి) కాంభోజ దేశంలో వెళ్తున్నాడు అనే అర్థంలో గచ్ఛతి అనటానికి బదులు శవతి అని వాడుతున్నారని రాశాడు. (శవ ధాతువుకు మౌలికంగా వెళ్ళటం అనే అర్థం. శవః అంటే ప్రాణం పోయిన దేహం అనేది రూఢిలో ఏర్పడిన అర్థం.)

భాషకు సంబంధించినది కాకపోయినా, మరొక అంశాన్ని కూడా స్థూలంగా ప్రస్తావిస్తాను.

ఆర్యులు మధ్య ఆసియా నించి వలస వచ్చారని, అందువల్ల వారి భాష అయిన సంస్కృతం విదేశీ భాష అని కృష్ణమూర్తి గారు రాశారు. ఇది కేవలం వారి ఒక్కరి అభిప్రాయమే కాదు: ఎన్నో వర్గాలవారు వారివారికున్న కారణాల వల్ల ఈ అభిప్రాయాన్ని పోషిస్తున్నారు. చాలామంది గతానుగతికంగా కూడా అందుకు వంత పలుకుతున్నారు. ఈ విషయంలో కృష్ణమూర్తిగారు ఇట్లా రాశారు:

"..........భాషాశాస్త్ర రీత్యా ఆ భాష (సంస్కృతం) ఆర్యుల ద్వారా భారతదేశం లోనికి క్రీ.పూ. 2000 ప్రాంతంలో ప్రవేశం చిందని చరిత్రకారులు చెప్పిన మాట."

**ఆర్యులు అనేవారు ఎవరూ దేశం వెలుపలి నించి రాలేదని, ఋగ్వేదార్యులు భారతదేశం లోని వారే నని, భారతీయు లందరూ జన్యు పరంగా ఒకే జాతికి చెందినవారని, ఋగ్వేదకాలం పాఠ్య పుస్తకాలలో చెప్పబడుతున్న క్రీ.పూ. 1200-1500కు కనీసం 2500 సంవత్సరాలకు ముందటిదని నిరూపించే పరిశోధనలు గత పాతిక సంవత్సరాలుగా కోకొల్లలుగా వెలువడినై.** వీరిపై మార్క్సిస్టు చరిత్ర కారులు హిందూత్వ ముద్ర వేయటం కూడా జరిగింది. ఈ విషయం మీద అంతర్జాలం (ఇంటర్నెట్)లో ఎంతో సమాచారం అందుబాటులో ఉంది. ఆసక్తి గలవారు దాన్ని చూడవచ్చు. బాబా సాహెబ్ అంబేద్కర్ కూడా ఆర్యులు వెలుపలినించి వచ్చినవారు కారు అన్న భావాన్ని చాలా ప్రామాణికంగా చెప్పారు. ఆసక్తి గలవారు డా॥బాబాసాహెబ్ అంబేద్కర్ రచనలు-ప్రసంగాలు సంపుటం 7 అన్న గ్రంథంలోని 'శూద్రులు-ఆర్యులు' అన్న అధ్యాయం-4 చూడవచ్చు. (ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ప్రచురణ 1994 -పుటలు 58-79).

*-రచయిత హైదరాబాదు కేంద్రీయ విశ్వవిద్యాలయంలో ఆచార్యులుగా పదవీ విరమణ చేశారు.*

*ఇమెయిల్:ramanarasimham46@gmail.com*

## ఔను తెలుగు బతికే వుంటుంది...

కవిత

ఒరే పెద్దన్నయ్యా! నువ్వు తెలిసే మాట్లాడుతున్నావో
తెలిసీ తెలీక తూలుతున్నావో తెలీదు గానీ
తెలుగు నిలిచే వుంటుందని ఎలా తేల్చగలుగుతున్నావ్?
ఇంగ్లీషు మీడియం హైస్కూళ్ళలో తెలుగు బతకదు
కేంద్రీయ విద్యాలయాల్లో హిందీ తప్ప తెలుగే వుండదు కదా..
మరి తెలుగుకేం కాదని ఎట్లా తీర్పిస్తున్నావ్?
నువ్వు ఇంగ్లీషు నోటితో స్పీకుతున్నావో
లేక హిందీ బాత్ బోల్తా హై..తో ముఝేమాలుం నహీఁ!
ఇది పునాదిని పడగొడ్తూ, పై దొంతువేస్తానంటున్నట్లు లేదూ?
ఏటా లక్షలాదిమంది తల్లిమాట పట్టించుకోకుండా పడిపడిపోతున్నా
ఇంట్లో, బడిలో, ఏలుబడిలో జనం నుడికి దిమ్మదిరిగిపోతున్నా..
తెలుగుకేం జరగదు జీవించే వుంటుందంటావ్ నువ్!
ఔను బతికే వుంటుంది భాయ్!
తెలుగు బతికే వుంటుంది బ్రదర్!
కానీ నీ వూహాపోహల ఆధిపత్య అలంకృతిలో కాదు
సంస్కృత సమాస సంరంభ సమీక్షణలో కాదు.
తొసి మాటతో, బోసి వూసుతో
తొత్తు కాళ్ళతో నడుస్తునే వుంటుంది
కళ్ళలో కొనఊపిరి మిగిల్చుకొని
నకనకలాడుతూ బతికే వుంటుంది
తత్తర్లాడుతూ తిరుగుతూనే వుంటుంది
చెవుల్లో చింతమానులు పెరుగుతుంటే
చూపుల్లో సర్కారు తుమ్మ పొడుస్తుంటే
వెన్నుపోటూ, తెన్ను తెన్నుకు వేటూ తగిలి, పొగిలి
పక్క శూలాలు విరిగి, చేతల చేతులకు సీలలు దిగి-
శిలువను మోస్తూ,
ముళ్ళకిరీటంతో ముందుకు కుంటుతూనే వుంటుంది-
అడుగుబడుగు అడుగడుగు బతుకుల్లో-బతుకుల పలుకుల్లో!

**-వెలుగు వెంకటసుబ్బారావు,** 9849569050

## మేలు మేలు మెలట్టూరు!

మాటామంతీ శీర్షికలో 'మెలట్టూరు' భాగవతం గురించి పరిచయం చేయటం చాలా సంతోషం కలిగించింది. మెలట్టూరు సంప్రదాయంలాగానే 'శాలియమంగళం' అనే చోట గూడ తెలుగు నాటక సంప్రదాయం నేటికీ సజీవంగా ఉంది.

తంజావూరు నుండి నాగపట్టణం వెళ్ళే దారిలో 'శాలియ మంగళం' అనే ఊరు ఉంది. నరసింహజయంతికి ముందు అక్కడ తెలుగు నాటకాలు వేసే పారంపర్య కుటుంబాలున్నాయి. వారిది ఒక నాటకమయినా చూద్దామని 1995లో వెళ్లాము సకుటుంబంగా. మా దురదృష్టం–నాటక ప్రదర్శన క్రితం రాత్రే అయిపోయింది. మేము వెళ్లిన రాత్రి ఆంజనేయోత్సవం జరుగుతూ ఉంది. ముగింపుగా జరిగే భజన, పాటలతో కూడిన కార్యక్రమం అది. అన్నీ తెలుగు పాటలే పాడారు. 10, 12 సంవత్సరాల వయసుగల బాలికలు ఎంత బాగా తెలుగు పాటలు పాడారో! ఎంత స్పష్టతో! కానీ ఆ పిల్లలకు తెలుగు రాదు..పెద్దవారికి కొంత వచ్చు. అంత దూరం నుండి వచ్చిన మా ఆశ తెలిసిన ఒక పెద్ద తన 60 సంవత్సరాల తమ్ముడిని ఒక పాటను అభినయించి చూపమన్నాడు. ఉత్తరీయాన్నే పైటచెంగుగా చుట్టుకొని ఎంత వయ్యారంగా అభినయం చేశాడో! ఇప్పటికీ కళ్ళ ముందు నిలుస్తుంది.

వాళ్ల దగ్గర నాలుగు నాటకాలు పూర్వం నుండి వస్తున్నాయట. అవి తమిళలిపిలో వ్రాసిన తెలుగు నాటకాలు. రుక్మిణీ కల్యాణం, ప్రహ్లాద చరిత్ర, సీతాకల్యాణం, నాల్గవది ఇపుడు గుర్తు లేదు. ఇదివరకు అన్నీ వేసేవారట. ఇపుడు ప్రహ్లాద చరిత్ర మాత్రమే ప్రదర్శిస్తున్నారు. అన్నీ కుటుంబ సంప్రదాయంగా ఆడతారు. నటులు ఉద్యోగరీత్యా బొంబాయి, మద్రాసు వంటి దూర ప్రాంతాలలో ఉంటూ గూడ ఈ సందర్భానికి సెలవు పెట్టుకొని ఇక్కడకు వస్తారుట. వాళ్ళ కుటుంబాలలో ప్రతి మొదటి మగ సంతానం ఈ నాటక పాత్రను అభ్యసిస్తారట.

వాళ్ల ఊరులో తప్ప మరెక్కడ ప్రదర్శించమన్నా, ధనమిచ్చినా ప్రదర్శించరుట. ఢిల్లీ నాట్య అకాడమీ (డాన్స్ అండ్ డ్రామా) వారి బలవంతం మీద ఒకసారి మదరాసులో వేశామని చెప్పారు. ఇక్కడ నాటకం చూడటానికి చుట్టుపక్కల పల్లెల నుండి వస్తారు. ప్రేక్షకులు 98శాతం తమిళులే. వాళ్లకు తెలుగు తెలియదు. అయినా నాటకంలోని హాస్య సంభాషణలకు తెలుగు వచ్చినట్లే నవ్వుతారుట. కృష్ణాతీరం నుండి అంతదూరం వెళ్లి గూడ నాటకం చూడనందుకు మా అంత బాధను వాళ్లు గూడా పడ్డారు.

వారు మా నిరాశను గమనించి ఒక తరుణోపాయం చెప్పారు. ప్రహ్లాద నాటకంలో 'లీలావతి' పాత్రధారి మదరాసు దగ్గర ఆవడిలో ఉంటారు. అతని దగ్గర ప్రహ్లాద నాటకం వీడియో ఉంది. మీరు వెళ్లి చూడండి అని చెప్పి–మరొకతను అతనికి తెలియజేసి సిద్ధం చేశారు. మేము 'పుదుక్కోట'లో గోపాలకృష్ణ భాగవతార్‌గారి భజన కార్యక్రమాలు చూసుకొని ఆవడికి వెళ్లాము. (పుదుక్కోట భాగవతార్ గారి సంప్రదాయం గురించి గూడ తెలుసుకోదగినదే)

మా రాక కోసం అతను సెలవు పెట్టుకొని ఎదురు చూస్తున్నాడు. సుమారు 40 సంవత్సరాలుంటాయి. తన పది సంవత్సరాలు పిల్లవానికి అప్పుడే తెలుగునాటకం నేర్పుతున్నాడు. తాను వేసే స్త్రీ పాత్రనే అభ్యాసం చేయిస్తున్నాడుట. అతనికి తెలుగు ఫరవాలేదు బాగానే అర్థం అవుతున్నది.

ఆ వీడియో చూడటం మహా సంతోషం కలిగించింది– అది అట్లా ఉంచండి. అందులోని ప్రదర్శన విశేషాలు చెపుతాను. నాటకమంతా రంగస్థలం మీద జరుగుతుంది. నరసింహావతారం–రంగస్థలం దిగి–ప్రేక్షకులను దాటి దూరాన జరుగుతుంది. హిరణ్యకశిపుడు బయట ఉన్న స్థంభం పగలకొడతాడు. అవతారం వెలువడుతుంది. ప్రేక్షక ప్రజలందరు అక్కడకు వెళ్ళి హారతులిస్తారు, కొబ్బరికాయలు కొడతారు, కొందరు మొక్కులు తీర్చుకుంటారు. అవతారం రౌద్రంగా ఉంటుంది. క్రితం మూడు రోజుల నుండి ఉపవాసదీక్షతో ఉంటాడుట. తలకు నరసింహావతారం మాస్కు ధరిస్తాడు. ప్రదర్శన తర్వాత ఆ ముఖానికి పూజాదికాలు చేసి పూజామందిరంలో ఉంచుతారుట.

ప్రేక్షకులు హిరణ్యకశ్యప సభాసదులుగా మారిపోవటం ఒక విశేషం. హిరణ్యకశ్యప వధ సాయంసంధ్యలో జరిగింది. నాటకంలో సాయంసంధ్య కావాలంటే నాటకం మధ్యాహ్నం ప్రారంభించవలసి వుంటుంది. అందుకని అర్థరాత్రి నాటకాన్ని ప్రారంభించి ఉదయ సంధ్యలో రాక్షస వధ జరిగినట్లు సవరించుకున్నారు. ఎట్లా అయితే నేమి సంధ్యాకాలంలోనే నిర్వహించారు– ఇవీ ప్రదర్శన విశేషాలు.

వారి పుస్తకాలను అచ్చువేయటానికి ప్రయత్నిస్తానన్నాను. అందుకు వాళ్ళ పెద్దల సంప్రదాయం అంగీకరించదని చెప్పారు. నాటక పాత్రధారుల వద్ద స్వయంగా వ్రాసుకున్న తమిళలిపి తెలుగు పుస్తకాలు ఉంటాయట. ఇట్లాంటి ఊళ్లు కొన్ని ఉన్నాయట. శాలియమంగళం, మెలట్టూరు, తేపెరుమనల్లూరులలో ఇంకా వీటిని ఆడుతున్నారు. సూలమంగళం, ఊత్తుకాడు, మన్నారుగుడి అనే ఊళ్ళలో ఇటీవలే ఆగిపోయాయి. ప్రాచీన వైదిక వండితులు వేదాలను వంశపారంపర్యంగా మాత్రమే కాక మతైకభక్తితో నిలుపుకున్నట్లు వీరు మౌఖికంగా నిలుపుకున్నారు. నాటక ప్రదర్శన వారికి వినోద విషయం కాదు. మతస్థాయి గౌరవాన్ని పొందింది వారి వద్ద. అది పరోక్షంగా తెలుగుభాషకు గౌరవం గూడ.

**–వావిలాల సుబ్బారావు,** 9866402973

### జాతీయస్థాయి కథలపోటీలు

'కళల దండోరా' తృతీయ వార్షికోత్సవ సందర్భంగా కళాకారుల్ని, రచయితల్ని ప్రోత్సహించాలనే సదుద్దేశంతో 1. కథల పోటీ, 2. డప్పులపోటీ 3. కవి సమ్మేళనం నిర్వహించనున్నాము. కథల పోటీకి వచ్చే రచనలు, డప్పుల పోటీలో పాల్గొను కళాకారుల వివరాలు, కవి సమ్మేళనంలో పాల్గొను కవుల వివరాలు జులై 29, 2016లోగా 'అంగలకుర్తి ప్రసాద్, సంపాదకులు, కళల దండోరా మాసపత్రిక, సంజయ్‌గాంధీ కాలనీ, సి.యస్.ఆర్.శర్మ కాలేజీ వెనుక, ఒంగోలు–523 001, ప్రకాశంజిల్లా' అనే చిరునామాకి పోస్ట్/ కొరియర్ ద్వారా పంపవలెను. ఈ పోటీల తుది నిర్ణయం నిర్వహణ కమిటీదే. ఫోన్: 94925 09969. బహుమతి ప్రదానోత్సవ సభ ఒంగోలులో ఆగస్టు 20న ఉంటుంది.

-చలసాని నరేంద్ర,
984956050

# జల వివాదాలు ప్రజల చూపును మళ్లించడం కోసమేనా !

**ఎగువ రాష్ట్రాలలో అక్రమంగా పలు సాగునీటి ప్రాజెక్టుల నిర్మాణం జరుగుతూ ఉండడంతో రెండు తెలుగు రాష్ట్రాలూ కొంతకాలంగా తీవ్రమైన సాగు, తాగునీటి సమస్యలను ఎదుర్కొంటున్నాయి. శతాబ్దకాలం నాటి డెల్టా ప్రాంతాలు బీడుల్లా మారుతున్నాయి. చట్టపరంగా కేటాయించిన జలాలు వరదలు వస్తే మినహా తెలుగు రాష్ట్రాలకు చేరుకోలేని పరిస్థితులు నెలకొన్నాయి. వరదలు వస్తే గాని తాగునీరు సహితం లభించడం లేదు. ఇటువంటి సమయంలో రెండు రాష్ట్రాలలోని తెలుగు ప్రజల సమస్యల పరిష్కారం కోసం రెండు రాష్ట్ర ప్రభుత్వాలు సమిష్టిగా, వ్యూహాత్మకంగా వ్యవహరించవలసింది పోయి తరచూ ప్రజలను రెచ్చగొట్టే రీతిలో వ్యవహరిస్తూ అగ్గి రాజేస్తూ ఉండటం దురదృష్టకరం.తెలుగు ప్రజల ప్రయోజనాలకు విరుద్ధంగా వ్యవహరిస్తున్న మహారాష్ట్ర, కర్ణాటక ప్రభుత్వాలపై పరుషంగా ఒక్కమాట కూడా వీరు మాట్లాడటం లేదు.**

**రెం**డు తెలుగురాష్ట్రాలలో ప్రభుత్వాలు ఏర్పడి రెండేళ్లు ముగిసినా పరిపాలనలో ప్రజా సమస్యల పరిష్కారం పట్ల, అభివృద్ధి పథకాల పట్ల చూపు సారించకుండా సున్నిత అంశాలను వివాదాస్పదంగా మారుస్తూ, రెండు రాష్ట్రాల లోని ప్రజల లోని భావోద్వేగాలను రెచ్చ గొట్టడం ద్వారా తమ పబ్బం గడుపుకొనే ప్రయత్నం చేస్తున్నట్లు కనిపిస్తున్నది. రాష్ట్ర విభజన తొందరపాటుతో, తగు ముందస్తు కసరత్తు చేయకుండా జరగడంతో తలెత్తుతున్న సమస్యలలో నీటి వనరుల పంపిణీ ఒకటి.



చర్చిస్తున్న ఇరు రాష్ట్రాల మంత్రులు, బోర్డు అధికారులు

గత రెండు సంవత్సరాలుగా వర్షాభావ పరిస్థితులు నెలకొని, ముఖ్యంగా కృష్ణా నదిలో నీరు అడుగంటి పోవడంతో రెండు రాష్ట్రాలు తీవ్రమైన దుర్భిక్ష పరిస్థితులను ఎదుర్కొన్నాయి. ఇటువంటి సమయంలో అప్రమత్తంగా, సామరస్యంగా వ్యవహరించి, దుర్భిక్ష ప్రాంత రైతులను ఆదుకోవడంలో రెండు ప్రభుత్వాలూ నిర్లక్ష్యం వహించి, ముందస్తు జాగ్రత్తలు తీసుకొనక పోవడాన్ని చూసాము.

రెండు రాష్ట్రాల మధ్య నీటి పంపిణీకి సంబంధించి ఒక వంక కృష్ణానది యజమాన్య బోర్డు, మరో వంక కేంద్ర జలవనరుల శాఖ తమవంతు ప్రయత్నాలు చేస్తున్నాయి. అందుకు గల అన్ని అవకాశాలను ఉపయోగించుకొని, సామరస్యంగా పరిష్కారం కనుగొనే ప్రయత్నం చేయకుండా బోర్డు పనితీరు పట్ల ఆక్షేపణ తెలుపుతూ వివాదం లేవదీస్తూ ఉండడంతో ఉద్రిక్త పరిస్థితులు నెలకొనే ప్రమాదం ఏర్పడింది. ప్రజల భావావేశాలను రెచ్చగొట్టే ప్రయత్నం జరిగితే సామరస్యంగా అవగాహనకు రావడం కష్టం కాగలదు.

ఈ విషయమై స్వయంగా కేంద్ర జలవనరుల మంత్రి ఉమా భారతి జోక్యం చేసుకొని, రెండు రాష్ట్రాలకు నచ్చచెప్పే ప్రయత్నం చేశారు. ఇద్దరూ కలసి చర్చించుకొని ఒక అవగాహనకు రావాలని రెండు రాష్ట్రాల నీటిపారుదల మంత్రులకు సూచించారు. లేనిపక్షంలో కేంద్రం జోక్యం చేసుకొంటుందని స్పష్టం చేస్తూ అందుకు ఒక నెల రోజుల గడువు ఇచ్చారు. ఆమె సూచనపై ఇద్దరు మంత్రులు ఢిల్లీలోనే సమావేశం జరిపినా ఎవరికి వారు మొండి వాదనలు వినిపించడంతో ఒక అవగాహనకు రావడానికి సిద్ధంగా లేమనే సంకేతం ఇచ్చారు.

సహజంగా నదీ జలాల పంపిణీ విషయంలో రాష్ట్రాల మధ్య వివాదం ఎక్కడ తలెత్తినా రెండు ప్రభుత్వాలూ ఇచ్చి పుచ్చుకొనే ధోరణిలో వ్యవహరించి, పరిష్కారం కనుగొనడమే ఉత్తమం. కోర్టుల ద్వారా, కేంద్ర ప్రభుత్వం ద్వారా పరిష్కారం లభిస్తుందని ఆశించలేము. క్షేత్రస్థాయిలో అమలు జరుపవలసింది రాష్ట్ర ప్రభుత్వాలే కనుక ఇటువంటి సున్నిత అంశాల అమలు బలవంతంగా అయ్యే పని కాదు. రాష్ట్ర ప్రభుత్వాల సహకారం లేకుండా దేశంలో ఎక్కడా ఇటువంటి వివాదాల పరిష్కారం జరగలేదు.

ఒక వంక బోర్డు పక్షపాతంగా వ్యవహరిస్తున్నదని అంటూ తెలంగాణ ప్రభుత్వం కేంద్రం వద్ద ఆక్షేపణ తెలుపుతూ ఉంటె, మరో వంక తెలంగాణ ప్రభుత్వం ఏకపక్ష వైఖరిని అవలంబిస్తున్నట్లు ఆంధ్రప్రదేశ్ వాదిస్తున్నది. తెలంగాణ ప్రభుత్వం అక్రమ ప్రాజెక్టుల నిర్మాణం ద్వారా 155 టీఎంసీలను అదనంగా వినియోగించుకోవాలని చూస్తోందని ఆంధ్రప్రదేశ్ ఆరోపిస్తూ ఉంటే, కృష్ణానది యాజమాన్య బోర్డు తన పరిధిని దాటి వ్యవహరిస్తున్నదని తెలంగాణ ప్రభుత్వం ఆరోపిస్తున్నది.

బోర్డు ఆంధ్రప్రదేశ్‌కు అనుకూలంగా నిర్ణయం తీసుకుంటున్నదని తెలంగాణ నీటిపారుదలశాఖ మంత్రి హరీష్‌రావు నేతృత్వంలో,

అధికార పార్టీ లోక్‌సభ సభ్యులంతా కలిసి ఉమాభారతికి ఇంతకుముందు ఫిర్యాదు చేశారు. ప్రస్తుతం ఉన్న జలవనరులనే కాకుండా భవిష్యత్తులో రెండు రాష్ట్రాలలో రాబోవు సాగునీటి పథకాలలో సైతం వాటాల పంపిణీ జరగాలని తెలంగాణ ప్రభుత్వం ఇప్పుడు కోరడం ఆంధ్ర ప్రదేశ్‌కు ఆమోదయోగ్యంగా కనబడటం లేదు. ముఖ్యంగా పోలవరం, పట్టిసీమల నుండి వాటా కోరుతున్నారు.




మరోవంక బోర్డు పరిధిని నిర్ణయించి నోటిఫికేషన్ చేయకపోతే తమ భూభాగంలో ఉన్న నాగార్జున సాగర్ కుడి కాలువ హెడ్ వర్క్సును తామే నిర్వహించుకుంటామని, ఎవరి భూభాగంలో ఉన్న వాటిని వారే నిర్వహించుకొంటే సరిపోతుందని ఆంధ్రప్రదేశ్ వాదిస్తున్నది. విభజన చట్టంలో పేర్కొన్నట్లుగానే రెండు రాష్ట్రాలకు నీటి పంపకాలు చేపట్టాలని మాత్రమే తాము కోరుతున్నట్లు ఆంధ్రప్రదేశ్ నీటిపారుదల శాఖ మంత్రి దేవినేని ఉమామహేశ్వర రావు స్పష్టం చేశారు. కేంద్రం అపెక్స్ కౌన్సిల్ సమావేశం ఏర్పాటు చేయాలని ఆయన కోరారు.

సాగునీటి ప్రాజెక్టుల విషయంలో రెండు ప్రభుత్వాల ధోరణి ప్రజల అవసరాలు తీర్చే విధంగా కనిపించడం లేదు. అత్యంత ప్రాధాన్యత గలదిగా పేర్కొన్న పోలవరం ప్రాజెక్టు నిర్మాణంలో కాంట్రాక్టులలో లాలూచి పడటం పట్ల చూపుతున్న ఆసక్తి ప్రాజెక్టు పనులు వేగంగా పూర్తిచేయడం పట్ల ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం చూపడం లేదు. ఈ విషయమై కేంద్ర కోరిన వివరణలకు తగు సమాధానాలు లేకపోవడంతో ఒక విధంగా ప్రతిష్టంభన ఏర్పడినట్లు అయింది. ఈ ప్రాజెక్టును అదే విధంగా ఉంచి, రాష్ట్ర ప్రభుత్వం పట్టిసీమ పథకం పట్ల ఆసక్తిని చూపింది.

పట్టిసీమ ప్రాజెక్టును 12 నెలల వ్యవధిలో పూర్తిచేయాలి అని టెండర్ షరతులతో ఉన్నా, ముందుగా పూర్తి చేస్తున్నందుకు నిబంధనలను మార్చి అదనంగా రు. 270 కోట్ల మేరకు కాంట్రాక్టర్‌కు చెల్లించారు. కాంట్రాక్టు పూర్తి చేయడానికి 12 నెలల సమయం తీసుకున్నారు. గోదావరిలో వరద వచ్చేది జూన్ నెలాఖరు లేదా జూలైలో అని అందరికి తెలుసు. జూన్ నెలాఖరు వరకూ పనులు చేసుకునే సౌలభ్యం ఉన్నా అదనంగా రూ.270 కోట్ల మేరకు చెల్లించి మార్చి ఆఖరుకు పూర్తి చేయించవలసిన అవసరం ఎందుకు వచ్చింది?

మరోవంక తెలంగాణ ప్రభుత్వం పెండింగ్ ప్రాజెక్టులను పూర్తి చేయడం పట్ల దృష్టి సారించకుండా, ఉన్న ప్రాజెక్టుల డిజైన్‌లను మార్చి, కొత్త పేర్లు పెట్టి, అంచనా మొత్తాలను భారీగా పెంచి ప్రజల ముందు కలల ప్రపంచం ఉంచుతున్నారు. ఈ సందర్భంగా చేపట్టిన మల్లన్న సాగర్ ప్రాజెక్టు తీవ్ర ప్రతిఘటనకు గురవుతున్నది. ఒక్క ప్రాజెక్టుకు కూడా సవివరమైన నిర్మాణ సంబంధ సాంకేతిక నివేదికలను బయట పెట్టకుండా, వాటి సాంకేతిక వెసులుబాటును చర్చించకుండా చేపట్టడం చూస్తుంటే తీవ్ర ఆందోళన కలుగుతున్నది. ఉదాహరణకు మల్లన్న సాగర్‌లో 50 టియంసిల నీటిని ఎత్తిపోతల ద్వారా నిల్వ చేయాలని తలపెడుతున్నారు. అందుకు అవసరమైన సాంకేతిక ప్రణాళికను బయట పెట్టడం లేదు. ప్రపంచంలో ఎక్కడా అంత భారీ స్థాయిలో ఎత్తిపోతల ద్వారా నీటి నిల్వ జరుపుతున్నట్లు లేదని నిపుణులు చెబుతున్నారు.

ఇలా ఉండగా, ఎగువ రాష్ట్రాలలో అక్రమంగా పలు సాగునీటి ప్రాజెక్టుల నిర్మాణం జరుగుతూ ఉండడంతో రెండు తెలుగు రాష్ట్రాలూ కొంతకాలంగా తీవ్రమైన సాగు, తాగునీటి సమస్యలను ఎదుర్కొంటున్నాయి. శతాబ్దకాలం నాటి డెల్టా ప్రాంతాలు బీడుల్లా మారుతున్నాయి. చట్టపరంగా కేటాయించిన జలాలు వరదలు వస్తే మినహా తెలుగు రాష్ట్రాలకు చేరుకోలేని పరిస్థితులు నెలకొన్నాయి. వరదలు వస్తే గాని తాగునీరు సహితం లభించడం లేదు. ఇటువంటి సమయంలో రెండు రాష్ట్రాలలోని తెలుగుప్రజల సమస్యల పరిష్కారం కోసం రెండు రాష్ట్ర ప్రభుత్వాలు సమిష్టిగా, వ్యూహాత్మకంగా వ్యవహరించవలసింది పోయి తరచూ ప్రజలను రెచ్చగొట్టే రీతిలో వ్యవహరిస్తూ అగ్గి రాజేస్తూ ఉండటం దురదృష్టకరం. తెలుగు ప్రజల ప్రయోజనాలకు విరుద్ధంగా వ్యవహరిస్తున్న మహారాష్ట్ర, కర్ణాటక ప్రభుత్వాలపై పరుషంగా ఒక్కమాట కూడా వీరు మాట్లాడటం లేదు. పైగా వారి వద్దకు వెళ్లి సమాలోచనలు జరపడం, ఒప్పందాలు చేసుకోవడం చేస్తున్న తెలంగాణ ప్రభుత్వం ఆంధ్రప్రదేశ్ విషయంలో మాత్రం ఏకపక్షంగా వ్యవహరిస్తున్నదనే విమర్శలు చెలరేగుతున్నాయి.

రాష్ట్ర విభజన సమయంలోనే జలవివాదాలకు సంబంధించి పరిష్కారం కోసం వ్యవస్థాగత ఏర్పాట్లు చేశారు. రెండు రాష్ట్రాలకు చెందిన ఉన్నతాధికారులు తరచూ కేంద్ర జల సంఘం ఆధ్వర్యంలో సమావేశం అవుతూనే ఉన్నారు. నేరుగా కలుసుకొని చర్చించుకోలేని

పక్షంలో ఇటువంటి వేదికలను ఉపయోగించుకోవచ్చు. ఈ సందర్భంగా రెండు రాష్ట్ర ప్రభుత్వాల వాదనలు సహజంగానే భిన్నంగా ఉంటున్నాయి. అంతమాత్రం చేత ఏకాభిప్రాయానికి వచ్చే ప్రయత్నాలు చేయకుండా, ప్రజల మధ్య ఉద్రిక్తతలను రెచ్చగొట్టే ప్రయత్నాలు చేయడం ద్వారా రాజకీయ లబ్ధి పొందాలని ప్రయత్నం చూడడం పరిస్థితులను మరింతగా విషమింప చేయగలదు.

జలవనరుల పంపిణీలో అందరూ ఆమోదించిన కొన్ని ప్రమాణాలు ఉన్నాయి. ముందుగా త్రాగునీటికి ప్రాధాన్యత ఇవ్వాలి. తరువాతనే సాగునీటికి, ఆ తరువాత విద్యుత్తు అవసరాలకు ఉపయోగించాలి. ఇటువంటి సాంప్రదాయాలను సహితం తరచూ ఉల్లంఘిస్తున్నారు. ఏది ఏమైనా కృష్ణ, గోదావరి నదులు రెండు రాష్ట్రాల నుండి ప్రవహిస్తున్నాయి. వాటిని కూడా విభజించి, రాష్ట్రాల వారీగా కట్టబెట్టడం సాధ్యం కాదు. అందుచేత వీటి జలాలను ఉపయోగించుకొనే విషయంలో రెండు రాష్ట్రాలు ఒక అవగాహనకు రావడం తప్ప మరో మార్గం లేదు.

ఈ సందర్భంగా **రెండు రాష్ట్రాల ప్రయోజనాలనూ దృష్టిలో ఉంచుకొనవలసిందే. సరికొత్త వివాదాలను లేవదీయకుండా, పరస్పరం అవగాహనతో ఒక పరిష్కారానికి వచ్చే ప్రయత్నం చేయాలి. అందుకు ఇద్దరు ముఖ్యమంత్రులు కలసి స్వయంగా సమాలోచనలు జరపడం, వారి సమక్షంలోనే ఇరు రాష్ట్రాల నీటిపారుదల అధికారుల, అవసరమైతే కేంద్ర జలవనరుల ఉన్నతాధికారుల సేవలను కూడా ఉపయోగించుకొంటూ శాశ్వత ప్రాతిపదికన ఒక యంత్రాంగం ఏర్పాటుకు కృషి చెయ్యాలి.** ❀

## కళారూపాలు

కవిత

దేశంలో భావాత్మక ఐక్యతని పెంపొందించి
దేశ ప్రజలందరినీ కలిసికట్టుగా ఉంచి
ఉవ్వెత్తున ఎగిసే ఉద్యమాలకు ఊపిరులూది
ఉరితాళ్ళను ముద్దాడే స్థయిర్యాన్ని మదిమదినా నింపేవి...

నిద్రాణమైన వివేకాన్ని చైతన్య పరిచి
నీరసిస్తున్న మానవీయ విలువలకు ఊతమిచ్చి
అణచివేతను నిరసిస్తూ విప్లవాగ్నిని రగిల్చి
అదుపు తప్పే మోహావేశాలకు అడ్డుకట్ట వేసేవి...

దిక్కుతోచక నిలుచుంటే ఋజుమార్గాన నడిపి
దుఃఖసంద్రాన కొట్టుకుపోతుంటే చెయ్యిపట్టి ఒడ్డుకు చేర్చి
ఆర్తితో అల్లాడుతుంటే అనునయించి కర్తవ్యాన్ని బోధించి
అశాంతిని పారద్రోలి సాంత్వన చేకూర్చేవి...

సమాజహిత సంస్కరణలకు శ్రీకారం చుట్టి
సమిష్టి శ్రేయస్సే ధ్యేయంగా వికసించి
సమస్త ప్రాణికోటిలో మనిషిని మహోత్కృష్టుడిగా నిలిపి
సృష్ట్యాదిగా మనిషికో ప్రత్యేకత నేర్పరుస్తున్నవి..

మానవ మనుగడతో మమేకమై పయనిస్తున్నవి
మానవజాతి సాంస్కృతిక చరిత్రకు సాక్ష్యమై సాగుతున్నవి..
కళారూపాలు...అవి మన వెలుగుదీపాలు.

**–ఎస్.కాశింబి,** 90522 16044

కవితలు

## మేలుకొలుపు

ఈక్విడార్లోనైనా ఈశాన్యంలోనైనా
భూగోళంలో ఏ మారుమూలనైనా
పుడమితల్లి ప్రకోపిస్తే
చివరకు మిగిలేది శూన్యమే!
హరితాన్ని హరిస్తూ
ఆకాశ హర్మ్యాలతో
కాంక్రీటు వనాల్ని నిర్మిస్తూ
కడలిని కూడా వదలక
రసాయనాలను ప్లాస్టిక్ వ్యర్థాలను
కుప్పలు తెప్పలుగా కుమ్మరిస్తుంటే
దిమ్మెరపోయిన సంద్రం
తన కడుపుకోతను
సునామీగా తెలియపరిస్తే
మహా నగరాలే కాదు చివరకు
మామూలు జనావాసాలూ మిగలవ్
విశ్వాన్ని మనం వెర్రిపోకడలతో
వెక్కిరించి దుర్భాషలాడితే
భూకంపాలే కాదు
భూ విస్ఫోటనాలూ తథ్యం...
ఇప్పుడైనా మేలుకుందాం
దేవునికి బదులుగా
ప్రకృతికి పూజ చేద్దాం
మిక్కిలిగా మొక్కలు నాటి
ఫల పుష్పాలను
నైవేద్యంగా నివేదిద్దాం
ప్రతి నీటిబొట్టునూ
అమృత బిందువుగా ఆస్వాదిస్తూ
అపార జల సింధువులను
ముందు తరాలకై ఆదా చేద్దాం!

*(ఈక్విడార్లో ఇటీవల సంభవించిన భూకంపానికి స్పందనగా)*

**–శివ్,** 98485 27109

## సబ్బుబిళ్ళ

కరిగిపోతుంటాను
మనిషి ఆయుష్షులాగే
తరిగి పోతుంటాను
పూలదండలో సుగంధంలాగే
మనుషుల దేహాలను
శుభ్రపరచగలను గానీ
మనసులోని మురికిని
తాకనైనా తాకలేను
నాలో తత్వాన్ని దర్శించిన వాడు
జీవనయాగం పూర్తి చేస్తాడు
నా కర్తవ్యనిర్వహణను
గమనించినవాడు
మనసు మురికిని కడిగేసుకుంటాడు
నాది ప్రజాస్వామ్య దృక్పథం
కులంతో పని వుండదు
మతం అసలక్కరలేదు
మురికిని వదిలించటమే దినచర్య
కాటికి వెళ్ళే కట్టెకైనా సరే
పట్టిస్తే ఓ పట్టు పడతాను
సబ్బుబిళ్ళ పేరుకు మాత్రమే
శుచి శుభ్రత నా మతం
నిష్కల్మష యోగం నాది
కవి వైతాళిక చక్రవర్తి చెప్పినట్టు
కుక్కపిల్ల, అగ్గిపుల్లే కాదు
సబ్బుబిళ్ళ కూడా కవితార్హమే!

**–గుర్రాల రమణయ్య,** నెల్లూరు,
99639 21943

-డా॥వావిలాల సుబ్బారావు
98664 02973

# ఏ తమస్సులోకి మన ప్రస్థానం?

**మా** యింటికి ఒక కోయదొర వస్తుండేవాడు. 1957 నుండి పరిచయం. మెడలో ఏవో పూసలు. తలకు ఒక పట్టీ. అందులో ఏదో పక్షి ఈకలు. విల్లనంబు, రెండు మూడు బాణాలు. చేతులకు కాళ్ళకు చెట్ల తీగలతో చేసిన కడియాలు వంకీలు. చూడగానే కోయరాజు అని తెలిసేది. కాలం గడిచినకొద్దీ విల్లు బాణాలు మానే శాడు. బహుశ రైళ్ళలో బస్సులలో అంగీకరించలేదేమో. తలకు పట్టీ ఉందిగాని ఈకలు పీకేశాడు. మా స్నేహం చాలాకాలం గడిచింది. అతని కొడుకు గూడ పరిచయం అయినాడు. తండ్రి గతించాడు. కొడుకు ఇప్పటికీ వస్తూనే ఉన్నాడు. ఇతనికి ధోవతి కట్టులో తప్ప పూర్వ లక్షణం ఒక్కటీ లేదు. తాను చెప్పుకుంటే తప్ప కోయరాజు అని ఎవరికీ తెలీదు.

చెంచులు నెమలి యీకల కుచ్చులు ధరించి, కంచుధక్కలు (జేగంట) మ్రోగిస్తూ వచ్చేవారు. ఇపుడు ఉగాదికి, సంవత్సరాదికి తప్ప వారి సంప్రదాయ వేషం ధరించటం లేదు. తమ ప్రత్యేక గుర్తింపును వేషంలో వొదులుకున్నారు. అందరితో కలిసి పోవాలను కుంటున్నారు. సమాజ గౌరవం కోసం, శాస్త్రి, అవధాని, ప్రత్యయాలు ధరిస్తూ, ముఖాన పెద్ద బొట్టు, గోష్పాద మంత శిఖ, ధరించే సంప్రదాయ బ్రాహ్మణుల సంఖ్య మిక్కిలిగా తగ్గింది. కాలంలో మార్పు గుర్తించిన వర్గాలన్నీ తమ ప్రత్యేక వేషభాషలు వదలి సాధారణీకరణం చెందుతున్నారు. ప్రత్యేకతలను- పూర్వాచార సమయాలలో తప్ప పాటించటం లేదు.

కొందరు వ్యక్తులయితే అనూచానంగా వచ్చే తమ కుల ప్రత్య యాలను తమ పేర్ల వెనుక నుండి తొలగించుకున్న పుచ్చలపల్లి సుందరయ్య గారిలాంటి వారెందరో ఉన్నారు. గోపరాజు రామ చంద్రరావు కులం, మతం రెండూ తెలియకుండా 'గోరా' అని పిలుచు కున్నారు. తన సంతానానికి అట్లాంటి పేర్లే పెట్టారు. గుడిపాటి వెంకట చలంగారు తన లోలోపల ఉండే బ్రాహ్మణ ప్రత్యేక భావాన్ని పోగొట్టుకొనటం కోసం ప్రత్యేక జీవన విధానం తొలగించుకొనటం కోసం మాంసాహారం గూడ కష్టపడి అభ్యాసం చేసుకున్నాడు. ఇంకా నాకు తెలియని విశిష్ట మహానుభావులు ఎందరో.

గతంలో తమ ప్రత్యేక గుర్తింపు -ఆధిక్యభావం(రెండూ వేరు వేరే అయినా) పోగొట్టుకొని సాధారణీకరణం చెందారు కొందరు. వారిని లోకం మెచ్చింది. పూర్వ లక్షణాలు మొదలంటా పోయి ఉండక పోవచ్చు. కొన్ని అప్రయత్నంగా మిగిలి ఉండవచ్చు. కానీ వాళ్ళను వాళ్ళు జల్లెడపట్టుకొని చాలావరకు తుక్కును వదిలించుకొన్నారు. కానీ ఇప్పుడు కొత్తచూపు ప్రారంభమయినట్లుంది. గురజాడను, చలాన్ని మళ్ళీ జల్లెడ పట్టి దారితప్పి, కన్ను కానక జారిపోయిన సన్నసన్న పలుగురాళ్ళను ఏరిచూపి - 'ఇదిగో నీలో ఇంకా ఇది చావలేదు. నీవు ఇంకా ఆ నీవుగానే ఉన్నావు' అని చూపే కొత్త విమర్శలు వస్తున్నాయి.

ఒకడు తనను తాను ఎంత క్షాళనం చేసుకున్నాడు, ఎంత శుభ్రపరచుకున్నాడు అన్నది మరుగున పడిపోయింది. ఏ మడతల్లో ఇంకా ఏం మిగిలి ఉందో వెతికే ధోరణి, విశ్లేషణపరంగా నిజమే అయినా, వాంఛనీయం అనిపించదు.

ఎవరికయినా, వ్యక్తిత్వం ఏర్పడిందాకా పరిసర సంస్కారాల ప్రభావంతోనే నాల్గవవంతు జీవితం గడుస్తుంది. పునాది సిద్ధం అవుతుంది. ఆ తర్వాత జీవితంలో చేసే ప్రయత్నాలను, అందులోని నిజాయితీని, తీవ్రతని, సాఫల్యాన్ని మాత్రమే మనం గుర్తించి ప్రశం సించాలి. మిగిలిపోయిన లోపాలనే ఎన్నుతుంటే 'ఎంత ప్రయత్నిం చినా నిరుపయోగమే' నన్న అపోహతో కూడిన నిస్పృహలో పడి పోతాం. అది పరిణామ ప్రయత్నానికి శ్రేయస్కరం కాదు.

గతంలో భేదరహిత సమాజం కోసం జరిగిన ప్రయత్నాల జాడలు అట్లా ఉంటే - ఇపుడు ప్రత్యేక గుర్తింపుల ప్రయత్నాలు తీవ్రం అయినాయి. కులం గుర్తింపు ప్రత్యయాలను పేరు వెనుక చేరుస్తున్నారు. 'మందకృష్ణ'గారు ప్రారంభించారు. కుల పదానికున్న న్యూనతను తగ్గించటం కోసం వాడుతున్నామన్నారు. ప్రారంభంలో నిజమే. చివరకు పరిణామం ఎట్లా ఉంటుందని ఆలోచన. 'యాదవ' శబ్దం ఉత్తరాదిన వాడినట్లు మనం వాడలేదు. ఇపుడు ప్రాచుర్యంలోకి వస్తున్నది. ఇట్లా మరికొన్ని సామాజికవర్గాలు ఉండిఉండవచ్చు.

గాయత్రీ బ్రాహ్మణ అగ్రహారం అంటూ రియల్ ఎస్టేట్ ప్రకట నలు వచ్చేవి-టీవీలలో. బ్రాహ్మణ ప్రముఖుల చేతనే ప్రకటన యిప్పించేవారు.కులాలవారిగా హాస్టళ్ళు చాలాకాలం నుండి ఉన్నాయి. కులాలవారీగా కాలనీలు కట్టుకోవటం, సంఘాలు పెట్టటం- తర తరాల సంస్కర్తల ఆదర్శ పోరాటాలు వీటితో ఏమయిపోయినట్లు. రాజ్యాంగ ఆశయాలకు ఎంత దూరంగా జరుగుతున్నాము. ఇది తప్పు అనిగాని, ఇది 'ఇరుకుబాట' అనిగాని ఎవరూ మందలించటం లేదు. రాజ్యాంగవేత్తలు గూడ సలహా యివ్వటం లేదు. స్పష్టమైన నిషేధం ఎక్కడా లేదేమో! నాకు తెలియదు. కానీ 'రాజ్యాంగ హృదయా నికి విరుద్ధం' అని ఏమీ తెలియని నాకు తోస్తున్నది. వేదికలమీద కులాలను, వర్గాలను, మతభేదాలను నిరసిస్తూనే వీటిని నిర్వహించే దృఢసంకల్పాలను ఆమోదించటం ఏమిటి? 'ఇదంతా పరిమితమైన వర్గ సేవకోసం' అంటారు. వర్గసేవ-సేవదగ్గర ఆగదు. కరుడు కడు తుంది.పరవర్గ అసహనంగా మారుతుంది. ఇటీవలి చరిత్రలే ఇందుకు అనేక ఉదాహరణలు.

ఒక్కొక్క మహానాయకుణ్ణి దిగలాగి దిగలాగి ఆ కులాలకు పరిమితమైన గౌరవమూర్తి(ఐకాన్)గా నిలుపుకోవటం పొట్టి శ్రీరా ములుగారు - మహాత్మాగాంధి-అంబేద్కర్-చివరకు కృష్ణదేవరాయ లకు గూడ తప్పలేదు. అందుకే 'దేశమేగతి బాగుపడునోయ్' అని వాపోయాడు గురజాడ.

మొన్న మా మనవడు చదరంగం బల్ల (చెస్) తీశాడు. నలుపు

తెలుపు– తెలుపు నలుపు. కళ్లు చెదిరే గళ్ళు. నల్ల బలం, తెల్లబలం. ఆఫ్రికా దేశస్తులు–యూరోపు పాలకులు లాగా మోహరించుకున్నారు. ఎంతకూ తెమలని పోరాటం, రకరకాల నడకలు. ఎత్తులు– జిత్తులు– పైయెత్తులు. నాకు చేతకాలేదు. 'ఆగరా మనవడా' అని బోర్డు తిప్పాను. హాయిగా అంతా తెల్లగా ఉంది. చదునుగా ఉంది. 'ఆడదాం పట్టరా' అన్నాను. 'ఇది ఎట్లా ఆడతారు తాతయ్యా–గళ్ళు ఉండాలిగా' అన్నాడు.

ఓహో ఇదా ఆటకిటుకు. అర్థమయింది. సమాజం గళ్ళుగళ్లుగా చీలకపోతే రాజనీతి చదరంగం నడవదు. 64 గడులకే ఆట యింత రక్తికడుతుంటే గళ్లు పెరిగిన కొద్దీ ఆటలో పట్టు, ఎత్తుగడలకు, రాజకీయంలో రక్తి పెరుగుతాయన్నమాట.

క్రమంగా చచ్చిపోతున్న కులభేదాలకు నారుపోసి నీరుపోసి పెంచి వృద్ధి చేయాలి. కొత్త కులాలను సృష్టించలేకపోయినా పాత వాటినయినా వృద్ధి చేసి కొడిగడుతున్న వాటికి స్నేహం (నూనె) అందిస్తే చాలదా? రాజకీయ మంట జగజ్జేగీయమానంగా వెలుగుతుంది.

ఎవరు ఏమంత బలంగా అడిగారని బ్రాహ్మణ కార్పొరేషన్ పెట్టి అన్నికోట్లు నిధులు ఇచ్చారు? మరికొంచెం రాజకీయం పండితే నియోగి కార్పొరేషన్ వైదీకి కార్పొరేషన్ కూడా పెడితే– చూడముచ్చట రాజకీయం నడుస్తుంది. ఇప్పుడు మరొక వర్గం బి.సి.హోదాకు పోరాడుతున్నది. మాకోటలోకి ప్రవేశం లేదని కోటకు తలుపులేస్తామంటున్నారు పూర్వ బీసీలు. భేష్..'తాంబూలాలిచ్చాను తన్నుకు చావండి' అన్నాడు అపుడు అగ్నిహోత్రావధానులు. ఈసారి గిరీశం గారే అన్నాడు.

వెనుకపడ్డవాడు గూడ ముందున్నవాడితో పోటీపడి రొమ్ము విరుచుకోవడం ఎరుగుదుము. ఇపుడు నేనంటే నేనని వెనుక పడుతున్నారు. కొంత వెనుక పడినవాడు గూడ–కొందరికన్నా ముందున్నానని తృప్తిగా ధీమాగా నడిచేవాడు. ఇపుడు ముందుకొచ్చిన వారు గూడ వెనుక పడ్డాననుకోవటంతో అసంతృప్తికి, న్యూనతకు –వాటిని అధిగమించటానికి దూకుడుతనం ప్రదర్శించటంగా పరిణమించవా? ముందుకే వెడుతున్నాననుకోకపోతే– 'వెనుకపడితే వెనుకే నోయ్'.

స్వతంత్ర భారతమ్మకు వయసు పెరుగుతున్నకొద్దీ ఆ ముసలమ్మ పిల్లలు వెనుక వెనుక జాబితాలో పోటీపడి మరీ చేరుతున్నారు. ఎపుడో కాలం తెలియని నాటి వాడు 'మనువు'. కులం పేరు వచ్చినపుడల్లా ఆయన్ను నానా తిట్లుతిట్టడం, తెలిసినవాడు తెలియనివాడు పేజీలు పేజీలు వ్రాయటం, కులాల గురించి తప్ప ఆయన మరేమీ వ్రాయనట్టు, ఈనాడు ఏ అధికారమూలేని అలనాటి మనువు సంగతి ఎందుకు? అధికారం చేతికి వచ్చి ఎన్ని దశాబ్దాలు గడిచినా అడుగు వెనక్కి వేస్తూనే ఉన్నాం. టేపుతో కొలవండి ఎన్ని అడుగులు ముందుకు జరిగామో. డబ్బులు, సాంకేతికత గురించి కాదు, సమాజ యంత్రాన్ని ఎటువైపు నడుపుతున్నాం. ఎన్ని గడులు కంచెలు చెరిపాం.

ఇపుడీ కులాలనేం చేద్దాం? కుల వ్యతిరేక ఉద్యమాలు మూల పడ్డాయి. ప్రభుత్వ ప్రోత్సాహంతో, రాజకీయ రుచితో కుల అనుకూల ఉద్ధరణ ఉద్యమాలు–గుర్తింపు పోరాటాలు ఉధృతమయినాయి. ఎవరికి చెప్పుకోవాలి. ఇది ఏ 'మనువు' చేస్తున్న పాపం? ఎవరికి క్షీరాభిషేకం (పాలాభిషేకం) చేయాలి? కులభేదం లేదంటే ప్రభుత్వాలే పడిపోయే దశకు ప్రయాణం చేశాం. అతివేగంగా చేశాం. భిన్నభిన్న ఛప్పన్న కులాలు రాజ్యాధికారంలో భాగస్వామ్యం కోరుతున్నాయి. అది గూడ వస్తే ఇక రాజ్యాంగం మీద నల్లగుడ్డ కప్పేయవచ్చు.

*నిజంగానే నిఖిలలోకం / నిండు హర్షం వహిస్తుందా?*
*సాధుసత్వపు సోదరత్వపు/స్వాదుతత్వం జయిస్తుందా?*

ఏక సమాజాన్ని ముక్కలు ముక్కలుగా కోసి ప్రతి ముక్కకు ప్రభుత్వ నిధులతో పరిషత్తుల్లో, కమీషన్లో, బోర్డులో పెడితే, ఎంచక్కా ప్రభుత్వ నిధులతోనే కులాల వారీగా మన ఓట్ల ఖజానాలో వారిని జమ చేసుకోవచ్చు.

**అందర్నీ ఒకటిగా చేసే భాషాభివృద్ధికి రాని వందల వేల కోట్ల నిధులు వారిని వేరు వేరుగా చీల్చే కులాభివృద్ధి సంక్షేమాలకైతే వస్తాయి.**

ఈ కులవైరస్‌ను మనం వెళ్ళిన అన్ని దేశాలకు ప్రాకించాము. అది అక్కడ గూడ పిలకలు వేసి డాలర్లు పండించి స్వదేశీ కులమూలాలకు బలం పోస్తున్నది. చదువు కులాన్ని పోగొట్టలేదు. డాలర్లు కులాన్ని చెరపలేవు. రాజ్యాంగం కులాన్ని కదిలించలేకపోయింది. మతం మారినా కులం మారలేదు. మా మతంలో కులం లేదన్నమాట గోడల మీదనే ఆగిపోయింది. గోడ అవతల ప్రభువుకు గూడ సాధ్యం కాలేదు.

'ఏదో ఒక పేరుతో కొద్దిమందిమి కలసి, గుంపుకట్టుకుందాం. అపుడే సమాజంలో బలం వస్తుంది. లేకపోతే ఒంటరి అయిపోతాం' అన్న భయం, అభద్రతాభావం ఉన్నంతకాలం కులం ఉంటుంది. వృత్తికోసం పుట్టిన కులం–అభద్రత వల్ల బతుకుతున్నది. 'నేనున్నా' నంటూ 'భద్ర బాహువు' ముసుగులో పార్టీలు ప్రభుత్వాలు దీన్ని పోషిస్తూనే ఉంటాయి. కులం నశించకపోవటానికి 'మనువు' కాదు అడ్డం. నీలోని భయం, అభద్రత అడ్డాలు. అర్హతకు మించి కోర్కెలు సాధించుకోవాలన్న అత్యాశ నుండి అభద్రత పుడుతుంది. అది పోగొట్టుకోవటం వ్యక్తి సాధించవలసిన లక్ష్యం. ప్రతి వ్యక్తికి కనీస అవసరాలు తీర్చే హామీ– కృషికి చేయూత ప్రభుత్వ బాధ్యత. ఈ రెండూ జరగందే కులాల కొలిమి చల్లారదు. వ్యక్తులను, సమూహాలను, భయంగుప్పిటలో ఉంచి, తమ చుట్టూ తిప్పుకొనే 'దయ్యం ఆట'ను రాజకీయ క్రీడాకారులు మానుకోకపోతే –'మనువు'ను ఏడు నిలువుల లోతున పాతేసినా కులం చావదు. మనల్ని మనం మార్చుకోలేని అసహనంలో మనువు మీద అక్కసు పడతాం. తమస్సుకు మార్గం దగ్గర –వెలుగు బాటను చూడటానికి మన కళ్ళే మొదటి అవరోధం.

'తమసోమా జ్యోతిర్గమయ'.

❋

## స్పందనను వ్రాయండి

**'అమ్మనుడి'**లో రచనలపై
మీ స్పందనను వ్రాసి పంపండి!
సంపాదకుడు
'అమ్మనుడి', జి–2, శ్రీ వాయుపుత్ర రెసిడెన్సీ, హిందీ కళాశాల వీధి, మాచవరం, విజయవాడ–520 004.
ఇ–మెయిల్ : *ammanudi@gmail.com*

-'శక్తి' శివరామకృష్ణ
94414 27977

# మోదకొండమ్మ పండుగ

## ప్రభుత్వ గిరిజన పండుగ



తెలంగాణాలో సమ్మక్క సారక్క జాతరలాగే, ఆం.ప్ర.ప్రభుత్వం విశాఖమన్యంలో మోదకొండమ్మ పండుగను ప్రకటించింది. మోద కొండమ్మ పాదాలు చోడవరం- పాడేరు ఘాట్‌రోడ్డు దారిలో, ఆమె కోడలు, అంటరాని వర్గానికి చెందిన గంగుగారి పాదాలు పాత పాడేరులో ఉన్నాయి. మత్స్యరాజ్యానికి కొండకింది రాజ ధాని వడ్డాది కాగా, మన్యంలో రాజధాని పాతపాడేరు. అక్కడ ఆ ఆనవాళ్ళు శిధిలావస్థలో ఉన్నాయి. ఉన్నతా ధికారులు ప్రాజెక్ట్ ఆఫీసర్, సబ్ కలెక్టరు నివాసాలు, బాలికల ఆశ్రమ పాఠశాల ఆ దిగువనే ఉన్నాయి.

గిరిజనాభివృద్ధి కేంద్రంగా పెరుగుతున్న కొత్త పాడేరులో కొందరు మోదమ్మగుడి కట్టించారు. వ్యాపార వర్గాలు భారీగా పండుగ చేయసాగారు. తెలిసో తెలి యకో వారు గుడికి కి.మీ. దూరంలో ఉన్న గంగుగారి పాదాలను పట్టించుకోలేదు. సంఘపరివారానికి చెందిన వనవాసి కల్యాణాశ్రం దుర్గాష్టమి వేడుకలను, గంగు గారి ఊసు లేకుండానే జరుపుతున్నారు.

ఊడుపులప్పుడు, తీరికవేళలో గిరిజన మహిళలు పాడుకునే మోదమ్మ-గంగుగారి పాటను నాటికగా మారిస్తే ప్రజల్లోకి పోతుందని భావించిన కల్యాణాశ్రం కార్యకర్త, మోదమాంబ కళాశాల ప్రిన్సిపాల్ వరాహమూర్తి, దుర్గాష్టమి నాడు స్కూలు పిల్లలచేత నాటకం వేయిం చాడు కానీ దానికి ఎటువంటి ప్రోత్సాహం లభించలేదు. భా.జ.పాలో తిరిగే కాసుబాబు గంగుగారి గుడికి నాటి గిరిజనశాఖ మంత్రి బాలరాజుచేత శంకుస్థాపన చేయించాడు. కానీ అది అలాగే ఉండి పోయింది.

జనవరి నెలలో హుకుంపేటలో బ్రహ్మకుమారిలు నిర్వహించే జ్ఞానసాగర్ బాలికల జూనియర్ కళాశాల పిల్లలు మోదమ్మ నాటకం రిహార్సల్ వేశారు.

మే నెలలో పండుగ తేదీలు ప్రకటించగానే, హిందూ ఆంగ్ల పత్రిక విశాఖ విలేఖరి ప్రసాదశర్మ, గంగుగారి పాదాల ఫోటోతో మోదమ్మ కథను ఇస్తూ, పిల్లలు సెలవులకు ఇళ్ళకు వెళ్లినందున, పాటను నృత్యరూపకంగా పండుగలో వేసే అవకాశాలు తక్కువ అని వార్త రాశారు. ఇంతలో ప్రభుత్వం పండుగను ప్రకటించి 50 లక్షలు విడుదల చేసింది.

పండుగను నిర్వహించే సబ్ కలెక్టరు శ్రీ లోతేటి శివశంకర్, వరాహమూర్తిని, జ్ఞానసాగర్ వారిని పిలిచి రూపకం వేయవలసిందిగా కోరారు. కల్యాణాశ్రం మహిళా ప్రముఖ్ శ్రీమతి కిముడు అచ్చమ్మ రూపకం మధ్యలో పాటలు, ఎప్పటినుండో పౌరాణిక నాటకాలు వేస్తున్న అడ్డుమండ గ్రామ కళాకారులు కళ్యాణాలు పాడారు. ఐతే స్టేజి, మైకులు అలవాటులేని పిల్లలు వాటిని పట్టించుకోకుండా తమలో తాము బొమ్మలపెళ్ళిలా ఆడుకొంటూ పోయారు. పాటలు కూడా ఒక్కసారి అందరూ గొంతు విప్పి పాడటంతో జనానికి అర్థం కాలేదు. ఈ తడబాట్లు గుర్తించిన పాడేరు సర్పంచ్ శ్రీమతి కిలో వెంకటరత్నం, మైకు అందుకొని ఇది మా కథ, గంగు గారు మావీధి పాత పాడేరు ఆడపడుచు. ఇంతకాలానికి గొంతు విప్పి మా కథ చెప్పుకోటం మొదలు పెట్టాం అంటూ చెప్పుతుంటే జనమంతా కుర్చీ లెక్కి చూడసాగారు.

తూర్పు కనుమలలో నందపురం రాజ్యానికి, కనుమలకింద వడ్డాది వారికీ బంధుత్వం ఉంది. నందపురం ఆడపడుచు రాచ గన్నియ వడ్డాది రాణి. వారి కూతుళ్ళు దుర్గాండ్లు. రాజు వారికి దిగువ రాజులతో సంబంధాలు చూస్తుంటాడు.

నందపురం యువరాజులు దేశి రాజులు, ఇటికల పండుగలో గ్రామాలను సందర్శిస్తూ వడ్డాది రాజ్యంలోకి ప్రవేశిస్తారు. అక్కడ కల్యాణపులోవలో దుర్గాండ్లు విహరిస్తుంటారు. వారి ఆటపాటలకు మురిసిపోతూ దేశి రాజులు చాటు నుండి పూలు విసురుతూ, చివరకు ఎదురు పడతారు. అప్పటి దాకా వినడమే తప్ప, ఒకరి మొహం ఒకరు చూడనివారు, తమచుట్టరికాలు తెలియగానే ఆశ్చర్యం, ఆనందంలో మునిగిపోతారు.

లోవలో గాంధర్వవివాహం చేసుకుంటారు. దీన్ని 'దొంగ పెళ్ళి'గా భావించిన రాజు, అల్లుళ్ళకు ఏడుగడియల కారాగార శిక్ష వేస్తాడు. అవమానభారంతో దేశి రాజులు ఆత్మహత్యచేసుకుంటారు. రాణి రాచగన్నియ కూడా దుఃఖంతో ఆత్మహత్య చేసుకుంటుంది.

# 'తెనుగులెంక' సూక్తులు-12



'తెనుగు లెంక' 'అభినవ తిక్కన'
**తుమ్మల సీతారామమూర్తి.**

*శ్రమపడుటే జాతికి సిరి*
*శ్రమపడుటే రాజ్యమునకు సంపద; యెచటన్*
*శ్రమ కన్పడు నచ్చటనే*
*రమ కన్పడు నఖిల సుఖ పరంపరలిడగన్*

మనుషులు రెండురకాలు. మొదటి రకం శ్రమపడి చెమటోడ్చి బ్రతుకుతారు. రెండోరకం శ్రమపడకుండా మాటలు చెప్పి ఇతరుల చెమట ఊడ్చి గతుకుతారు. వీరిలో మొదటి రకానికి జీవితంపట్ల అవగాహన ఉంటుంది. వారి జీవితానికి ఒక లక్ష్యం ఉంటుంది. ఆ లక్ష్యసాధనకు ఒక ప్రణాళిక ఉంటుంది. ఆ ప్రణాళిక ప్రకారం శ్రమ పడుతూ లక్ష్యాన్ని సాధిస్తారు. ఆదర్శపురుషులుగా నిలుస్తారు. వారి వ్యక్తిత్వం ఉన్నతంగా ఉంటుంది. ఇలాంటి వారివల్లనే దేశం పలురంగాల్లో ముందడుగువేస్తుంది. రెండో రకం వారికి శ్రమపడాలంటే బద్ధకం. సోమరితనం వారి సొత్తు. ఏవేవో కబుర్లు చెపుతూ, ఏవేవో భయాలు కలిగిస్తూ, ఇంకేవో ఆశలు చూపిస్తూ శ్రమ చేసేవారి శక్తిని దోచుకుంటారు. వీరికి తీయగా మాట్లాడడం, ఇతరులను దోచుకోవడం తప్ప పని విలువ తెలియదు. అందుకే వీరి జీవితాలకు లక్ష్యంగాని, లక్ష్యం చేరే ప్రణాళికగాని, ప్రణాళిక ప్రకారం పనిచేయడం గాని ఉండవు. వ్యక్తిత్వం, వెన్నెముక లేని జీవులు వీళ్ళు. వీళ్ళవల్ల సమాజానికి ప్రత్యేకమైన ఉపయోగమే ఉండదు.

మొదటి రకం వ్యక్తులు శ్రమపడుతూనే సౌధాన్ని నిర్మిస్తూ ఉంటే, రెండో రకం వ్యక్తులు జ్యోతిషమని, హస్తసాముద్రికాలని, అదృష్టం వరిస్తుందని, గ్రహశాంతి చేయాలని అంటూ మూఢ నమ్మకాలను ప్రజలనరాల్లో చొప్పిస్తారు. వారికి ఆశపెట్టి, వారిని భయపెట్టి, వారికళ్ళముందు సుందర దృశ్యాలను చూపించి సోమరిపోతులుగా మార్చి, తద్వారా వారినుండి ధనాన్ని తీసుకుంటారు. వీరందరూ పరభాగ్యోపజీవులు. పరాన్నభుక్కులు. వీరిని నమ్మినవాళ్ళంతా దేశసౌధాన్ని కూల్చడానికి యత్నించేవారే గాని దేశాన్ని పురోగమనంలో నడిపించేవారు కాదు.

మరో రకంగా చూస్తే మనుషులు రెండు రకాలు. మొదటిరకం శారీరక కష్టాన్ని నమ్ముకుంటారు. ఆ కష్టాన్ని అమ్మి ఆ సొమ్ముతో నిజాయితీగా, నికార్సయిన వ్యక్తిత్వంతో బ్రతుకుతారు. వీళ్ళకు మోసం తెలియదు. మాయమర్మాలు తెలియవు. అవినీతి అక్రమాలు తెలియవు. అన్యాయం చేయడం తెలియదు. రెండో రకం వాళ్ళు బుద్ధి జీవులు. వీళ్ళలో కొద్దిమంది మాత్రం తమ తెలివితేటలను దేశకళ్యాణానికి వినియోగిస్తారు. ఎక్కువమంది స్వార్థంతో ప్రవర్తిస్తారు. ఇలాంటి వారు సమాజానికి చీడపురుగులు, దేశానికి రాచపుండ్లు.

శరీరాన్ని, మనస్సును ఏకంచేసి కష్టపడి పని చేసే వారివల్లనే దేశం పురోగతి సాధిస్తుంది. దేశం అభివృద్ధి చెందితే మనుషులు సుఖపడతారు. అంతేగాని దేశసంపదను స్విస్ బ్యాంకుల్లో దాచుకుంటే సామాన్యులు సుఖపడరు. కమీషన్లకు కక్కుర్తిపడి సక్రమంగా పనిచేయించకపోతే సామాన్య ప్రజలకు సుఖభోగాలు కలిగిస్తేనే దేశం పురోభివృద్ధి చెందినట్లు భావించాలి. అందుకే తుమ్మల వారు శ్రమపడితేనే జాతికి సంపద కలుగుతుంది. "శ్రమపడితేనే దేశానికి సంపద చేకూరుతుంది. ఎక్కడ శ్రమ ఉంటుందో అక్కడ సంపద ఉంటుంది. ఆ సంపద వల్లనే ప్రజలకు సకల సుఖాలు దక్కుతాయి" అన్నారు.

**–డాక్టర్ నాగభైరవ ఆదినారాయణ,**
98497 99711

---

అప్పటికే దుర్గాండ్లలో పెద్దది మోదమ్మ గర్భవతి. ఆమెకు సంజీవరాజు పుడతాడు. అతడు వేటమార్గాన వెళుతూ పాత పాడేరులో పూలగండు వనంలో విహరిస్తున్న గంగుగారి ప్రేమలో పడతాడు. ఆమె కూడా అతని చేత కూర కావళ్ళు మోయించి, గొడ్డు మాంసం తినిపించి ఆటపట్టిస్తుంది. వీరి సరసాలు దుర్గాండ్లకు తెలుస్తాయి. ఇటువంటి సంబంధాలను గిరిజనుల కట్టుబాటు ప్రకారం వెలివేయాలి. వెలిపడిన వారిని ప్రజలు రాజుగా ఒప్పుకోరు. మందలిస్తే తండ్రులవలె అఘాయిత్యానికి పాల్పడతాడేమోనని వారు భయపడతారు. దిగువ పద్ధతి ప్రకారం ఉంచుకోవచ్చు. కానీ ఉంపుడుగత్తెగా ఉండడం గంగుగారికి ఇష్టం లేదు. ఈ గుంజాటనలో నలిగిపోతూ వారు నందపురంలో పెద్దరాణి మాకలిశక్తికి కబురు చేస్తారు. ఆమె గంగ–సంజీవరాజుల ఈడూజోడులకు సంతోషించి వారి పెండ్లికి ప్రజలను పాలక వర్గాలను ఒప్పించి, పట్టాభిషేకం చేస్తుంది.

**చరిత్రలో అనేక సంఘటలను తమ జీవితానుభవాలతో రంగరించుకొని పల్లె ప్రజలు పాటలు కట్టుకొంటారు. ఇటీవలే అమరుడైన 'జంగల్ నామా' రచయిత సత్నాం, బస్తర్‌లో మావోయిస్టులతో తిరుగుతూ, ఉద్యమ నాయకులకు ఆదివాసుల సాంప్రదాయ గాథలు, కథలు తెలియనందుకు విచారిస్తాడు. ఈ పాత పనిముట్లను కొత్త మార్పులకు ఉపయోగించాలని ఉద్బోధిస్తాడు.**

ఉద్యమాలు, వ్యాపారాలు, సంస్కారాలు, సొంత కవిత్వాలతో హోరెత్తించే **మనకు గిరిజనుల గాథలు కనువిప్పు కావాలి కానీ అంత త్వరగా మనకు బుద్ధి రాదు. వారు గొంతు విప్పనూ లేరు.** తరువాత జరిగిన తిరుమల దేవస్థానంవారి 'శుభప్రదం'లో వారి దేవతల పిలుపులు తలుపులను పట్టించుకున్నవాడే లేదు. ఈ అజ్ఞానానికి అందరం భారీ మూల్యం చెల్లిస్తున్నాం. ఇకనైనా మన అతితెలివిని వారి మీద రుద్దడం తగ్గించి, **గొంతువిప్పేలా వారిని ప్రోత్సహించాలి. రంగస్థల ప్రయోక్తలతో శిక్షణ ఇప్పించాలి. నంది నాటకోత్సవాలలో గిరిజన నాటకాలకు ప్రత్యేక స్థానమివ్వాలి.** ❋

-కీ.శే.అబ్బూరి వరదరాజేశ్వరరావు

# మారేపల్లి రామచంద్ర శాస్త్రి



## మారేపల్లి రామచంద్రశాస్త్రి

జననం 1874 నవంబరు 3వ తేదీ కృష్ణాజిల్లా గన్నవరం తాలూకా కనకవల్లి అగ్రహారం. కార్యక్షేత్రం విశాఖపట్నం స్వాతంత్ర్య సమరయోధులు. ఆంధ్రదేశ గ్రంథాలయోద్యమ తొలి తరం నాయకులలో ముఖ్యులు. కొంతకాలం ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘానికి కార్యనిర్వాహక అధ్యక్షులుగా వున్నారు. 22వ ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభకు అధ్యక్షులు. పండితులు, తెలుగుభాష పుట్టుపూర్వోత్తరాలు తెలిసిన తెలుగు నలువ. తెలుగు భాషోద్ధారకులు. వీరు 100కి పైగా రచనలు చేశారు. ఇవిగాక 40 అనువాదాలు, 70కి పైగా భాషా సంబంధిత వ్యాసాలు ప్రచురించారు. వీరి రచనలలో పాండవ జననం, బిల్హణీయం, పారిజాతాపహరణం, తెలుగు గీతులు, పూలతోట తదితరాలు ప్రసిద్ధమైనవి. 1956 జూన్ 14న మరణించారు.

**మే**ము వాల్తేరులో నివాసం ఏర్పరచుకున్న అనతి కాలానికే మారేపల్లి రామచంద్రశాస్త్రి గారితో నాకు పరిచయమయింది. అప్పుడు మేము వాల్తేరులో చిన్న బంగళాలో ఉంటూండేవాళ్ళము. వాల్తేరుకీ, విశాఖపట్టణానికి మూడుమైళ్ళ దూరం. రాకపోకలకి తగిన వాహన వసతిలేని రోజులవి. పొద్దునా, సాయంకాలం ఓ బస్సు నడిచేది. అదీ సమయానుకూలంగా వుండేది కాదు. చాలామంది వాల్తేరునుంచి పట్టణం నడిచివెళ్ళేవారు. ఆ రోజుల్లో అందరికీ అంత అందుబాటులో లేని వాహనం పెట్టెబండి. అదే ఎద్దుబండి అనికూడా అనేవాళ్ళు.

ఓ ఆదివారం పొద్దునే మా ఇంటి ముందు ఓ పెట్టెబండి ఆగింది. అందులోంచి అంతకు పూర్వమే కొంచెం పరిచయమైన పురిపండా అప్పల స్వామిగారు ముందుగా దిగారు. ఆయన వెనకే మరో ఇద్దరు మధ్య వయస్సులో ఉన్నవాళ్ళు దిగారు. ఆఖరున- ఒకాయన నూరుపాళ్ళు శ్రోత్రియ పండితుడిలా ఉన్న బ్రాహ్మడు- దిగారు. ఆయన కాళ్ళకి చెప్పుల్లేవు. ముతక ఖద్దరు దోవతీ, ముతక ఖద్దరు ఉత్తరీయం, భుజాన ఖద్దరు సంచీ- గేటు తోసుకుని లోపలికి వచ్చారు. మా నాన్న గారికి అప్పలస్వామి గారు ఒక్కొక్కర్నీ పరిచయం చేశారు. ఇచ్ఛాపురపు యజ్ఞనారాయణ శర్మగారూ, సబ్బినీసు సత్య కేశవరావుగారూ- కవిగారు- అనే మారేపల్లి రామచంద్రశాస్త్రి గారు.

మా నాన్నగారిని చూడటానికి వచ్చాననీ, అప్పలస్వామికి శ్రమ కలిగించాననీ రామచంద్రశాస్త్రిగారతి వినయంగా చెప్పారు. మా నాన్న గారు శాస్త్రిగారి గురించి అప్పటికే వినటం చేత ఆయనతో మాట్లాడేందుకు కుతూహలం కనపరిచారు.

రామచంద్రశాస్త్రి గారు అప్పుడే కారాగారం నుండి విడుదలైన వారు. విశాఖపట్నంలో వారిని అబాలగోపాలం కవిగారని పిలిచే వారు. అంతేకాక, ఆయనపట్ల అపార గౌరవాన్ని ప్రదర్శించేవారు. ఆ రోజుల్లో విశాఖపట్టణం చిన్నది. అక్కడి జనం ఇరుగు పొరుగు జనంలా ఒకర్నొకరు అందరూ ఎరుగుదురు. దానికితోడు ఊరంతా అందరూ నడిచిపోయేవారు. వాహనయోగం ఏ కొద్దిమందికో ఉండేది. అంచాత కవిగారు విశాఖపట్నంలో ప్రతివారికీ సుపరిచితులు.

కవిగారు వాల్తేరులో మా ఇంటికొచ్చినప్పుడు కవితా సమితికి అధ్యక్షులుగా ఉండేవారు. చివరిదాకా ఆయనే అధ్యక్షులని నాకు గుర్తు. పురిపండా అప్పలస్వామిగారు కార్యదర్శిగా ఉండేవారు. అందులో పట్టణంలోనూ, జిల్లాలోనూ ప్రముఖులయిన యువ కవులు కొందరు సభ్యులుగా ఉండేవారు. మా నాన్నగారితో మాట్లాడుతూ కవిగారు తలపెట్టిన తెలుగునుడి కార్యక్రమాన్ని విశదీకరించారు. సంస్కృత ప్రభావం వల్ల ఎన్నో తెలుగుపదాలు అంతరించిపోయిన వనీ, వాటిని తిరిగి సంపాదించాలనీ, అందుకని తన శేష జీవితాన్ని ఓ తెలుగు నిఘంటు నిర్మాణంలో వినియోగించదలిచాననీ చెప్పారు. పక్కనే కూచుని వింటున్న నేను కలగజేసుకుని, అలా చేస్తే బాగుంటుం

దనీ, నాలుగు దిక్కుల్లోనూ రెండు దిక్కులకు తెలుగు పేర్లు తెలియటం లేదనీ అన్నాను.

కవిగారు నావంక చూసి నన్ను దగ్గరికి లాక్కుని తల నిము రుతూ– "ఈ చిరంజీవి చూశారా, మన దుర్దశను ఎలా కనుక్కున్నాడో! నిజం నాయనా, నువ్వు చెప్పింది అక్షరాలా నిజం, నేను చేసే కృషి ఫలిస్తే ఎన్నో మాటలు బయటికి తీసుకురాగలం" అన్నారు.

కవిగారు తన నిఘంటువుకి "నుడికడలి" అని పేరు పెట్ట మన్నారు. మా నాన్నగారి సహకారాన్ని అర్థించారు. మా నాన్నగారు తనకు చేతనయినంత సహాయం చేస్తానన్నారు కానీ, అచ్చ తెలుగును ఆరాధిస్తే భాష ప్రజలకి దూరం అవుతుందేమోనన్న సందేహాన్ని వెలిబుచ్చారు. ఏ పదమయినా రూఢంగా ఉంటేనే అందరికీ అర్థం ఆయే అవకాశాలున్నాయన్నారు. ఏదేమయినా, కవిగారు తలపెట్టిన కార్యక్రమం హర్షదాయకమే నన్నారు. ఆ తరువాత యజ్ఞనారాయణ శర్మ గారితో మా నాన్నగారు నాటకరంగం గురించి కొంతసేపు చర్చ చేశారు. కవిగారూ, శర్మగారూ విశాఖ మండలంలో నాటక రంగానికి ఎనలేని సేవ చేసినవారు. ఇద్దరూ నాటక రచయితలే, కవిగారు వేషధారి కూడానూ!

ఆ తరవాత అందరూ సెలవు తీసుకుని బయటికొచ్చేశారు. వాళ్ళనిచూసి బండివాడు బండికి ఎద్దునికట్టి సిద్ధం చేశాడు. నేనూ, మా నాన్నగారూ వాళ్ళతోపాటు బండిదాకా వచ్చాము. కవిగారు చెప్పుల్లేకుండా ఉండటం మళ్ళీ చూశాను. ఆయన ఎందుకు చెప్పులు వేసుకోరని అడిగాను. మీకు భయం వెయ్యదా, రాత్రిళ్ళు చెప్పుల్లేకుండా పోవటానికని అడిగాను. ఎంచేతనంటే, ఆ రోజుల్లో వాల్తేరులో దారి పొడుగునా మండ్రగబ్బలూ, తాచుపాములూ ప్రత్యక్షమవుతూండేవి. ముఖ్యంగా రాత్రిళ్ళు. వీధి దీపాలుండేవికావు.

ఆయన నవ్వుతూ, "ఎంతోమందికి చెప్పులు కుట్టించుకునే స్తోమత లేదు. నాకు మాత్రం ఎక్కడిదీ?" అన్నారు. తన్ను చూసి మండ్ర గబ్బలూ, తాచుపాములూ భయపడి పక్కకి తప్పుకుంట వన్నారు. ఆయన ముఖంలో అత్యంతం ప్రస్ఫుటమయ్యే అమాయ కత్వమూ, వినయ శీలమూ చూసినవాళ్ళు ఆయన చెప్పింది నిజమేనని అనుకోక మానరు. నేను మాత్రం ఆ క్షణంలో నమ్మేశాను, నాక్కూడా అలాంటి శక్తివుంటే ఎంత బావుణ్ణనుకున్నాను.

ఓ రెండేళ్ళయిం తరువాత మా చదువుల కోసం మా నాన్నగారు విశాఖపట్నంలో ఇల్లు తీసుకున్నారు. అక్కడ ఉన్నప్పుడు కవిగారితో పరిచయం సన్నిహిత మయింది నాకు.

సీతారామస్వామి ఆలయానికి ఎదురుగుండా ఘోషా ఆసుపత్రి ఉండేది. ఆసుపత్రికి పోయే ఆవరణలో ఎడం పక్కన ఓ పూరిపాక లాంటిది పెద్దది ఉండేది. అందులో కవిగారుండేవారు. దాన్నే కవిగారి ఆశ్రమం అనేవారు. అక్కడ ఓ చిన్న గ్రంథాలయం ఉండేది. అది కవిగారు సొంతంగా సంపాయించింది. నేను తరచూ అక్కడికి పోయే వాణ్ణి. అక్కడ పుస్తకాలు చదువుకుంటూ ఉండేవాణ్ణి. ఓ సంవత్సరం పాటు కవిగారు నన్ను అచ్చతెలుగు పిచ్చిలో పడేశారు. అచ్చతెలుగులో ప్రతీదీ రాయడం అభ్యాసం చేయటం ప్రారంభించాను. సొంబనిఘం టువు సంపాయించి, ఆ నిఘంటువు మీద పరిపూర్ణమైన అధికారాన్ని చేపట్టాను. నేను రాసిన రెండో, మూడో వ్యాసాలు కవిగారికి చూపించే వాణ్ణి. ఆయన నా వెన్నుతట్టేవారు. ఇలా నేను చేస్తున్నట్లు పురిపండా అప్పలస్వామి గారికి తెలియదు. ఆయనకి తెలిస్తే నన్ను వారించి ఉండేవారు. ఆయనకి అచ్చతెలుగు మీద మమకారం తక్కువ. శ్రీరంగం శ్రీనివాసరావు కసలే లేదు. ఆయతే, చక్కని తెలుగు పదం దొరికితే, తద్భవంకన్నా మెత్తనిది, తప్పకుండా వాడుకోవలసిందే, ముఖ్యంగా కవిత్వంలో. అచ్చతెలుగు పిచ్చిలో పడిన నా మీద కవి గారికి మాత్రం అభిమానం మరింత ఎక్కువయింది. చిన్న చిన్న సమావేశాల్లో నన్ను దారితప్పి శ్లాఘిస్తూ ఉండేవారు.

మా తరగతిలో కొత్తగా ఓ తెలుగు మేష్టారొచ్చారు. తెలుగులో ఓ వ్యాసం రాయించారు విద్యార్థులచేత. నేను కష్టపడి అచ్చతెలుగులో రాశాను. మా తెలుగు మేష్టారు, అందరి వ్యాసాలకు తగిన మార్కు లిచ్చి తిరిగి ఎవరివి వాళ్ళ కిచ్చేశారు. నాది మాత్రం ఆయన దగ్గర ఉండి పోయింది. ఓ రోజు నాఅంతట నేనే అడిగాను. ఆయనకి కోపం వచ్చింది. "చూడు రాజేశ్వరరావ్, నేనంటే సరిపోయింది. పరీక్షల్లో అలా రాశావంటే సున్నా చుట్టేస్తారు. నీ భాష ఎవరికన్నా అర్థం కావాలి కనకనా?" అన్నారు. అంతే, నాకు నిజంగా భయం పట్టుకుంది!

* * *

అచ్చ తెలుగులో కవిత్వం అల్లాలని ప్రయత్నం చేశాను, కవి గారు సంతోషిస్తారు గదా అని. నేను రాసిందల్లా శ్రీరంగం శ్రీని వాసరావుకి చూపించేవాణ్ణి. కొత్తల్లో కొంత నిరుత్సాహపరిచాడు. తరువాత మెత్తబడి, మాత్రాఛందస్సులో నేను రాస్తుంటే సహాయ పడటం ప్రారంభించాడు. ఇప్పటికింకా, అలా మేము రాసిన వాటిలో నాలుగు పంక్తులు గుర్తు.

*మొయిలు దారి బయలుదేరి*
*చెయిని పట్టి మెయిని తట్టి*
*చిలుకరించి చినుకుపైన*
*పలకరించె వాన చాన...*

అచ్చ తెలుగు మాటల పొందిక, కవిత్వంలో కొన్ని చోట్ల బాగా రాణిస్తుందని శ్రీనివాసరావు ఓసారి నాతో అన్నాడు. ఆ పద్ధతిలో అతనూ కొంత అనుకోకుండా శ్రమపడినట్లు జ్ఞాపకం. వెతగ్గా వెతగ్గా మంచి చక్కని మాటలు అచ్చతెలుగులో మాకు దొరుకుతూండేవి. దీని కంతా కారణం కవిగారి అచ్చతెలుగు ప్రచారమే, కవిగారు అనర్గళంగా ఉపన్యసించగలరు. మైకుల్లేని రోజుల్లో, వేలాది జనాన్ని తన ఉపన్యాసంతో ఆకట్టుకునే శక్తి కవిగారికుండేది. అయితే, ఆయన మొదట్నుంచీ సంప్రదాయ బద్ధులు కావటంవల్లా, జాతీయోద్యమంలో గాంధీ గారి అనుచరులవటం వల్లా యాంత్రిక నాగరికత ఆయనకి రుచించేది కాదు. కవిత్వంలోనూ ఆధునికతని ఆయన మెచ్చిందీ లేదు. ఆధునికత రివాజయి పోవటంవల్ల ఆయన తలవంచుకొని ఒప్పుకొని కవితాసమితి అధ్యక్షులుగా ఉండేవారు.

ఆ రోజుల్లో మా నాన్నగారు కమ్యూనిస్టు పార్టీ వ్యవస్థాపకుల్లో ఒకరు. ఉద్యోగం విశ్వవిద్యాలయంలో కనక పార్టీ కార్యకలాపాలన్నీ రహస్యంగా నడిపిస్తూ వచ్చేవారు. గుంటూరు నించి పార్టీ కార్యక్రమం కోసం తీసుకొచ్చిన అత్తలూరి లక్ష్మీనరసింహారావుకి కవిగారి ఆశ్రమం అవరణలోనే వసతి కల్పించారు. ఆ రోజుల్లో అందరూ కాంగ్రెసు కార్యకర్తల్లా ఉండేవారు. కవిగారూ నరసింహారావుని ఆప్యాయంగా చూస్తుండేవారు.

ఓసారి విశాఖపట్నంలో ఉన్న హార్బరు కార్మికుల్ని ఒక సంఘం కింద సంఘటితపరచాలనే ఆశయం మానాన్నగారికి కలిగి, కార్మికుల్లో కలిగించగలిగిన చైతన్య సాధనం కోసం అన్వేషించేవారు. అలా వారికో రాత్రి పాఠశాల నిర్వహిస్తే ఆ నెపంమీద వారిలో చైతన్యం రేకెత్తించవచ్చు ననుకున్నారు. ఆ ప్రకారం కవిగారి ఆశ్రమ ఆవరణలోనే హార్బరు కార్మికుల కోసం రాత్రి పాఠశాల నిర్వహించటం ప్రారంభించారు. ఆదో అపురూపమైన ప్రయోగం. అది వేరే కథ.

అయితే రాత్రిళ్ళు అంతమంది పాఠశాలావరణంలో సమావేశ మవటం, మా నాన్నగారు పాఠాలు చెప్పటం, పాఠాలు మెల్లిగా ఉపన్యాసాలు కావటం కొంతమంది బయట చూస్తూనే ఉన్నారు. అందులో పోలీసువారు ప్రముఖులు. ఇది పసిగట్టి మా నాన్నగారు కవిగారిని పాఠశాలకు ప్రారంభోత్సవం చెయ్యమని కోరారు. కవిగారు పెద్దమనిషి, అతివాది ఆయే అవకాశం సుతరామూ లేదు. కాని కవిగారిక్కూడా లోలోపల మా నాన్నగారూ, ఆయన సహచరుడైన నరసింహారావు మీద కూడా కొంత అనుమానం కలక్కపోలేదు. అప్పుడు కమ్యూనిస్టుల పేరు అంతగా ప్రచారంలో లేనప్పటికీ, అతివాదుల ధోరణి అందరికీ తెలుసు. మా నాన్నగారు చేపట్టిన కార్యక్రమం కూడా అతివాద ధోరణికి చెందినదనే కవిగారి అను మానం. ఎందుకంటే, మానాన్నగారు కవి గారిని రాత్రి పాఠశాల ప్రారంభోత్సవానికి ఆహ్వానించిన మరుక్షణం కవిగారు పురిపండా అప్పలస్వామిగార్ని పిలిపించి- రామకృష్ణారావు గారు రాజకీయాల్లో ఏ సిద్ధాంతానికి కట్టుబడి ఉన్నారో కనుక్కోమన్నారుట. అప్పలస్వామి గారు, అలా కనుక్కోవలసిన ఆగత్యం లేదనీ, రామకృష్ణారావు గారు బహుముఖ విజ్ఞాన సంపన్నులనీ, రాత్రి పాఠశాల బ్రిటిష్ కార్మిక పాఠశాలల లాంటి ప్రయోగమేననీ చెప్పారుట. అంతటితో కవిగా రాగలేదు. నన్నోసారి మెయిన్ రోడ్డులో పట్టుకుని మా నాన్నగారి గురించి తగిన ఆరా తీయటానికి ప్రయత్నం చేశారు. ఆఖరికి కవిగారు రాత్రి పాఠశాల ప్రారంభోత్సవం చెయ్యక తప్పింది కాదు. అయితే గాంధీగారి ఆదర్శాలను ఉపన్యాసంలో ఉటంకించారు. ఆయన చేతిచలవో, మా నాన్నగారి కార్యదీక్షో, పోర్టు వర్కర్సు యూనియన్ స్థాపనకు రాత్రి పాఠశాల దారితీసింది. అంతకు పూర్వం హేమా హేమీలు హార్బరు కార్మికులను సంఘటిత పరచాలని ప్రయత్నిస్తే ఫలించలేదు. అది మా నాన్నగారి విద్యా సాంస్కృతిక పథకం ద్వారా సాధ్యమయింది.

కవిగారి షష్టిపూర్తి 1933లోనో 1934లోనో జరిగింది. నిజంగా అదొక మరపురాని విశేషం. కవిగారిని ఆయన ఆశ్రమం నుంచి ఊరేగింపుతో సభామంటపానికి తీసుకొచ్చారు. తెన్నేటి విశ్వనాథం గారి కారులో కూచోబెట్టి కవిగారిని ఊరేగిస్తూ బయలుదేరారు అభిమానులు. సీతారామస్వామి కోవెల దాటి బురుజుపేట మీదుగా మెయిన్‌రోడ్డుకు వచ్చింది ఊరేగింపు,అంతే! విశాఖపట్టణం యావత్తూ ఊరేగింపులో పాల్గొన్నది. అలాంటి దృశ్యాన్ని విశాఖపట్టణంలో– విశాఖపట్టణమే కాదు మరే పట్టణంలోనూ– మళ్ళీ చూడము. ఆనంద బాష్పాలు అని విన్నాను– కవిగారు సభలో ప్రసంగిస్తుంటే ఆయన చెక్కులమీద మొదటిసారిగా నేను చూశాను. సన్మానానికి ప్రత్యుత్త రంగా అంత చక్కని ఉపన్యాసాన్ని నేనింతవరకూ ఎక్కడా వినలేదు.

కవిగారు "నుడికడలి" కోసం ఎంత పరిశ్రమించినా అది ఒక కొలిక్కి రాలేదు. దానికి కారణం ఆయన పెట్టుకున్న రకరకాల వ్యాపకాలు. చివరి రోజుల్లో అచ్చ తెలుగు మీద ఆయన మమకారం మరింత ఎక్కువై ఉత్తరాల్లో అచ్చ తెలుగు తప్ప వాడేవారు కాదు. ఉత్తరం ప్రారంభించేముందు పైన "మేల్" అని రాసేవారు. తతిమ్మా జనం సంప్రదాయకంగా శుభం అని రాస్తుండేవారు. అలాగే కవిగారికి దైవభక్తి ఉండేది. అయితే దేవుడు అనే మాటకు తెలుగు పదం దొరక్కుండా పోయింది. చాలాసార్లు వెతికి వెతికి విసుగొచ్చి ఆయనే ఓ పదాన్ని సృష్టించారు 'ఎల్లడు' అని. ఆయన ఆ మాట నాకూ, శ్రీనివాసరావుకి, అప్పలస్వామిగారికీ మొదటిసారిగా వినిపించారు. నేను ఆయన మీద గౌరవంతో అలా ఉండిపోయాను. అప్పలస్వామి గారు "బావుంది" అన్నారు. శ్రీనివాసరావు పకాలున నవ్వేశాడు.

❊

'వేదన కుతూహలం' అనే పేరుతో వెలువడిన అబ్బూరి వరద రాజేశ్వరరావుగారి వ్యాస సంకలనం నుండి సేకరించి శ్రీ కణుగుల వేంకటరావు గారు పంపించారు. వారికి ధన్యవాదాలు. –సం.

## మాతృభాషా రక్షణ– మన తక్షణ కర్తవ్యం

పద్య కవిత

**–డా॥మలయశ్రీ,** 98665 46220

❊ అందమైనవి మన తెలుగక్షరాలు
రమ్యమైనవి ఈ అక్షరాల ధ్వనులు
స్పష్టమౌ స్వరాల్ గుణితమ్ము సరళ మరయ
మధురమైనది మన తెల్గు మాట–పాట.

❊ పుట్టినది రెండువేలేండ్ల పూర్వమందు
మారి పరిణతి చెందిన మన తెలుంగు
ద్రవిడ భాషల హారాన తరళమణిగ
సుందరంబైన భాషగా స్తుతులు పొందె.

❊ వేయి వత్సరాలుగ మన తీయనైన
తెలుగు సాహిత్యమెంతయో తేజరిల్లె
వంద యేండ్లది వ్యవహార వచన రచన
పరుల పాలనముల కూడ బ్రతికె తెలుగు.

❊ అంత యేబదేండ్లదె చదువు వ్యాప్తి మనది
అంతకె వింతగా వచ్చె యెంతొ మార్పు
ప్రభుత విద్యనందించుట భారమయ్యి
వేసె ప్రైవేటు వేటు నీ విద్యపైన.

❊ తెలుగు పాఠశాలల పేరు తీరు మారె
ఆంగ్ల విద్యాలయంబుల వ్యాప్తి మీరె
మాతృభాషపై మమతయు మాయమాయె
విద్య ఉద్యోగములకను విధము చేరె.

❊ అమ్మ నాన్న లేని అర్భకుని విధాన
మనదు మాతృభాష మనికి యునికి
అన్యభాషలెన్ని యభ్యసించిన మన
తల్లి పలుకు మరువ తగనిది కద.

-అన్నపూర్ణపుత్ర **డా॥ఈమని శివనాగిరెడ్డి**
98485 98445

# శ్రీపర్వత-విజయపురి ఇక్ష్వాకులు

**శా**తవాహనుల తరువాత కృష్ణానది దిగువ ప్రాంతాన్ని పాలించినవారు ఇక్ష్వాకులు. ఇక్ష్వాకులు, ఆంధ్రభృత్యులు, శ్రీపర్వతీయులుగా పిలువబడినారు. వీరు శ్రీపర్వత-విజయపురి (ప్రస్తుత నాగార్జున కొండ) నుంచి క్రీ.శ.225 నుంచి క్రీ.శ.299 వరకూ పాలించారు. ఇక్ష్వాకు వంశ మూలపురుషుడు మొదట చాంతముంటిడని (క్రీ.శ. 225-233) అతని రెంటాల, దాచేపల్లి శాసనాలు తెలియజేస్తున్నాయి. అతని తరువాత అతని కుమారుడు వీరపురిసదత (వీరపురుషదత్తుడు) క్రీ.శ.233 నుంచి 257 వరకూ పాలించినట్లు, అతని నాగార్జునకొండ, జగ్గయ్యపేట, అల్లూరు, ఉప్పుగొండూరు శాసనాల్లోనూ, తరువాత అతని కొడుకు రుద్రపురిసదత(రుద్ర పురుషదత్తుడు) క్రీ.శ.281-294 వరకు పాలించినట్లు నాగార్జునకొండ, గురజాల, ఫణిగిర శాసనాలు పేర్కొంటున్నాయి. ఇక్ష్వాకుల కాలంలో కృష్ణానదికి ఇరువైపులా వారి అధీనంలో ఉండి, రాజకుటుంబంలోని స్త్రీలు బౌద్ధాభిమానులుగానూ, పురుషులు వైదికాభిమానులు గానూ శాసనాలు, కట్టడాలు తెలియజేస్తున్నాయి. ప్రపంచ ప్రఖ్యాతిగాంచిన నాగార్జునకొండ లోయలోని శ్రీపర్వత-విజయపురిలో దాదాపు 30 బౌద్ధారామాలు విలసిల్లి, అమరావతి శిల్పకళను అజరామరం చేసింది ఇక్ష్వాకులే. శాసనాల్లో ప్రాకృతంతో పాటు సంస్కృతాన్ని కూడా వాడిన తొలి తెలుగు రాజులుగా కూడా గుర్తింపు పొందారు. ఇక్ష్వాకురాజుల్లో **రాజన్, మహారాజస్వామి** అన్న బిరుదులతో పాటు మాతృసంజ్ఞలైన **వాసిష్టీపుత్ర, మాధరీపుత్ర, హారతీపుత్ర** అనే పదాలు రాజుల పేర్లకు ముందు పేర్కొనబడినాయి.

ఇక్ష్వాకుల మూలపురుషుడైన మొదటి చాంతమూలునికి **రాజన్ వాసేటిపుత (వాసిష్టీపుత్ర)** అనీ బిరుదు ఉన్నట్లు గుంటూరుజిల్లా రెంటాలలోని ఒక మండపంలో వున్న శాసనంలో పేర్కొనబడింది. (ఎపిగ్రాఫియా ఇండికా.. XX-XXII, పే.31). చాంతమూలుని కుమారుడైన వీరపురుషదత్తునికి **రాజన్, మహారాజు** అనే బిరుదులున్నట్టు నాగార్జునకొండ తవ్వకాల్లో బయల్పడిన 9వ నంబరు స్తూపం దగ్గర దొరికి, ప్రస్తుతం నాగార్జునకొండ మ్యూజియంలో నున్న శాసనంలో చెప్పబడింది (ఎపిగ్రాఫియా ఇండికా. వాల్యూ.... XXI, పే.63). **రాజన్ మాధరీపుత్ర వీరపురిసదత (రాజామాధరీపుత్ర వీరపురుషదత్త)** అని నాగార్జునకొండ మహాచైత్యఆయక స్తంభ (ప్రస్తుతం నాగార్జున కొండ మ్యూజియంలో ఉన్న) శాసనంలో ఉంది. (ఎపిగ్రాఫియా ఇండికా. వా.XXI , బి4 పే.13). అక్కడే వున్న మరో ఆయక స్తంభశాసనంలో **మహారాజ వాసిష్టపుత్ర ఇక్ష్వాకుచాంతమూలుడు, రాజన్ వీరపురుషదత్తుల** ప్రస్తావన ఉంది (ఎపిగ్రాఫియా ఇండికా. వా.,XX పే.18).

నాగార్జునకొండలోని మరో ఆయకస్తంభ శాసనంలో ఉజ్జయినికి చెందిన మహారాజు కుమార్తె అయిన మహాదేవి రుద్రభట్టారిక (రుద్రధరభట్టారికా) గురించి చెప్పబడింది. ఇందులో రాణికి మహాదేవి అని బిరుదు ఉండటం గమనించాల్సిన విషయం (ఎపిగ్రాఫియా ఇండికా. వా.,XXI బి4 పే.19 బి 5). మరో ఆయక స్తంభ శాసనంలో హమ్మిసిరిమ్నిక కూతురు, **మహారాజ వాసిష్టపుత్ర ఇక్ష్వాకు చాంతమూలుని** సోదరి, రాజా వీరపురుషదత్తుని భార్య, హమ్మిసిరిమ్నిక కూతురు అయిన **మహాదేవి బప్పిసిరినికా** (బప్పిసిరి) నిర్వాణ సంపత్తిని సంపాదించటానికి ఈ శిలాస్తంభాన్ని ఎత్తించిందని నమోదైంది. ఈ శాసనంలో కూడా వీరపురుష దత్తునికి **రాజన్** అన్న బిరుదు, చాంతమూలునికి మహారాజు అన్న బిరుదు, వీరపురుషదత్తుని భార్య బప్పిసిరికి **'మహాదేవి'** అన్న బిరుదూ ఉన్నట్లు చెప్పబడింది. (ఎపిగ్రాఫియా ఇండికా. వా.,XXI బి4 పే.19 సి 2). మహాచైత్య పశ్చిమభాగానున్న ఆయక స్తంభమై నున్న శాసనంలో, **మహారాజ వాసిష్టీపుత్ర ఇక్ష్వాకు చాంతమూలుడు, మహారాజ మాధరీపుత్ర వీరపురుష దత్తుడు, మహాదేవి చాంతిసిరిల** ప్రస్తావన ఉంది. ఈ శాసనంలో మహారాజ వాసిష్టీపుత్ర, మాధరీపుత్ర, మహాదేవి అనే బిరుదులున్నాయి. (ఎపిగ్రాఫియా ఇండికా. వా.. XX సి 4). మ్యూజియంలో వున్న మరో శాసనంలో మహాసేనాధిపతి, మహాతలవర వాసిష్టపుత్ర మహాఖంధ సిరి. భార్య మహాసేనాపతి, మహా తలవర విన్నుసిరి తల్లి అయిన **మహాతల్వరి** ఆయక స్థంభాన్నెత్తించిందని ఉంది. ఇందులోని **మహాసేనాపతి, మహా తలవర, మహాతలవరి** ఉద్యోగరీత్యా ఉన్నత పదవుల్ని సూచిస్తున్నాయి.

నాగార్జునకొండ తవ్వకాల్లో బయటపడిన పుష్పభద్రస్వామి దేవాలయ శాసనం (ప్రస్తుతం మ్యూజియంలో ఉంది)లో **మహారాజు** కుమారుడు, **మహాసేనాపతి, హారతీపుత్ర ఇక్ష్వాకు వీరపురుషదత్తుడు భగవతీ మహాదేవపుష్పభద్రస్వామి దేవకులాన్ని** నిర్మించి, ధ్వజ స్వంభాన్ని ఎత్తించి, అక్షయనివి(నిధి)ని మహారాజు, మహాదేవిలకు విజయం కలగాలని, ఆయువు పెరగటానికి ఈ ధర్మకార్యం చేశాడని ఉంది. ఇందులో వీరపురుషదత్తునికి 'మహారాజకుమార' అన్న బిరుదుంది (ఎపిగ్రాఫియా ఇండికా. వా.,XXXIV బి4 పే.19).

నాగార్జునకొండ జిల్లా దిగువన దొరికి, మ్యూజియంలో భద్రపరచబడిన మాతృదేవత (అమ్మ-తల్లి) విగ్రహం పీఠంమీదున్న శాసనంలో జీవించి వున్న కొడుకులు, భర్త (ఏహువల చాంతమూలుడు) గల ఖాందువులు మహాదేవి ఈ ప్రతిమను చేయించినట్లుగా ఉంది. ఇందులో మహాదేవి, మహారాజు అనే బిరుదులున్నాయి. (ఎపిగ్రాఫియా ఇండికా. వా..XXXI 84 పే.139).

నాగార్జునకొండ మ్యూజియంలోని ఛాయాస్థంభంపై వున్న శాసనంలో **మహాదేవి వమ్మిభట, మహారాజస్వామి చాంతమూలుడు, మహారాజస్వామి వీరపురుషదత్తుడు, మహారాజస్వామి ఏహువల చాంతమూలుడు-II. రాజన్ వాసిష్టీపుత్ర రుద్రపురుషదత్తుడు,** ఇంకా ఒక మహా క్షాత్రపుని గురించి ఉంది. ఈ శాసనం, అందరు ఇక్ష్వాకు రాజులను **మహారాజులుగా**, చివరిరాజును **రాజుగా** పేర్కొంటుంది. ❊

సమీక్షలు

## మట్టి బతుకులు




తెలుగులో ఇప్పుడు బాగా వస్తున్న ప్రక్రియల్లో కథానికది ప్రముఖస్థానం. జీవితంలోని సన్ని వేశాలు, బాధలు, సంతోషాలు ఆవే శాలు, ఆవేదనలు కుట్రలు కుతం త్రాలు, దోపిడీలు, దౌర్జన్యాలు, నీతి నిజాయితీలు, పోరాటాలు- ఇలా సమస్తమూ కథల్లో ప్రతిబింబిస్తూ ఉంటాయి. కథలే జీవితాలు. జీవి తాలే కథలు. కథ, కవిత్వం, పాట, నాటకం, వ్యాసం లాంటి వివిధ ప్రక్రియల్లో రచనలు చేసే వుప్పల నరసింహం కలం నుంచి జాలువారిన విభిన్ననేపథ్యాలు ఇతివృత్తాలుగా గల సంపుటి మట్టి మనిషి వుప్పల నరసింహం కథలు. ఎ.బి.కె.ప్రసాద్ తనను మట్టిమనిషిగా పరిచయం చేసినందుకు మురిసిపోయి దాన్నే ఒక బిరుదుగా అలంకరించుకొన్న వుప్పల నరసింహంలోని నిజాయితీని చూసినప్పుడు ముచ్చటకలుగుతుంది. జీవితంలోని అన్ని కోణాలను, ముఖ్యంగా తెలంగాణాలోని రంగారెడ్డి జిల్లా ప్రాంతంలోని వామపక్ష ఉద్యమం పోరాటం ఈ కథల్లో ప్రతిబింబిస్తుంది. తెలంగాణా మాండలిక భాషా ప్రయోగం ఈ కథలకు ఒక అదనపు ఆకర్షణ. ఉత్తరాంధ్ర జీవితాన్ని ప్రతిబింబించే రెండు కథలు కూడా ఈ సంపుటిలో ఉండటం గమనించ దగిన విషయం. ఇంకా నగరనేపథ్యంలోని చిన్నకథలు, మౌఖిక కథా జలముద్ర శీర్షికతో ఉన్నకథలు వుప్పల నరసింహం కథల్లోని వైవిధ్యాన్ని, కథా కథన నైపుణ్యాన్ని కళ్లకు కడతాయి.

ఒక్కొక్క కథలో ఒక్కొక వేదన. మూఢ విశ్వాసాలు, ఆపద సమ యంలో ఆదుకొనే స్త్రీలు, కళాకారులకు పొట్ట గడవని స్థితి, అగ్రవర్ణాల లోను అభ్యుదయ భావాలు గలవారు, నగర జీవితానికి ఆకర్షితులైనవారు, వెట్టిచాకిరి ఊబిలోంచి బయటపడలేని దైన్యం మొదలైన అంశాలు ఉప్పల నరసింహం కథల్లో కనిపిస్తాయి. పీడితులకు 'సంఘం' న్యాయం చేస్తుం దనే, నమ్మకంతో ముత్యాలు తనను కొడుతున్న పట్వారీపై తిరగబడ్డ సంఘటనకు ప్రతిరూపమే 'తిరగబడ్డభూమి' కథ. శ్రమ దోపిడి, కుల పంచాయితీల పేరిట జరిగే అన్యాయాలు, తాకట్టు పెట్టిన వస్తువుల్ని అమ్ముకునే దుర్మార్గులు, అమాయకుల్ని చిత్రహింసలకు గురిచేసే తీరు ఈ సంపుటిలో సాక్షాత్కరిస్తాయి. "జానపద కళాకారులు, వృత్తి గాయ కులు, ఆశువుగా పాడుకునే మౌఖిక సాహిత్య ధోరణిలో సాగిన ముద్ర కథలు ఒక సరికొత్త ప్రయోగంగా" కె.పి.అశోక్ కుమార్ భావించటం సముచితంగా ఉంది. రంగారెడ్డి జిల్లా, హైదరాబాదు జిల్లాల మాండలి కాల్లో వచ్చిన ఏకైక గ్రంథంగా ఇది పరిగణించబడటం దీని ప్రత్యేకత. వుప్పల నరసింహం మట్టిమనిషి అనటానికి ఈ సంపుటిలోని కథల్లో పొందుపరచబడిన మాండలిక భాషారచనమే సాక్ష్యం. ఇలాంటి మంచి సంపుటిని కొని చదువుకోవలసిన అవసరం ఎంతైనా ఉంది.

(**మట్టిమనిషి** -వుప్పల నరసింహం కథలు- మొదటి ముద్రణ- ఫిబ్రవరి 2016, ప్రతులకు- రచయిత జ్ఞానం పబ్లికేషన్స్- మిలీనియం హోమ్, 2-3-764/1/4, తులసీనగర్ కాలని, హైదరాబాదు- 500013. ఫోన్- 9985781799 వెల : రు.300/-)

## అమ్మఒడి గొప్పదనం




తెలుగు భాష, సంస్కృతి ప్రచారాల కోసం రచయితలు వివిధ ప్రక్రియల్లో రచనలు చేస్తూనే ఉన్నారు. ప్రస్తుత సమా జంలో కార్పొరేట్ విద్యా సంస్థలు చేస్తున్న దోపిడి పట్ల అమాయిక ప్రజలు బలి పశువులుగా మారు తున్న తీరును, తల్లిభాషలో విద్యను అభ్యసించవలసిన అవసరాన్ని గుర్తు చేస్తూ శ్రీ ఆత్మకూరు కామయ్య రచించిన నాటిక "అమ్మఒడి". ముప్పైసంవత్సరాలు ప్రభుత్వ పాఠశాలల్లో తెలుగు ఉపాధ్యాయునిగా పని చేసిన ఆత్మకూరు కామయ్య వారి ఆలోచనా విధానం ఆహ్వానించదగిన రీతిలో ఉంది.

పల్లెటూరి సన్నకారు రైతు ముసలయ్య, అతని భార్య మునెమ్మ ఒక్కగానొక్క కూతుర్ని ఇంగ్లీషు చదువులు చదివించాలనే కోరికతో ఆంగ్ల మాధ్యమ పాఠశాలకు వెళ్లటం, వాళ్లు చేసే మర్యాదల ఉచ్చులో పడి, పల్లెలో ఉన్న ఎకరా పొలం అమ్మి ముందుగా పాతికవేలు కట్టడం, ఆ తర్వాత ఒక యువకుడు చెప్పిన మాటలను విని, తమ ఊరి మాస్టారు వెంకటయ్య గారు పట్నంలో కనిపించి చెప్పిన మాటలు నమ్మి తమ ఊరికే వచ్చి పిల్లని చదివించుకోవాలనే నిర్ణయానికి రావటంతో నాటిక ముగుస్తుంది.

ఈ నాటికలో కార్పొరేట్ విద్యా సంస్థలు విద్యావ్యాపారం చేస్తున్న తీరు కళ్లకు గట్టినట్లుంది. ముఖ్యంగా ఉపాధ్యాయుల చేత పాఠాలు చెప్పించుకొని జీతాలు సరిగా ఇవ్వకపోవటం, వారి యోగ్యతా పత్రాల్ని తమ దగ్గరే ఉంచుకొని తిరిగి ఇవ్వటానికి నానా ఇబ్బందులు పెట్టడం, ఉపాధ్యాయులే పిల్లల్ని పోగుచేసుకు రావలసిన బాధ్యతల్ని నిర్వర్తించటం లాంటి విషయాలు ఈ నాటికలో ఉన్నాయి. ఈ నాటికలో యువకుడు పిల్లలకు ఐదేళ్లు నిండిన తర్వాతనే చదువు మొదలు పెట్టాలని చెప్పిన తీరు బాగుంది. ఇంకా ఆ యువకుడు "బిడ్డలకు తొలిపలుకుల్ని తల్లి ఒడిలోనే నేర్చుకోవాలి. అమ్మా అనే మాటలోని తియ్యదనం బిడ్డకు తల్లి ఇచ్చే ముద్దుల్లోనే దొరుకుతుంది" అని చెప్పి పిల్లల్ని మంచి చదువులు చదివించాలనే కోరిక తల్లిదండ్రుల్లో ఉండటంలో తప్పు లేదని, అయితే తమ తాహతును వారు మర్చిపోకూడదనే సందే శాన్ని కూడా ఇస్తాడు. అనవసరమైన ఆర్భాటాలకు పోయి జీవి తాల్ని పాడుచేసుకోకూడదని, అమ్మఒడిలో తల్లి భాషలో నేర్చు కోవటమే మంచిదని సందేశమిచ్చిన ఈనాటిక ఇప్పటికే ఎన్నో ప్రదర్శనలకి కూడా నోచుకుంది.

అమ్మఒడి నాటిక, రచన : ఆత్మకూరు కామయ్య, మొదటి ముద్రణ 2014, ప్రతులకు : రచయిత, 2761-1441, ఆదిత్య నగర్, నెల్లూరు-524 002, ఫోను : 93902 99243. వెల : రు.30/-లు.

**-డా॥గుమ్మా సాంబశివరావు,** 98492 65025

## మంచి ప్రయత్నం




ప్రాంతీయ అస్తిత్వ స్పృహ పెరగటం వల్ల తెలుగు సాహిత్యానికి ఎంతో మేలు జరిగింది. ఆయా ప్రాంతాల సాహిత్య వేత్తలు, సాహిత్యాభిమానులు తమ తమ ప్రాంతాలకు చెందిన వివిధ ప్రక్రియల రచనల్ని సేకరించి పుస్తకాల రూపంలో వెలువరించటం మెచ్చుకోదగిన విషయం. ప్రత్యేక తెలంగాణా రాష్ట్ర ఉద్యమ నేపథ్యంలో ఈ ప్రయత్నం మరింత విస్తృతమైంది. ఈ ప్రయత్నంలో భాగంగానే 'ఖమ్మం' కథలు (1911-2016) పేరుతో జ్వలిత గారు తమ సంపాదకత్వంలో ప్రకటించారు.

ఖమ్మం జిల్లా ఏర్పడిన తీరును, దాని భౌగోళిక స్వరూపాన్ని, ఈ కథా సంకలనాన్ని తీసుకురావటానికి గల ప్రేరణను జ్వలితగారి ముందు మాటలో గమనించవచ్చు. నిజానికి ఒక ప్రత్యేక సంస్థ, లేదా విశ్వవిద్యాలయం చేపట్టవలసిన పనిని జ్వలితగారు చేపట్టి శతాధిక కథల్ని సేకరించి ప్రచురించటం అభినందనీయం. ఇతరుల రచనల్ని సంకలనంగా ప్రచురించి లోకానికి అందించాలనుకొనే మనస్తత్వమే గొప్పది. అందులోను దాదాపు ఒక శతాబ్దికి పైగా ఉన్న కాలంలోని కథల్ని సేకరించి, ప్రచురించటం సులువైన పని ఏమీకాదు. ఇందుకు ఎంతో ఓపిక ఉండాలి. శ్రమ పడాలి. అంకిత భావం ఉండాలి. అవరోధాలను ఎదుర్కోవాలి. జ్వలిత గారి మాటల్ని చదివినప్పుడు ఈ విషయాలు స్పష్టమవుతాయి. ఆర్థికభారాన్ని సైతం లెక్కచెయ్యకుండా ఈ గ్రంథాన్ని ప్రచురించిన జ్వలిత గారికి సాహిత్య లోకం రుణపడి ఉంటుంది. ఈ పుస్తకానికి అభిప్రాయాన్ని రాస్తూ సంగిశెట్టి శ్రీనివాస్‌గారు రచించిన 'వికేంద్రీకృత సాహిత్యానికి ఆహ్వానం' అనే వ్యాసం పరిశోధనాత్మకంగా ఉండి బంగారానికి పరిమళాన్ని అద్దినట్లుంది.

కథల్ని సేకరించటంలోనే కాదు, విశ్లేషించి ఒక క్రమపద్ధతిలో పొందు పరచటంలోనూ జ్వలితగారు ఔచిత్యాన్ని పాటించారు. ఆయా రచయితల మొదటి కథను సంవత్సరాల వారిగా పొందు పరచటం బాగుంది. అలాగే గ్రంథం చివరన ప్రజాకవి రావెళ్ల వెంకట్రామారావు గారితో గావించిన ముఖాముఖిని చేర్చటంతో తెలంగాణా పోరాట విశేషాల్ని తెలుసుకొనే అవకాశం కలిగింది. కథకుల సంక్షిప్త పరిచయాన్ని అందించటం ద్వారా సంపాదకురాలి శ్రమ తెలుస్తున్నది.

కేవలం ఖమ్మంజిల్లాలో పుట్టిన వారికే పరిమితం కాకుండా ఉద్యోగరీత్యా, మరేకారణాలవల్లనైనా ఖమ్మం జిల్లా పరిధిలో నివాసం ఉన్న వారి రచనల్ని కూడా చేర్చి సంపాదకురాలు విజ్ఞతను ప్రదర్శించారు. ఇలాంటి ప్రయత్నాలవల్ల మరుగున పడ్డ రచయితలు, రచనలు వెలుగులోనికివస్తాయి. ఇలాగే మిగిలిన ప్రక్రియలకు సంబంధించిన రచనల్ని కూడా సంకలనం చెయ్యాల్సిన అవసరం ఉంది. అన్ని ప్రాంతాలవారికి ఇలాంటి సంకలనాలు స్ఫూర్తిదాయకంగా ఉంటాయి. 'జ్వలిత' పేరును సార్థకం చేసుకొంటూ ఇలాంటి బృహత్తర సంకలనాన్ని ప్రకటించినందుకు మరోసారి అభినందనలు. సాహిత్యాభిమానులు తప్పకుండా కొని చదవవలసిన పుస్తకం 'ఖమ్మం కథలు.'

**ఖమ్మం కథలు** (1911- 2016) సంపాదకురాలు : జ్వలిత, మొదటి ముద్రణ మార్చి 2016, వెల- రూ400/- ప్రతులకు- జ్వలిత- అక్షరవనం- ఫ్లాట్ నెం 202 శేషసాయి ప్యారడైజ్, విజయ నగర్‌కాలని-2, ఖమ్మం-2. తెలంగాణ. ఫోన్ నెం 09989198943.

-డా॥ గుమ్మా సాంబశివరావు

## బుద్ధుని మొదటి ప్రవచనం




**సా**ధారణంగా సిద్ధార్థునికి జ్ఞానోదయమైందనీ, బుద్ధుడైనాడని చెప్పుకొంటారు. జ్ఞానోదయం కావటం అంటే, సిద్ధార్థుడు సంతరించుకొన్న సంయక్సంబుద్ధత్వాన్ని ప్రాప్తించుకోవటమని కూడా చెప్పుకొంటారు.

సంబోధిని పొందిన సిద్ధార్థుడు బోధివృక్షం క్రింద, దాని చుట్టుపక్కలా ఏడువారాలపాటు ధ్యానంలో నిమగ్నమై ప్రశాంతంగా గడిపి ఒక్కో వారం ఒక్కో అనుభూతిని పొందాడు. ఏడో వారంలో రాజాయతన చెట్టుకింద విముక్తానందాన్ని ఆస్వాదిస్తూ, మనం నిర్మించుకొనే ఇంటికి లోభం, ద్వేషం, మోహం, మానం, దిష్టి, విచికిత్స, ధన, ఉచ్ఛ, అమిరిక, అనొత్తప్పలనే క్లేశాలు- వాసాలనీ, అవిద్య అనే వెన్నుగాడి ఈ వాసాలను నిలిపి ఉంచుతుందనీ, ఈ తృష్ణ అనే ఇంటిని నాశనం చేస్తే మనసు నిర్వాణమనే స్వేచ్ఛను అనుభవిస్తుందని తెలుసుకొన్నాడు.

తాను తెలుసుకొన్న జ్ఞానాన్ని (ధర్మాన్ని) వారణాసిలోని ఋషి పట్టణంలోని మృగదావనంలో నున్న ఐదుగురు భిక్షువులకు బోధించాడు. ముందుగా వారికి శారీరక సుఖాల్లో ఆసక్తులై ఉండటం, తమను తాము బాధించుకొని దుఃఖం బారినపడటం అనే రెండు అంతాల జోలికి వెళ్లకుండా మధ్యమ మార్గాన్ని అనుసరించాలనీ, చతురార్య సూత్రాలు తెలుసుకొని మధ్యమమార్గమైన ఆర్య అష్టాంగమార్గాన్ని పాటిస్తే సాటిలేని సంబోధిని సంతరించుకోవచ్చని బోధించాడు. తాను తెలుసుకొన్న ధర్మం అనే చక్రాన్ని ముందుకు సాగేట్లు చేయటం వల్ల దీన్ని ధర్మచక్ర ప్రవర్తనమన్నారు. సంయుత్త నికాయంలోని ధర్మచక్ర ప్రవర్తన సుత్తాన్ని బుద్ధుని మొదటి ప్రవచనమని కూడా అంటారు. తరువాత బుద్ధుడు ఆత్మలేదన్న అనత్తలక్ఖ సూత్రాన్నీ ఆ ఐదుగురు భిక్షువులకు బోధించాడు. రాగం, ద్వేషం మోహమనే మంటల్లో పుడుతున్న ప్రతిదీ కాలిపోతూనే ఉంది. జాతి, జరా మరణాలతో మండిపోతూనే ఉంది. పరివేదన, బాధ, నిరాశా నిస్పృహలతో మండిపోతూనే ఉంది. పై విషయాలపట్ల విరక్తుడై మోహాన్ని వీడి, విముక్తులు గావచ్చన్న ఆదిత్యపరియాయ సూత్రాన్ని గయాశీర్షలోని భిక్షువులకు బోధించాడు. ఇదంతా ......

*(మిగతా ప్రక్క పుటలో)*

## "కాసుల కబంధ హస్తాలలో కళలు, సాహిత్యం"




**వి**విధ పాశ్చాత్య రచయితలను, కళాకారులను, గతి తార్కికంగా విశ్లేషించిన పుస్తకం ఇది. ముక్తవరం పార్థసారథి పదికి పైగా నవలలు, ఎన్నో కథలు, వ్యాసాలు, ఎన్నో అనువాదాలు, ప్రపంచ దేశాల కథలు, సైన్స్ ఫిక్షన్ కథలు రాసి లబ్ధప్రతిష్ఠుడైన రచయిత, 'ప్రజాసాహితి'లో ధారావాహికంగా వెలువరించిన 43 వ్యాసాల సమాహారం ఇప్పుడు 'జనసాహితి' ద్వారా పుస్తకరూపం దాల్చింది.

ఈ పుస్తకానికి ఆంగ్లమాతృక, ప్రఖ్యాత అమెరికన్ సామ్యవాద రచయిత, నవలాకారుడు, శతాధిక గ్రంథకర్త, మక్– రేకింగ్ జర్నలిస్ట్ (అక్రమాలను, అన్యాయాలను దుమ్ముదులిపే పత్రికా రచయిత) అప్టన్ సింక్లేర్ (1878–1968) స్వయగా ప్రచురించి 1925లో విడుదల చేసిన "మమనార్ట్–యాన్ ఎస్సే ఆన్ ఎకనామిక్ ఇంటర్‌ప్రిటేషన్" "Mammon Art-An essay on economic interpretation". 'మమన్' అంటే ధనదేవత. నాగరికత ఆవిర్భావం నుండి వివిధ రంగాల కళాకారులు తమ మానసపుత్రికలను ఆ ధనదేవత పాదాల చెంత నైవేద్యంగా సమర్పించుకున్నారని సింక్లేర్, ఆర్థిక కోణం నుండి చేసిన కళాధ్యయనమే ఈ పుస్తకం. అయితే ఈ పుస్తకం అమెరికన్, యూరోపియన్ పాఠకులని దృష్టిలో పెట్టుకుని రాసింది. పాశ్యాత్య, అమెరికన్ సంప్రదాయ రచయితలుగా ప్రసిద్ధి చెందిన వారి రచనలను సామ్యవాద దృక్కోణంతో చూసి సూటిగాను, ఘాటుగాను చేసిన విమర్శనా వ్యాసాలు ఇవి.

అత్యంత ప్రాచీన గ్రీకుకళా సాహిత్యాల గురించి ఇటాలియన్, ఫ్రెంచి, జర్మన్, ఇంగ్లండ్, స్కాట్లండ్, ఐరిష్, మొ॥గా హోమర్ నుండి షెల్లీవరకు 85 మంది సాహిత్యకారుల గురించిన వ్యాఖ్యలున్నప్పటికీ, కళ ఏవిధంగా డబ్బుపరం అయిందీ, అధికార వర్గానికి వూడిగం చేసే కట్టుబానిసగా మారిందో విపులంగా చర్చిస్తాడు రచయిత, కళాసాహిత్యాలను నేటివ్యాపార విలువలు నిర్దేశిస్తున్నాయని, డబ్బు ఎర చూపి రచయితల్ని తనకు దాసులుగా చేసుకున్న అమెరికన్ పెట్టుబడి దారీ విధానం మీది కోపంతోను, అమ్ముడుపోయిన రచయితల కళాకారుల గురించిన తపనలోను రాసిన విమర్శనా గ్రంథం ఇది.

కళ, కళావిర్భావం, కళారూపాల పరిణామ క్రమం, కళల వర్గ స్వభావం, మొ॥ అంశాలపై దీర్ఘంగా చర్చిస్తాడు సింక్లేర్. సమకాలీన ప్రజాసమస్యలతో, ఉద్యమాలతో మమేకం కాని వారెవ్వరూ గొప్ప కళను సృష్టించలేరంటాడు. కళాకారుడి లక్ష్యం కేవలం కళారూపాల్ని సృష్టించటం మాత్రమే కాదు. అతడు కొత్త సమాజాన్ని నిర్మించే సృష్టికర్త కూడా కావాలి. అదే ఈ పుస్తకంలోని సందేశం అనిపిస్తుంది. ప్రజల పక్షం వహించని కళాకారుడు ఎంత గొప్పవాడైనా చరిత్ర అతన్ని క్షమించదు అని ఘంటాపథంగా చెప్తాడు.

"ఆంగ్లమాతృకకు అనువాదం కాదు, అనుసరణ .... అని కూడా ధైర్యంగా చెప్పలేను అంటారు" పార్థసారథి తనముందు మాటల్లో వాదనా పటిమ సింక్లేర్‌దే అయినా అనేక చోట్ల అవసరమని తోచిన చోట మార్పులు, చేర్పులు చేశానని పేర్కొనటం జరిగింది. కేవలం ఆంధ్రానువాదమే చేసినట్లయితే అంతగా పఠనాసక్తిని కలిగించేది కాదేమో! రచయితే చెప్పినట్లుగా తెలుగు పాఠకులకు సులభంగా అర్థం అయ్యేందుకు ఆయా రచయితల జీవిత విశేషాలు, కృషినీ తెలియచేసే విధంగా జోడించారు పార్థసారథి. అదే విధంగా మూలరచనలోని సమాచారాన్ని మనకు అవసరమనుకున్న చోట కుదించటమో, స్పష్టతకోసం పెంచటమో చేశానని రచయిత చెప్పటం, ఆ విధంగా చేసినందువలనే తెలుగు పాఠకులు ఆ పాశ్చాత్య రచయితల గురించి తెలుసుకునే మంచి అవకాశం కలిగిందని చెప్పవచ్చు.

దాదాపు 90 సం॥ల క్రితం వెలువడి ఎందరో పాశ్చాత్య కళా సాహిత్యకారుల గురించి ఆంగ్లంలో ప్రముఖ అమెరికన్ సోషలిస్టు రచయిత అప్టన్‌సింక్లేర్– మమనార్ట్‌ను పరిచయం చేయవలసినపుడు, తెలుగు పాఠకుల సౌలభ్యం గురించి పార్థసారథి అనుసరించిన రచనా విధానం సమంజసమే అని చెప్పాలి. వస్తువు పాశ్చాత్యమే అయినా రచయిత తెలుగు దనం తీసుకుని వచ్చి చదవటానికి...ఆసక్తి కలిగించటంలో కృతకృత్యులయ్యారు. ముఖ్యంగా ప్రపంచ సాహిత్యంలో గొప్ప రచయితలను గురించి తెలుసు కోవటానికి ఈ పుస్తకం తోడ్పడుతుంది. కళ గురించీ ప్రజా కళాదృక్పథం గురించీ, ప్రజా సాహిత్యోద్యమ దృక్పథం గురించి, రచయితల, కళాకారుల జీవితా దర్శాల గురించి, వారి తప్పొప్పుల గురించి నిష్పక్షపాతంగా అర్థం చేసుకోటానికి ఉపయోగపడే ఈ పుస్తకాన్ని చక్కటి సులభమైన శైలిలో అందచేశారు రచయిత.

**కాసుల కబంధహస్తాలలో కళలు, సాహిత్యం** మమనార్ట్ (Mammon Art) : అప్టన్ సింక్లేర్ ఆంగ్ల రచన ఆధారంగా తెలు గులో పరిచయం – ముక్తవరం పార్థసారథి. 200 పుటలు, వెల : రు.75/–లు. ప్రతులకు : మైత్రి బుక్‌హౌస్, కార్ల్‌మార్క్స్‌రోడ్, విజయవాడ–520 002.

**–ఎం.వి.శాస్త్రి,** 94413 42999

---

**(బుద్ధుని మొదటి ప్రవచనం..**48వ పుట తరువాయి)

'బుద్ధుని మొదటి ప్రవచనం' (ధర్మచక్ర ప్రవర్తనసుత్తం)లో మనం తెలుసుకోగలం. ఈ పుస్తకం చివరన పాళీ మూలంలో 'ధమ్మచక్క ప్పవత్తన సుత్తం' 'అనత్తలక్ఖనసుత్తం' 'ఆదిత్తపరియాయసుత్తం'లను పొందు పరచారు. ఈ పుస్తకాన్ని తెలుగు పాఠకలోకానికి మొదటి సారిగా అందించిన రచయిత డా॥ఈమని శివనాగిరెడ్డి గారు, ప్రచురించిన ఎస్.ఆర్.బుక్‌లింక్స్ అధినేత దిట్టకవి రాఘవేంద్రరావు గారు అభినందనీయులు.

బుద్ధుని మొదటి ప్రవచనం (ధర్మచక్రప్రవర్తన సూత్రం) సంకలనకర్త : అన్నపూర్ణాపుత్ర ఈమని శివనాగిరెడ్డి, పేజీలు : 60, వెల రు.45/–లు. ప్రతులకు : ఎస్.ఆర్.బుక్‌లింక్స్, విజయవాడ–4, ఫోన్ : 9491962759, ధర్మదీపం ఫౌండేషన్, హైదరాబాదు స్టడీ సర్కిల్, హైదరాబాదు–500 029, ఫోన్ : 040–27638527.

**–గోళ్ళ నారాయణరావు**
92464 76686








## ముచ్చటగా మూడు

ప్రాచీన సాహిత్యానికి ప్రజాదరణ లేని ఈ రోజుల్లో దానికి పూర్వవైభవం తీసుకురావాలనే సదాశయంతో ప్రాచీన గ్రంథాలను పరిశోధించి, పరిష్కరించే పాండిత్యం కలిగిన పండిత ప్రకాండుడు ఉన్నం జ్యోతివాసు. ఆయన పరిష్కరించినవి రెండు కావ్యాలు, ఆయన సంపాదకునిగా వ్యవహరించినది మరొకటి – ముచ్చటగా మూడు.

దీనిలో మొదటిది–కూచిమంచి జగ్గకవి ప్రణీతమైన సుభద్రా పరిణయం. జగ్గకవి వంశం గురించి, కథాకథనం గురించి, పరిష్కరించిన జ్యోతివాసు శ్రమ అనన్యం. ఈ పీఠిక చదివితే తెలుగులో సుభద్రార్జునుల వివాహాన్ని గురించిన సమగ్ర సమాచారం లభ్యమవుతుంది. అసలు గ్రంథం ఎన్ని పుటలో, అన్ని పుటల్లో వ్రాయబడిన ఈ పీఠిక ఒక పరిశోధన లాగా సాగింది. ఏదైనా విశ్వవిద్యాలయానికి సమర్పిస్తే ఒక పరిశోధన పత్రంగా భావించి డిగ్రీ ఇవ్వదగిన అంశాలన్నీ ఇందులో ఉన్నాయి.

రెండవది– కంకంటి పాపరాజు రచించిన విష్ణుమాయా విలాసం. ద్విపదలో వ్రాయబడిన ఈ కావ్యాన్ని పుష్పగిరి తిమ్మన రచించి ఉంటాడనే వాదనలోని అంశాలను ప్రస్తావించినా, పాపరాజే రచించి ఉంటాడని పరిష్కర్త భావించాడు. దానికి ఉపపత్తులు చూపిస్తే బాగుండేది. కావ్య కథ, కావ్య విశేషాలు, ఆనాటి పరిస్థితులు ఇందులో చర్చించబడ్డాయి. ఎల్లన విష్ణు మాయానాటక పద్య కావ్యానికి పాపరాజు ద్విపద కావ్యానికి గల పోలికలు చెప్పి, ఇది ద్విపదీకరణ అని పరిష్కర్త తెలియజేశారు. గణ యతి భంగాలను గుర్తించి దిద్దినవాటితో పాటు, దిద్దడానికి వీలుపడని వానిని చూపించడం వారి నిజాయితీని తెలియజేస్తుంది.

మూడవది– దీపాలవారి కావ్యావళి. దీపాల పిచ్చయ్య శాస్త్రి జగమెరిగిన పండితకవి. అటు కవిగా ఇటు విమర్శకునిగా ఆంధ్రదేశమంతా గుర్తించిన వ్యక్తి ఆయన. దీపాలవారు రచించిన తొమ్మిది కావ్య కుసుమాలను మాలగా చేసి, వారి జీవిత విశేషాలతో ప్రచురించడం సాహితీప్రియులు సంతోషించదగిన అంశం. ఈ తొమ్మిదింటిలో శతకాలున్నాయి. ఖండకావ్యాలున్నాయి. అధిక్షేప, స్మృతి కావ్యా లున్నాయి. వీటికి అప్పటి పీఠికలనే ఉంచడం. పీఠికలు లేని వాటికి ఆధునికుల చేత వ్రాయించడం బాగుంది. పద్య కవిత్వం మీద ప్రేమతో జ్యోతివాసు చేస్తున్న సాహిత్యసేవ ప్రశంసకు పాత్రమయిందే. **సుభద్రా పరిణయం** : పుటలు మొత్తం 320, వెల– 200/– **విష్ణుమాయా విలాసం–** మొత్తం. పుటలు–260, వెల–200/–**దీపాలవారి కావ్యావళి–** పుటలు మొత్తం–350, వెల–250/– ప్రతులకు : ఉన్నం జ్యోతివాసు, వేములపాడు పోస్టు, వయాపెరిదేపి, ప్రకాశం జిల్లా –523273.




## నామ విజ్ఞానము

తమ ఊరుపేరు ఎలా వచ్చిందో తెలుసుకోవాలనే జిజ్ఞాస కలిగిన ఏ వ్యక్తికయినా సందేహనివృత్తి చేసి సమగ్ర సమాచారాన్ని అందివ్వగలిగిన ఏకైక పండితులు ఆచార్య బాలగంగాధరరావు గారు. నామ విజ్ఞానాన్ని ఒక శాస్త్రంగా ఆంధ్రదేశానికి పరిచయం చేసింది వారే. ఆ శాస్త్రానికి ప్రణాళికను తయారుచేసి, నాగార్జున విశ్వ విద్యాలయంలో బోధనాంశంగా బోధించింది వారే. తాలూకా గ్రామ నామాలపై పలువురి చేత పరిశోధనలు చేయించింది వారే. నామ విజ్ఞానము అనే పేరు వినిపిస్తే, ఆ ప్రక్కనే వినిపించే మరొక పేరు యార్లగడ్డ బాలగంగాధరరావు గారిదే.

ఊరు ఏర్పడిన తరువాత పేరు పెడతారా? పేరు పెట్టిన తరువాత ఊరు ఏర్పడుతుందా? చాలామంది తమ తెలివి తేటలు ఉపయోగించి, ఉన్న పేరుకు ఏదో వ్యుత్పత్తిని కల్పించి ఊరు తరువాతనే పేరు అని చంకలు కొట్టుకుంటారు కాని ముందు భౌగోళిక, నైసర్గిక పరిస్థితుల ఆధారంగా ఒకస్థలానికి పేరు వస్తుందని, అక్కడ ఏర్పడిన ఊరుకు ఆపేరు స్థిరపడి పోతుందని బాలగంగాధరరావు గారు ఉపపత్తులతో నిరూపించారు. ఒక వేళ ముందు చెప్పిన వారి వ్యుత్పత్తి వాదమే నిజమయితే లంజ, వెలది, కోమలి అనే గ్రామాలపేర్లను ఎలా సమర్థించాలి?

పేరు అనేది సమూహాన్నుంచి వేరు చేసి ప్రత్యేకంగా చూపించే ప్రక్రియ. గుర్తించడానికి వీలుగా ఈ ప్రక్రియ ప్రారంభమయింది. ఆ క్రమంలోనే స్థలనామాలు, వాటినుంచి గ్రామనామాలు ఏర్పడ్డాయి. వీటితోపాటు గృహనామాలు ఏర్పడిన తీరు, వ్యక్తినామాలు ఏర్పడిన విధానం. చెట్లు, వస్తువులు పేర్లు స్థిరపడిన పద్ధతి ఒక శాస్త్రంగా బాలగంగాధరరావు గారు నిరూపించారు. 'ఓనమాస్టిక్స్' అనేపేరుతో ఈ శాస్త్రంలో ఇతర దేశాల్లో పరిశోధనలు జరిగినా, ఆంధ్రదేశంలో తెలుగుపేర్లను గురించి పరిశోధన సాగించినదీ పరిశోధన చేయించి అనేక విశేషాలను వెల్లడించిందీ వీరే. తెలుగులో నామ విజ్ఞానం గురించి జరిగిన కృషితోపాటు అనుబంధాలుగా అగ్రహారాలు, మాన్యాలు, ఈనాములు, అనుభవహక్కులు, భూమిల్లోనిరకాలు, పన్నుల పేర్లు, నాడులు–సీమలు అనే పూర్వ కాల సంబంధమైన అంశాలను చెప్పడం గతాన్ని మరచిపోతున్న తెలుగు వారికి మళ్ళీ గుర్తుచేయడమే.

తమ ఊరు గురించో, తమపేరు గురించో తెలుసుకోవాలన్నా, నామ విజ్ఞాన విశేషాలు తెలుసుకోవాలన్నా ఈ పుస్తకం ఎంతో తోడ్ప డుతుంది. **నామ విజ్ఞానము**–గ్రంథకర్త : ఆచార్య యార్లగడ్డ బాలగంగాధరావు, వెల–రు. 200/– పుటలు :286, ప్రతులకు: గ్రంథకర్త, 15–35 నిర్మలాసదన్, శ్రీనివాస కాలని, సిరినగర్, కెనడి స్కూలు వెనుక, బందరు రోడ్డు, విజయవాడ–ఫోన్ : 98494 99169.

**–డా॥నాగభైరవ ఆదినారాయణ,**
98497 99711

Owned, printed & published by Samala Lakshmana Babu (9440448244) and printed at Sri Mahalakshmi Offset Printers, 16-7-20, Veera Raghavulu Street, Sharabu Bazaar, Tenali, Guntur Dist. and published from 8-386, Jivaka Bhawan, Angalakuduru Post, Tenali Mandal, Guntur Dist. - 522211. Editor: Dr. SAMALA RAMESH BABU (9848016136)
RNI-APTEL/2015/62362

AMMANUDI (Telugu Monthly)
July 2016, Vol.2, Issue 5

RNI-APTEL/2015/62362
Postal Reg. No.TEN/12/2015-17

విశ్వసనీయత-భద్రత-పారదర్శకత సంస్థ లక్ష్యంగా

# ది కాకతీయ కో-ఆపరేటివ్ సొసైటీ(లి) తెనాలి

స్థాపితం : 2001

Opp.NGO's కళ్యాణమండపం, సత్యనారాయణ పార్కురోడ్డు, కొత్తపేట, తెనాలి.

ఫోను : 08644-235671, 235672

**Regd. No. A.M.C./G.N.T/D.C.O/2001/532**

బ్రాంచీలు : 1. **అంగలకుదురు**, ఫోన్ : 08644-233299
2. **కొల్లూరు**, ఫోన్ : 08644-243788

## ఖాతాదారులకు మా సేవలు

డిపాజిట్స్‌పై యితర బ్యాంకులకన్నా అత్యధిక వడ్డీ **11%**

సీనియర్ సిటిజన్స్‌తో పాటు 58 సం।రాలకు రిటైరయిన ప్రభుత్వోద్యోగులకు 55 సం॥రాలు నిండిన మహిళలకు సంవత్సరంపై కాలపు డిపాజిట్స్‌పై ఒక శాతం అదనపు వడ్డీ **12%**

- డిపాజిటర్స్‌కు చెల్లించు వడ్డీపై మూలం వద్ద టి.డి.యస్.పన్ను కోత లేదు.
- సీనియర్ సిటిజన్స్ డిపాజిట్స్‌పై 72 నెలలకే రెట్టింపు కన్నా ఎక్కువ. రు.10,000-00ల డిపాజిట్‌పై 72 నెలలకు రు.20,328-00లు.
- ఒక లక్ష రూపాయలకు 72 నెలలకు రు.2,03,279-00లు.
- సాధారణ డిపాజిట్‌పై రు.10,000-00ల డిపాజిట్‌పై 78 నెలలకు రు.20,245-00లు రు.1,00,000-00లకు 78 నెలలకు రు.2,02,455-00 లు.
- ప్రతిరోజూ తక్కువ వడ్డీకే తక్షణం మంజూరయ్యే 'గోల్డులోన్స్'పై 14% వడ్డీ.
- ఇళ్లు, ఇళ్ల స్థలాల హామీపైన, వ్యక్తిగత జామీనుపైన 16% వడ్డీతో అప్పులివ్వబడును.



వ్యవస్థాపక అధ్యక్షులు
కీ.శే.దావులూరి
సోమశేఖరరావు గారు

శ్రీ దావులూరి లక్ష్మీకాంతరావు, అధ్యక్షులు
శ్రీ గ్రంథి చంద్రమౌళీశ్వరరావు, ఉపాధ్యక్షులు
శ్రీ చిరుమామిళ్ళ రవీంద్రబాబు, డైరెక్టర్
శ్రీ కఠారి వాసుదేవనాయుడు, డైరెక్టర్
శ్రీ వేదాంతం సుబ్రహ్మణ్యశాస్త్రి, డైరెక్టర్

శ్రీ గెద్దటి బాబూరావు, డైరెక్టర్
శ్రీ బొల్లినేని వెంకట్రావు, డైరెక్టర్
శ్రీ షేక్ ఖలీల్, డైరెక్టర్
శ్రీ యడ్లపాటి విజయరంగనాథ్, డైరెక్టర్
శ్రీ పి.ఎస్.ఆర్.బ్రహ్మాచార్యులు, డైరెక్టర్



అధ్యక్షులు
శ్రీ దావులూరి
లక్ష్మీకాంతరావు గారు

**ది కాకతీయ కో-ఆపరేటివ్ సొసైటీలో సభ్యులుగా చేరండి.**
**డిపాజిట్స్ చేయండి-అధిక లాభం, విలువైన సేవలు పొందండి.**